

# మహాయోగులు



రచన

కొత్తపల్లి హనుమంతరావు




ఋషి బుక్ హౌస్

14-11-14/1, అచ్యుతరామయ్య వీధి,

హనుమాన్‌పేట, విజయవాడ-520 003.




# MAHA YOGULU

by Kottapalli Hanumantha Rao

*First Edition*
December, 2001

Cover Design
N.V. Ramana

*D.T.P. at*
Cyber Graphics,
Vijayawada - 3.

*Printed at*
Swamy Offset Printers,
Vijayawada - 3.

*Price*
Rs. **30-00**

*Published by :*
rushi book house
14-11-14/1, Atchutaramaiah Street,
Hanumanpet, VIJAYAWADA - 520 003.
Phone : 0866 - 579190

## 1. ఆదోని తిక్కలక్ష్మమ్మ (1815 - 1933)

జీవితకాలంలో భౌతిక శరీరంతోను, సమాధి చెందిన తరువాత సూక్ష్మ శరీరంతోను ఆంధ్ర కర్ణాటక ప్రజల పూజలు అందుకొంటున్న అవధూత ఆదోని తిక్కలక్ష్మమ్మ. కర్నూలు జిల్లాలోని ఆదోని పట్టణంలో ఆమె సమాధి ఒక యాత్రా స్థలం. ఆదోనికి ఏడుమైళ్ళ దూరంలో గల మూసాన పల్లెలో మాదిగ మంగమ్మ, బండెప్ప దంపతులకు మొదటి సంతానంగా 1815లో జన్మించిన యోగిని తిక్కలక్ష్మమ్మ. ఆమె బాల్యం నుంచే అన్న పానాదులు, ఆట పాటలపై ఆసక్తి లేక మౌనంగా ఉండేది. వివాహం చేసిన ఆమె తీరు మారలేదు. ఇరవైఏళ్ళ వయసులో ఆమె ఆదోని పట్టణ వీధుల్లో నిద్రాహారాలు, ఎండవానలు లెక్కచేయక మౌనంగా ఏదో వెతుకుతున్నట్లు కూనిరాగాలు తీస్తూ తిరుగుతుండేది. ఒక సత్పురుషుడు ఆమె చెవిలో ఉపదేశం చేయడంతో సమాధి స్థితిలో పడింది. గంటల తరబడి సమాధిలో ఉన్న తరువాత లేచి ప్రతిరోజూ వీధుల వెంట తిరుగుతూ కసువు తొట్ల వద్ద కూర్చోవడం, పరుండటం చేయటంతో ఆమెను తొట్టిలక్ష్మమ్మ, తిక్కలక్ష్మమ్మ అనిపేర్లు పెట్టారు. కాని ఆమెను త్రికాల జ్ఞానిగా, నిగ్రహానుగ్రహ సమర్థురాలుగా గ్రహించిన కొందరు ఆమెను భక్తి ప్రేమలతో ఆదరించేవారు. ఆమె ఎన్నో మహిమలు ప్రదర్శించేది. ఆమెకు ఖండ యోగం తెలుసు. ఆమెకు దూరదృష్టి, దూరశ్రవణం, పరచిత్త జ్ఞానం, భవిష్యత్ జ్ఞానంతో భక్తుల, దీనుల సమస్యల పరిష్కారాన్ని, భవిష్యత్తును సూచించేది. ఆమె ఆరు బయట పడుకున్నప్పుడు వర్షం పడితే ఆమె మీద పడేది కాదు. ఒక్కొక్కప్పుడు రెండు మూడు రోజులు వరుసగా నిర్వికల్ప సమాధిలో బ్రహ్మానుసంధానం చేస్తూ ఉండిపోయేది.

శ్రీముఖ నామ సంవత్సర వైశాఖ బహుళ సప్తమి మంగళవారం ఉదయం 16-5-1933న ఆమె దేహం చాలించింది. తరువాత ఆమె పేరిట మఠం నిర్మించి ప్రతి శుక్రవారం విశేష పూజలు, ప్రతిరోజూ నిత్య పూజలు, అభిషేకాలు ప్రతియేటా ఆదోనిలోను, కర్ణాటకలోని రాయచూరు జిల్లా ఎలుబుగిరిలోను అమ్మ ఆరాధనోత్సవాలు ఈనాటికీ వైభవంగా నిర్వహిస్తున్నారు.

## 2. అనుమ సముద్రంపేట నాయబ్ రసూల్ (1720-1780)

సయ్యద్ హాజీ రహ్మతుల్లా నాయబ్ రసూల్ సమస్త విశ్వానికీ భగవంతుడొక్కడే అని త్రికరణశుద్ధిగా నమ్మి, ఆచరణాత్మకంగా నిరూపించిన మహాపురుషుడు 'రహ్మతుల్లా' అంటే భగవదనుగ్రహం అని అర్థం. 'నాయబ్ రసూల్ ' అనేది మహమ్మదు ప్రవక్త ప్రతినిధిగా గుర్తించిన బిరుదు. ఇరాన్ దేశీయులైన హజ్రత్ ఖాజా ఆలం కన్నడ దేశం బీజాపూర్ జిల్లా బెల్గాం పట్టణంలో జుమ్మా మసీదు పాలన, పోషణ, పరిశుభ్రతల బాధ్యత వహించేవారు. ఆ దంపతులకు 1720లో జన్మించిన శిశువుకు ఖాజా రహ్మతుల్లా అని నామకరణం చేశారు.

రహ్మతుల్లా ఏడేళ్ళ వయసులోనే ఖురాన్ షరీఫ్ కంఠస్థం చేశారు. 8వ ఏట నుండి అరబ్బీ,

ఉర్దూ ఫార్సీ సాహిత్యాలను అధ్యయనం చేశాడు. ఆ వయసులోనే తల్లి చనిపోవడంతో సవతి తల్లిపోరు భరించలేక 15వ ఏట బెల్లాం విడిచి వివిధ ముస్లిం పవిత్రక్షేత్రాలు దర్శించి కర్నూలు జిల్లా నంద్యాల చేరారు. అక్కడ హబీబా అనే పేద కన్యను వివాహం చేసుకోగా ఆమె కొంతకాలానికే హఠాత్తుగా చనిపోవడంతో కర్నూలు నవాబు సైన్యంలో సిపాయిగా జేరారు. అదే సమయంలో మారిఫత్, తసవ్వుఫ్ అనే ఇస్లాం వేదాంత విషయాలు తెలుసుకోవాలనే జిజ్ఞాస అతనిలో ప్రబలమైంది. అదే సమయంలో అరేబియా దేశానికి చెందిన హజ్రత్ అలవిబ్రూం రహ్మతుల్లా అల్లె కర్నూలు రాగా రహ్మతుల్లా అయనను 12 ఏండ్లు సేవించి అనేక ఆధ్యాత్మిక విషయాలు తెలుసుకున్నారు. అనంతరం రహ్మతుల్లా మక్కా చేరి అబ్బేకుంబిన్ కొండపై మక్కీరహ్మతుల్లాను దర్శించి దీవెనలందుకుని 41 దినాలు దీక్ష వహించారు ఫలితంగా మహ్మద్ రసూలిల్లా సమాధినుండి వెలువడిన దివ్యాదేశం మేరకు ప్రజలు అయనను నాయబ్ రసూల్ (ప్రవక్త) ప్రతినిధిగా పిలువసాగారు. అయన ఎన్నో అద్భుతాలు, మహిమలు ప్రదర్శించారు. ఎందరో అయనకు శిష్యులయ్యారు.

నాయబ్ రసూల్ రహ్మతాబాద్‌లో 1763 లో ఒక మసీదు నిర్మించి, దాని సమీపంలో ఒక యోగాశ్రమాన్ని నెలకొల్పుకున్నారు. 1780 లో అయన మెడమీద కంతి పెరగడంతో చికిత్సకై వనమూలికలకోసం ఉదయగిరి కొండపైకి వెళ్లారు. అక్కడే అయన దేహం చాలించారు. అనాసముద్రం పేట ప్రజలు 1-4-1780 వికారినామ సంవత్సర ఫాల్గుణ బహుళ ద్వాదశి శనివారం నాడు అనాసముద్రంపేటలోనే సమాధి చేశారు. నెల్లూరుజిల్లా అనాసముద్రంపేట లూ ప్రతిఏటా నాయబ్ రసూల్ ఉత్సవాలు ఘనంగా జరుపుకుంటారు.

## 3. అన్నారెడ్డిపాలెం రామయోగి (1895-1962)

చదువు లేకపోయినా సంస్కారవంతులు కావడం, విద్యలు నేర్చుకోలేక పోయినా విజ్ఞాన ఖనులు కావడం పూర్వజన్మసుకృతం. ఆ కోవకు చెందిన సత్పురుషుడు అన్నారెడ్డి పాలెం రామయోగి. అయన నెల్లూరు జిల్లా వేదాద్రి సమీపంలోని మోపూరులో చేపూరు రామమ్మ, పిచ్చిరెడ్డి దంపతులకు మన్మథ నామ సంవత్సర శ్రావణ శుద్ధ అష్టమి సోమవారం (29-7-1895)న జన్మించారు. ఆ శిశువుకు రామిరెడ్డి అని పేరు పెట్టారు. పసితనంలోనే తండ్రి చనిపోవటంతో రామిరెడ్డి మేనమామల ఆశ్రయంలో అన్నారెడ్డిపాలెంలో పెరిగి చతుపుసంధ్యలు సాగించారు. భారత, భాగవతరామాయణాలు, వాటిలోని సత్యదృష్టి, ధర్మ విచక్షణ అయనకు ఒంటబట్టాయి. రామాయణ కర్త వాల్మీకి, మాదిరిగా తపోనిష్ఠుడు కావాలని, పరమభక్తుడు కబీర్‌దాసు వలె వైరాగ్య సంపన్నుడు కావాలనే తపనతో రామిరెడ్డి గంటల తనబడి ధ్యానంలో నిమగ్నమయ్యారు. భగవత్ సాక్షాత్కారం కోసం ఆవేదన ఎక్కువై ఈశ్వర చింతన, రామనామ స్మరణం, ధ్యాన నిరతిలను ఏకాగ్రచిత్తంతో సాధించారు. బాపట్ల

బ్రహ్మానంద తీర్థులు నెల్లూరులో ఆధ్యాత్మిక ఉపన్యాసాలు పండిస్తున్న రోజులో రామిరెడ్డి ఆయనను ఆశ్రయించి రామతారక మంత్రోపదేశం పొందారు. గురువు ఆదేశం మేరకు రోజుకు ఐదువేల సార్లు ఆ మంత్రాన్ని జపించడంతో జ్ఞానపిపాస, ఆత్మజిజ్ఞాస ఎక్కువై వైరాగ్యం పూర్ణమైనది. సర్వం త్యజించి దూరంగా హిమాలయాల్లో తపస్సుకు బయలుదేరారు. అయితే దారిలో గురువు ఆదేశం మేరకు స్వగ్రామానికి తిరిగి వచ్చి తోటలో కుటీరం నిర్మించుకుని ఏకాంతంగా జపధ్యానాలు తీవ్రతరం చేశారు. రాత్రిపూట 6మైళ్ళు నడిచి నరసింహులు కొండకు వెళ్ళి తపస్సు చేసి తెల్లవారే సరికి ఆశ్రమానికి వచ్చేవారు. ప్రాణాయామం, మౌనం, యోగాసనాలు, తితిక్ష చిత్త నిరోధం, సహన శీలత, ఏకాంతవాసం, నిష్కామప్రవృత్తి, సమభావం, అష్టాంగయోగం సాధించారు. నిర్వికల్ప సమాధిలో ఆయనకు ఏకం నిత్యం అయిన స్వస్వరూపమే ప్రకాశించింది. కొంతకాలం రమణ మహర్షిని గురువుగా సేవించారు. మామిడి గుహలో తపస్సు చేసి అనంతరం అన్నారెడ్డిపాలెంలో ఆశ్రమం నిర్మించుకున్నారు. 12 ఏళ్ళు మౌనవ్రతం పాటించారు 1936 ఫిబ్రవరిలో పల్లెపాడు ఆశ్రమంలో ఉన్న రామయోగి చతుర్భుజాలతో మహా విష్ణుమూర్తి సాక్షాత్కారం పొందారు. రమణ మహర్షి సందేశాన్ని రామయోగి ప్రతి పల్లెకు అందించారు. ప్లవ సంవత్సరం మాఘశుద్ధ అష్టమి సోమవారం 12-2-1962న రామయోగి తమ శరీరాన్ని వదిలి పరబ్రహ్మ స్వరూపులయ్యారు. ఒక భక్తురాలు కట్టించిన మందిరంలో శ్రీవారిని సమాధి చేశారు.

## 4. అబ్బూరు నారాయణస్వామి (1907-1989)

బ్రహ్మర్షి అనిపించుకున్న విశ్వామిత్రుని కోవలో అనాయాసంగా బ్రహ్మర్షి పదాన్ని లభింపజేసుకున్న నారాయణస్వామి గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలోని ఆదర్శ గ్రామం అబ్బూరులో కొమ్మూరు గుణకయ్య, మాణిక్యమ్మ ఆదర్శ దంపతులకు 18-11-1907 ప్లవంగ సంవత్సరం కార్తీక శుద్ధ చతుర్దశి గురువారం జన్మించారు. బాల్యం నుంచి పెద్దల వద్ద భారత భాగవతాల సారాన్ని గ్రహించటంలో మక్కువ చూపేవారు. ఎనిమిదవ ఏట ఒకనాడు నారాయణస్వామి నిశ్చల భగవద్ధ్యానంలో ఉండగా పార్వతీ పరమేశ్వరులు సాక్షాత్కరించి శ్రీరామతారక మంత్రాన్ని ఉపదేశించారు. జీవితాంతం ఆ మంత్రాన్నే జపించాలని, అవసానకాలంలో అర్హుడైన భక్తునికి మాత్రమే ఆ మంత్రాన్ని ఉపదేశించాలనీ, 15వ ఏట ఒక యోగి రూపంలో వచ్చి అష్టాక్షరీమంత్రం ఉపదేశిస్తామనీ పరమశివుడు ఆదేశించారు. బడిలో చదువు, గుడిలో తారక మంత్రజపం, ఇంటివద్ద భగవద్ధ్యానం నారాయణ స్వామికి నిత్యకృత్యాలయ్యాయి. తల్లి మరణానంతరం నారాయణస్వామి ఒకవైపు ఆధ్యాత్మిక సాధన చేస్తూ కులవృత్తి అయిన సన్నాయి వాద్యం నేర్చుకుని సంగీతాన్ని పరమాత్మ సాక్షాత్కారానికి సాధనం చేసుకున్నాడు. గురువు జొన్నలగడ్డ వెంకటరామయ్య వద్ద భాగవతాది పురాణ ప్రవచనం చేస్తూ ఆయన వద్దనే నారాయణస్వామి పతంజలి యోగ సూత్రాన్ని కూడా

అకళించుకుని ధ్యాన సాధనకు ఉపక్రమించాడు. ఇంకా మాదిగల ఇళ్ళకుపోయి చెప్పులు కుట్టటం, మాలవాడకు పోయి బట్టలు నేయడం, వడ్రంగుల ఇళ్ళలో కర్రపనులు చేయడం నేర్చుకుంటూ కులభేదాలను అధిగమించాడు. నారాయణస్వామి ఒక విప్రయువకునితో ఏర్పడిన స్నేహంతో అతని తల్లిదండ్రులను గురు దంపతులుగా సేవించి వారివద్ద వేదవేదాంగ రహస్యాలు గ్రహించి మంత్రాలు నేర్చుకున్నాడు. నారాయణస్వామి 15వ ఏట బాల్యంలో శివుడు చెప్పినమాట మేరకు యోగానంద మహర్షి రూపంలో వచ్చి నారాయణస్వామికి అష్టాక్షరీ మంత్రం ఉపదేశించి యోగాసనాలు, పంచముద్రాది సాధనాలు నేర్పారు. గురువు ఆదేశం ప్రకారం నారాయణస్వామి యోగసాధన చేశారు. యమ నియమయాది అష్టాంగ యోగ సాధనలో శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి క్రమంగా అతని వశమయ్యాయి. వైకుంఠ పర్వతంపై నిద్రాహారాలు మాని కఠినతపస్సు చేయగా తొలుత మార్కండేయుడు తరువాత ఆదిశేషుడు దర్శనమిచ్చారు. గురుదత్త బ్రహ్మర్షిగా అబ్బూరుకు తిరిగి వెళ్ళాడు. కపిలగిరిలో గురువు బ్రహ్మర్షి నారాయణ స్వామికి సుదర్శ నరసింహ మంత్రాలు ఉపదేశించారు. మంత్ర జపం 3 నెలలపాటు అహోరాత్రాలు సాగి జపతీవ్రతలో నిర్జనారణ్యాలలో సంచరించారు. అంతా గురు రూపంలోనే కనిపించింది. తిరిగి అబ్బూరుకు తిరిగి వచ్చి ఆ ఊరిని ఒక తీర్థ ప్రదేశంగా మార్చారు. బ్రహ్మర్షి 30వ ఏట 1936లో తండ్రి మరణించిన తరువాత లక్ష్మీనారాయణ మందిరాన్ని అభివృద్ధి చేశారు. గురువు మహర్షి యోగానందులు సిద్ధి పొందిన తరువాత గురువాజ్ఞ మేరకు కపిలగిరి పీఠాధిపతిగా అభిషిక్తులయ్యారు. అనంతరం వైకుంఠపురం శేషాద్రిపై వెలసిన శ్రీభూసహిత వెంకటేశ్వరస్వామి సన్నిధిలో కొంతకాలం తపస్సు చేశారు. ఎన్నో మహిమలు, అద్భుతాలు ప్రదర్శించి దీనులను, హీనులను ఉద్ధరిస్తూ, నాస్తికులను, ఆస్తికులుగా మార్చి ఆదర్శప్రాయమైన ఆధ్యాత్మిక జీవితాన్ని గడిపారు. విభవనామ సంవత్సరం పుష్యమాసంలో భీష్మ ఏకాదశి (18-1-1989)న బ్రహ్మర్షి నారాయణస్వామి శరీర యాత్ర చాలించారు. భక్తులు అబ్బూరులో ఆయన శరీరాన్ని సమాధి చేసి ఏటేటా ఆరాధనోత్సవాలు వైభవంగా జరుపుతున్నారు.

## 5. బ్రహ్మానంద సరస్వతీ స్వామి (1863 - 1938)

ఆంధ్రదేశంలోను, ఉత్తర భారతదేశంలోను 19వ శతాబ్దాంతం, 20వ శతాబ్దారంభ కాలంలో దత్తాత్రేయ యోగ సంప్రదాయాన్ని పూజా సంప్రదాయాన్ని ప్రచారం చేసిన ప్రముఖ యోగి బ్రహ్మానంద సరస్వతీస్వామి విజయవాడ తాలూకా పటమటలో గోవిందరాజు రాఘవయ్య, తిరుమలాంబ నియోగి బ్రాహ్మణ దంపతులకు జన్మించారు. ఆ శిశువుకు పానకాలు అని నామకరణం చేశారు. పానకాలును 8వ ఏట 1871లో యనమలకుదురుకు చెందిన గోవిందరాజు సీతమ్మ, నరసింహారావు దంపతులు దత్తత తీసుకుని రామప్ప అని పిలిచేవారు. మెట్రిక్యులేషన్ పాసైన రామప్పకు 1875లో జానకమ్మతో వివాహమైంది.

రామప్పగాయత్రి, శివ పంచాక్షరి, రామ షడక్షరి, బాలషడక్షరి, నారాయణాష్టాక్షరి, వాసుదేవ ద్వాదశాక్షరి, హనుమత్ ద్వాదశాక్షరి, నృసింహాష్టాక్షరి, శ్రీ పంచదశి మంత్రాలు జపించేవారు. ఇలా ఉండగా దత్తత తల్లిదండ్రులు, భార్య, కుమారుడు చనిపోవడంతో ఆయనకు విరక్తి కలిగి పుణ్యక్షేత్ర సందర్శనం కోసం తీర్థ యాత్రలకు బయలుదేరారు. శ్రీశైలంలో ఒక బావాజీ సత్సంగం లభించింది. సజ్జన సేవ వల్ల కలిగే ఫలితాలను బావాజీ ఉపదేశం ఆయనలో గాఢంగా నాటుకుంది. విజయవాడలో ఒక గౌడయతీశ్వరుడు ఆయనకు దత్తాత్రేయ మంత్రాన్ని ఉపదేశించడంతో అప్పటి నుండి రామప్ప దత్తాత్రేయ ఉపాసనానిష్ఠుడయ్యారు. తీర్థ యాత్రలలో పలువురు సత్పురుషుల దర్శనం వల్ల అనేక బ్రహ్మ విద్యారహస్యాలను తెలుసుకున్నారు. శ్రీ సచ్చిదానంద సరస్వతి అనే ద్రవిడ యతీశ్వరుడు రామప్పకు క్రమ సన్యాసాన్ని, బ్రహ్మానంద సరస్వతి అనే దీక్షా నామాన్ని 1895లో 32 ఏళ్ళ వయసుగల రామప్పకు అనుగ్రహించారు. సన్యాసం స్వీకరించిన బ్రహ్మానంద సరస్వతీ స్వామి మళ్ళీ హిమాలయ యాత్రలుచేసి నేపాల్ దేశంలోని ముక్తినాథ క్షేత్రంలో కఠోర నియమాలతో తపస్సు చేశారు. చిత్తవృత్తులను నిరోధించి ఏకాగ్రత కోసం హఠయోగాభ్యాసం చేశారు. ప్రాణాయామ పూర్వక యోగం ఆచరించారు. అనంతరం శృంగేరి వెళ్ళి అక్కడి జగద్గురువులు శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ స్వామి సన్నిధిలో భాష్య శ్రవణం చేశారు. దేశం నలుమూలలా తిరిగి సనాతన ధర్మ ప్రచారం చేశారు. 32 మందికి క్రమ సన్యాసం, 600 మంది గృహస్థులకు మంత్రదీక్ష ఇచ్చారు. అనేక గ్రంథాలను తెలుగు, హిందీ భాషలలో రచించారు. ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. బహుధాన్య మార్గశిర శుద్ధ దశమి శుక్రవారం 2-12-1938న స్వామి కాశీలో సిద్ధి పొందారు.

## 6. బోడబండ తిమ్మగురు (1730-1820)

కాలజ్ఞానం రచించిన పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి. అవతారం చాలించి తిరిగి ధర్మ ప్రచారం మరుజన్మలో తిమ్మగురుడు గాను ఆయన శిష్యుడు సిద్ధప్ప ఫకీరప్పగాను అవతరించారు. ఆయన 1730 ప్రాంతంలో రోళ్ళపాడులో జన్మించి తరువాత తన నివాసాన్ని బోడబండకు మార్చారు. తిమ్మగురుడు చిన్నప్పటినుండి కులవృత్తికి సంబంధించిన బాడిశ, ఉలి వంటి పరికరాలు దగ్గరనే ఉంచుకుని వాటిని ఉపయోగించకుండానే తన మహిమతో రైతులకు అవసరమైన కర్ర నాగలి వంటి పనిముట్లు ఇస్తుండేవారు. అధ్యాత్మతత్త్వం చెప్పేవాడు, సాధు సంతులను, గురువులను గౌరవిస్తూ సేవిస్తూ పరచింతనతో పర్యటించి గద్వాల చేరారు. అక్కడ ఆయనకు సదానందయోగి వద్ద ఆత్మతత్త్వ రహస్యం ఉపదేశం పొంది తిరిగి రోళ్ళపాడుకు చేరారు. ఆ గ్రామ సమీపంలోని బోడబండ అనే పర్వత సానువులో జువ్విచెట్టు క్రింద యోగాసనంలో కూర్చుండి 12 ఏళ్ళు తపస్సు చేశారు. ఆ తపస్సు వేడికి ఆ జువ్విచెట్టు మండి బొగ్గుగా మారింది. అక్కడి నుండి తిమ్మగురుడు కందనవోలు సమీపంలో

కొంతాలపాడు అనే ఊళ్లో గుడిసె వేసుకొని అమనస్కయోగ సాధనలో ఉండిపోయాడు. ఆ తరువాత నిజాం ప్రాంతంలోని మారమునగాల గ్రామం చేరి అక్కడ ఆశ్రమాన్ని నిర్మించుకున్నాడు. అనేక మహిమలు, అద్భుతాలు ప్రదర్శించాడు. అనేక గ్రామాలలో పర్యటించాడు. భక్తిలేని పూజలు వ్యర్థమని, గురువు మాట నమ్మిన సొమ్ము, నమ్మకపోతే దుమ్ము అని, పెద్దలసుద్ధి పెరుగన్నం చద్ది అని భక్తులకు హితబోధ చేసిన తిమ్మగురుడు బోరబండలో 1820లో కుండలినీయోగంతో సమాధి అయ్యారు. అక్కడే ఆలయం నిర్మించి భక్తులు ప్రతిఏటా ఉత్సవాలు జరుపుతున్నారు.

## 7. భద్రాచలం గోవిందస్వామి (1855-1927)

భద్రాచలం గోవిందస్వామి కేరళలోని మలబారు ప్రాంతం ఆలపాడ గ్రామంలో ఒక బ్రాహ్మణవంశంలో రాక్షసనామ సంవత్సర పుష్యబహుళ దశమి శనివారం 13-1-1885 రోజున జన్మించి నిరంతరం ' గోవిందరాం రాం గోపాలహరి హరి' అని పాడుతూ ఉండటం చేత ఆయనను 'గోవిందస్వామి' అని పిలచేవారు. గొంగడి ధరించటం చేత గొంగడిస్వామి అని, వరిగడ్డిలో కూర్చుని యోగాభ్యాసం చేయటం వల్ల వరిగడ్డిస్వామి అని, పెదగోళ్ళు ఉండటంచేత గోళ్ళస్వామి అని, బ్రహ్మచారి కనుక బాలబ్రహ్మచారి అని, చిన్నప్పటి నుండి సంగీతం బాగా అభ్యసించి గొప్ప నైపుణ్యంతో మనోహరంగా వేణువు వాయించి నందున గోపాలస్వామి అని ఇతర నామాలు కూడా ఆయనకు ఉన్నాయి. చిన్నతనంలోనే తల్లిదండ్రులను కోల్పోయిన గోవిందస్వామి దేశద్రిమ్మరిగా యోగులను, జ్ఞానులను ఆశ్రయించి, సన్న్యాసం స్వీకరించిన తరువాత గురువుల ఆదేశం మేరకు భక్తి జ్ఞానాలు ప్రబోధిస్తూ, వేణుగానంతో శారీరక, మానసిక వ్యాధులను నయం చేస్తూ యావద్భారత దేశంలో సంచరించారు. ఉత్తర భారతంలో ఆయనకు ఎందరో శిష్యులయ్యారు. గోవిందస్వామి 1887 ప్రాంతంలో మహారాష్ట్రంలోని పండరి క్షేత్రంలో ఒక తెల్లవారు ఝామున ఆయనకు భద్రాచలం సీతారాముల దర్శనమైంది. తన వెంట 18 మంది శిష్యులతో భద్రాచలం బయలుదేరారు. 1892లో కర్ణాటక రాష్ట్రంలో బీదరు, బళ్ళారి, శృంగేరి, ఉడిపి క్షేత్రాలలో ఆశ్రమాలు స్థాపించారు. ఆ విధంగా నాలుగేళ్ళు కన్నడ దేశం తిరిగి 17 మంది శిష్యులను స్వస్థలాలకు పంపించి 1896లో ఒక్క శిష్యునితో ఆంధ్రదేశంలో ప్రవేశించారు. మొదట తిరుమలపై శ్రీ వెంకటేశ్వర స్వామిని సేవించి వేదనారాయణపురంలో కొన్నాళ్ళుండి. తన వెంటనున్న ఆ ఒక్క శిష్యుణ్ణి ప్రభవ సంవత్సరం (1927) శ్రీరామనవమి నాటికి తనను భద్రాచలంలో కలుసుకోవలసిందిగా ఆదేశించి పంపించారు. అనంతరం గోవిందస్వామి ఒంటరిగా కాలినడకన పల్లెలు, పట్టణాలు, అడవులు దాటుతూ దారిలో సత్రాలలో బసచేసినప్పుడు మౌనం పాటించేవారు. కడప దాటిన తరువాత చిన్నమాచుపల్లెలో ఆంజనేయ ప్రతిష్ఠచేసి ఆర్తుల బాధలు తొలగించారు. ఎన్నో మహిమలు, లీలలు ప్రదర్శించారు.

1904లో వల్లూరులో కొన్ని నెలలుండి ఒక గోవును పూజించి దాని పాలు పితికి ఆలయం బావిలో పోసి ఆ నీటిని ఔషధంగా ఇచ్చారు. ఆ నీటిని త్రాగిన వారంతా ఆరోగ్యవంతులయ్యారు. చివరకు 1916లో భద్రాచలం చేరి ప్రతిదినం గోదావరి నీళ్లపై నడుస్తూ నది మధ్యకు వెళ్లి శ్రీరామాలయ శిఖరం దర్శించి స్నానం చేసి గట్టుకు వచ్చి తపోధ్యానాల అనంతరం శ్రీరామచంద్రుని దర్శించేవారు. గోవిందస్వామి భద్రాచలం మఠంలో లింగప్రతిష్ఠ చేసి తన తపస్సు కోసం ఒక భూగృహం నిర్మించుకుని అందులో పదేళ్లు ఏకాంతంగా తపస్సు చేశారు. ప్రభవ సంవత్సర వైశాఖ శుద్ధ చవితి గురువారం (6-5-1927) బ్రహ్మరంధ్రం ఛేదించుకుని పరమాత్మలో లీనమయ్యారు. పంచమినాడు భక్తులు ఆయనను సమాధి చేశారు. ఇప్పటికీ ఆయన ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి. సమాధి నుండే గోవిందస్వామి మహిమలు ప్రదర్శిస్తున్నారు.

## 8. బనగానపల్లె హంసానంద సరస్వతి (1859-1980)

బహుభాషాకోవిదుడు, పండితుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, రాజకీయవేత్త, ఆయుర్వేద వైద్యుడు, ప్రకృతి చికిత్సానిపుణుడు, సంఘ సంస్కర్తగా 120 సంవత్సరాలు జీవించిన హంసానంద సరస్వతి ఉత్తరప్రదేశ్‌లో సిద్ధార్థినామ సంవత్సర శ్రావణ బహుళ పాడ్యమి ఆదివారంనాడు జన్మించారు. తల్లిదండ్రులు ఆయనకు పెట్టిన పేరు నిత్య గోపాల్. ఆయన బాల్యంలోనే శ్రీరామ కృష్ణపరమ హంస సన్నిధికి చేరి కొంతకాలనికి సన్యసించి జ్ఞానా నందావధూత అయ్యారు. ఆయన శ్రీ బ్రహ్మానందసరస్వతీ స్వామి వద్ద సన్యాసం స్వీకరించి 'హంసానందసరస్వతి' అనే దీక్షానామం స్వీకరించారు. సన్యసించిన నాటి నుండి హంసానందుడు తన విధులను కఠోరంగా ఆచరిస్తూ దేశవిదేశాలలో ధర్మ ప్రబోధంతోపాటు ఆరోగ్య విధానాలు ప్రచారంచేశారు. శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులతో కలిసి సామాజిక, అధ్యాత్మిక ప్రచారాల్లో పాల్గొన్నారు.

జాతీయోద్యమంలో స్వామి శ్రద్ధానంద, మహాత్మాగాంధీ, వీరసావర్కర్, టంగుటూరి ప్రకాశం పంతులు, అరవింద యోగి మదనమోహనమాలవ్యా చక్రవర్తుల రాజగోపాలాచార్యులతో కలసిపని చేశారు. హిందీ, సంస్కృతం, తెలుగు, బెంగాలి, ఇంగ్లీషు, రష్యన్, జర్మనీ బాషలలోనిష్ణాతులయ్యారు.

కొంతకాలం హంసానందులు కర్నూలు జిల్లా యాగంటి గుహల్లో వేపాకు తింటూ కఠోర తపస్సు చేసి అనేక యోగ సిద్ధులు గడించారు. అలా ఎనిమిదేళ్ళు తపస్సు చేసి 1930లో బనగానపల్లెలో శిథిల దేవాలయానికి పడమర దిశగా ఉన్న స్థలంలో 'స్వస్తి ఆశ్రమం' పేరిట ఒక ఆశ్రమాన్ని నిర్మించుకున్నారు. ప్రజలకు శారీరక, మానసిక, అధ్యాత్మిక ఆనందం కలిగించే లక్ష్యంతో ఈ ఆశ్రమాన్ని అభివృద్ధి చేశారు. ఉపదేశాలతో మానసిక రోగులకు, మందులతో

వ్యాధి గ్రస్తులకు స్వస్థత చేకూర్చేవారు. వనమూలికలతో ఔషధాలు తయారు చేసి దేశీయ వైద్యాన్ని ప్రోత్సహించటానికి 'దయానంద ఫార్మసీ' పేరిట ఒక ఆయుర్వేద ఔషధ పరిశ్రమను స్థాపించారు. మందులతో నయంకాని రోగాలకు మృత్తికాస్నానం, తొట్టిస్నానం, తైలమర్ధనం వంటి ప్రక్రియలతో ప్రకృతి చికిత్స చేసేవారు. 1932లో హంసానంద ప్రకృతి ఆశ్రమం ఏర్పడింది. దానికి ఒకట్రస్టు ఏర్పాటు చేశారు. హంసానంద సరస్వతి హైదరాబాద్ నాగార్జున ఆయుర్వేద పీఠానికి గుంటూరు రామమోహన ఆయుర్వేద కళాశాలకు, విజయవాడ ప్రకృతి యోగ ఆరోగ్య కేంద్రానికి అధ్యక్షులుగాను, కేంద్ర రాష్ట్ర ఆయుర్వేద నిపుణుల సంఘంలో సభ్యులుగాను గొప్ప సేవ చేశారు. ఎందరికో వైద్య విద్య నేర్పారు. ఆయన కఠోర తపస్సుతో ఎన్నో సిద్ధులు సాధించినా కేవలం వశీకరణ శక్తిని మాత్రమే ప్రదర్శించారు. సిద్ధార్థినామ సంవత్సరపుష్య శుద్ధ చతుర్దశి మంగళవారం 13-1-1980 రోజున ఆయన ఆత్మ పరమాత్మలో కలిసి పోయింది. ఆయన ముందుగానే ఏర్పాటు చేసుకున్న స్థలంలో భక్తులు, శిష్యులు, అభిమానులు సమాధి చేశారు. ఈనాటికీ అక్కడ ప్రతిఏటా పుష్యబహుళ ఏకాదశి నాడు హంసానందుల ఆరాధనోత్సవాలు, పేదలకు అన్నదానం, వస్త్ర దానం జరుగుతున్నాయి.

## 9. బాపట్ల బ్రహ్మానంద తీర్థులు (1879-1918)

ఆంధ్రదేశంలో ఆధ్యాత్మిక విద్యా వికాసానికి ఆర్ష ధర్మ ప్రచారానికి గణనీయమైన సేవ చేసిన మహాపురుషులలో బ్రహ్మానంద తీర్థులు ప్రముఖులు. మహారాష్ట్ర దేశంలో కొల్హాపూర్ శివారునగల బ్రాహ్మణాగ్రహారంలో దత్తాత్రేయ ఉపాసకులైన విష్ణుభట్టు అనే ఒక ఋక్‌శాఖీయ పురోహితునికి 1879లో ఆయన జన్మించారు. ఆ శిశువుకు గణపతి అని పేరు పెట్టారు. ఐదవ ఏట అక్షరాభ్యాసం అయిన గణపతికి చిన్ననాటి నుంచే ఆధ్యాత్మిక దృష్టి ఎక్కువ తల్లి దత్తాత్రేయ స్మరణంతో పాటు సత్యం, అహింస, ఆస్తేయం, జ్ఞాన వైరాగ్యాది సద్గుణాలు బోధించేవారు. ఉపనయనానంతరం గ్రామ సమీపంలోని నదీ తీరంలో ఏకాంతంగా భగవధ్యానం చేస్తూ ఉండేవారు. 12వ ఏట అగ్రహారంలో ప్లేగు వ్యాపించి తమ్ములిద్దరూ చనిపోగా వైరాగ్యంతో ఇల్లు విడిచి దత్త క్షేత్రమైన నరసోబావాడికి చేరారు. అక్కడ నాలుగు రోజులు హరి కథలు భక్తి శ్రద్ధలతో విని తన్మయం చెందాడు. ఇంతలో తండ్రి గణపతిని వెతుక్కుంటూ వచ్చి ఇంటికి తీసుకువెళ్ళారు. తిరిగి 1893లో 14వ ఏట హిమాలయాలవైపు తపస్సు కోసం ప్రయాణమయ్యాడు. 1897లో బదరికాశ్రమం చేరి అక్కడి యోగులను ఆశ్రయించి లంబికా యోగం అభ్యసించారు. అనంతరం నర్మదానదీ తీరానగల గరుడేశ్వరం చేరి అక్కడ అపర దత్తాత్రేయావతారంగా ప్రసిద్ధులైన శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వామి టెంబెస్వామిని ఆశ్రయించి, శుశ్రూషలు చేయగా, ఆయన గణపతికి దత్తమహామంత్రం, యోగం, వాటి అనుష్ఠాన విధానాలను బోధించారు. గణపతి దీక్షతో రేయింబవళ్ళు మంత్రజపం, యోగసాధన చేశారు. చివరకు వాసుదేవానందుల అనుజ్ఞతో శృంగేరి

జగద్గురువు శ్రీ నృసింహభారతీ స్వామిని ఆశ్రయించారు. ఆయన గణపతిని అనేక విధాల పరీక్షించి చివరకు అనుగ్రహించి గణపతిచే భాష్య ప్రవచనం చేయించారు. సంస్కృతం బోధించారు. తమ మఠంలో ఉండే మరో మహారాష్ట్ర సన్యాసి ఆనందానంద తీర్థస్వామిచే గణపతికి సన్యాసము, బ్రహ్మానంద తీర్థ దీక్షానామం ఇప్పించి ఆశీర్వదించారు. బ్రహ్మానంద తీర్థులు దివ్యక్షేత్రాలు సేవిస్తూ తిరుపతికి, అక్కడ నుండి నెల్లూరుకు వచ్చారు. అక్కడ జీవన్ముక్తులైన నిత్యానందస్వామితో పరిచయమైంది. నెల్లూరులో బ్రహ్మానందతీర్థులు 'శ్రీ నిత్యానంద వేద సంస్కృత పాఠశాల'ను నెలకొల్పారు. అలా ఈ ఇరువురు స్వాములు అనేక ప్రదేశాలు సందర్శించి శిష్యులకు యోగ రహస్యాలు బోధించి మంత్రోపదేశాలు చేశారు కొన్ని రోజుల తరువాత బాపట్లలో సనాతన ధర్మ ప్రచారానికై పూనుకున్నారు. ఎన్నో ప్రదేశాలు తిరుగుతూ ఎన్నో లీలలను అద్భుతాలను ప్రదర్శించారు. అనేక జీర్ణ దేవాలయాలను పునరుద్ధరించారు. బ్రహ్మానందతీర్థులు బాపట్ల శంకర విద్యాలయానికి, దత్తాత్రేయ మందిరం లైబ్రరీకి భవనాలు నిర్మించి కొన్నివేల మూలధనం సమకూర్చి పాలక మండలిని నియమించారు. కాశీకి వెళ్లి మాండూక్యో పరిషత్తు తారక మఠంలో భాష్యప్రవచనం చేశారు. కాళయుక్తి సంవత్సరం శ్రావణ శుద్ధ అష్టమి గురువారం 15-8-1918 రోజున సమాధినిష్ఠులో ఉదయం 9-30 గంటలకు బ్రహ్మరంధ్రం ఛేదించుకుని బ్రహ్మైక్యం చెందారు భక్తుల్లో మహాభక్తుడు, జ్ఞానుల్లో శ్రేష్ఠుడు, కర్మయోగుల్లో కర్మవీరుడు, యోగులలో రాజయోగి సనాతన ధర్మానికి ఆధ్యాత్మిక వికాసానికి దోహదం చేసిన మహాయోగి శ్రీ బ్రహ్మానందతీర్థులు.

## 10. బలిఘట్టం చిద్ఘనానందస్వామి (1885-1969)

బాల్యం నుండి ఆధ్యాత్మిక మార్గంలో ఒంటరిపయనం సాగించి సద్గురు సేవ, నిరంతర సాధనలతో బ్రహ్మసాక్షాత్కారం పొంది తాము తరించి ఇతరులను తరింపజేయటానికి ఉద్యమించిన నిరంతర శ్రామికుడు చిద్ఘనానందస్వామి. అసలు తల్లిదండ్రులు పెట్టిన పేరు వెంకటరెడ్డి. రాయలసీమలో కడప జిల్లా ప్రొద్దుటూరు తాలూకా చిన్నరాజుపల్లెకు చెందిన రుక్కు గురవారెడ్డి, నాగమ్మ దంపతులకు వెంకటేశ్వరస్వామి వరప్రసాదంగా 30-3-1885 పార్థివ సంవత్సరం చైత్ర పూర్ణిమ సోమవారం రాత్రి 12 గంటలకు హస్తానక్షత్రం ధనుర్లగ్నంలో జన్మించారు.

వెంకట రెడ్డివయసుతోపాటు భక్తి పెరిగింది. ఏడవ ఏటనే ప్రాణాయామంతోపాటు ఖేచరీ భూచరీ ముద్రలు అభ్యసించారు. పూనా హఠయోగాశ్రమం చేరి ఒక ఏడాది యోగాభ్యాసం చేశారు. తరువాత పండరి, రాయచూరు, అనంతపురం, యాదికి - తిరిగి తిరిగి చీమల వాగుపల్లె చేరారు. అక్కడ ఒక వేదాంతి వద్ద సీతారామాంజనేయం ఒంట బట్టించుకుని 11వ ఏట బొమ్మేపల్లి సుబ్బదాసు అనే సిద్ధ పురుషుని ఆశ్రయించారు. తారకసంఖ్య, అమనస్కయోగాలు నేర్చి వస్తే అచల పూర్ణయోగం బోధిస్తానని సుబ్బదాసు చెప్పడంతో

12వ ఏట లంకమలపర్వతం పైన ధ్యాన సాధన చేసి స్వరశాస్త్రం నేర్చారు. 15వ ఏట కమలాపురం తాలూకా నాగేశ్వర పర్వతాగ్రంపై ఒక ఏడాది తపస్సు చేశారు. 18వ ఏట తిరుమల బావాజీ మఠంలో రెండేళ్లు మతత్రయ సారం గ్రహించారు. అనంతరం వీరాంజనేయ క్షేత్రాలు చుట్టి 28వ ఏట స్వగ్రామం చిన్నరావిపల్లెకు చేరి అక్కడకు వచ్చిన బ్రహ్మానంద మహర్షిని సందర్శించి ఆయన అనుగ్రహానికి పాత్రుడై శిష్యులయ్యారు. శిష్యుని అనేక విధాల పరీక్షించిన బ్రహ్మానంద మహర్షి వెంకట రెడ్డికి దీక్షతోపాటు 'చిద్గగనానందుడు' అనే దీక్షానామం ప్రసాదించారు. పన్నెండేళ్లపాటు చిద్గగనానందుడు అనంతపురం జిల్లా పోతులకుంటలో గురువు బ్రహ్మానంద మహర్షి ప్రస్థానత్రయ ఆశ్రమ భూములను స్వయంగా దున్నుతూ గురువును సేవించారు. అనంతరం దేశ సంచారం చేసి మోహన గిరిపై భైరవస్వామి ఆలయంలో ఆరు నెలలు తపస్సు చేసి హిందూపురం తాలూకా గోరంట్లలో తన గురువు స్థాపించిన అద్వైతాశ్రమానికి తిరిగి వచ్చారు. ఆయుర్వేదం నేర్చి ఔషధాలు తయారుచేసి ఎందరో రోగులకు ఉచితంగా వైద్య సేవలందించి ఆరోగ్యం, సంతోషం కలిగించారు. నాలుగేళ్ల తరువాత చిద్గగనానందులు కదిరి తాలూకా తుమ్మలామల దుర్గం వెళ్లి ఆరునెలలు నిరాహారంగా కఠోర తపస్సు చేశారు. అక్కడ భవనాశి ఆశ్రమం స్థాపించారు. రాయలసీమ కరువుకాలంలో ఆశ్రమంలో 6 మాసాలపాటు విరివిగా అన్నదానాలు చేయించారు. కొత్త చెరువు సమీపంలోని నాగులకనుమలో ఆనందాశ్రమం స్థాపించారు. తన 52వ ఏట 1936లో స్వామి బలిఘట్టం వచ్చి త్రిశూల పర్వతంపై 12 రోజులపాటు లోకశాంతికోసం దీక్ష వహించారు. మన్యం ఆటవికులలో ఆధ్యాత్మిక చైతన్యం కలిగించటానికి బ్రహ్మానందాశ్రమం స్థాపించారు. ఇలా 10 ఆశ్రమాలు స్థాపించిన స్వామి తిరిగి బలిఘట్టం చేరి సౌమ్య సంవత్సరం ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి చాతుర్మాస్య దీక్ష వహించి శిష్యులకు భక్తులకు ప్రస్థానత్రయం బోధించారు. భాద్రపదశుద్ధ పౌర్ణమి (27-7-1969)న ఉదయం 8 గంటలకు జీవ సమాధి చెందారు. ఇప్పటికీ దాదాపు ఐదువేల ఆటవిక కుటుంబాలకు చిద్గగనానందులు ఆరాధ్యదైవం. గురువు.

## 11. చిరుమామిళ్ళ సుబ్బదాసు (1802-1882)

పూర్వజన్మ సంస్కార బలంతో యోగాభ్యాసపరుడై మరల సిద్ధి కొరకు ప్రయత్నించిన యోగి భక్తుడు చిరుమామిళ్ళ సుబ్బదాసు చిరుమామిళ్ళ నరసయ్య, తిరుమలమ్మ అనే సదాచారపరులైన కమ్మదంపతుల కుమారుడుగా అనంతపురం జిల్లా ధర్మవరంలో 1802లో జన్మించారు. ఆ శిశువుకు బారసాలనాడు ఆ దంపతులు సుబ్రహ్మణ్యం అని పేరు పెట్టారు. వాడుకనామం సుబ్బయ్య. వీధి బడిలో చదువుతున్న కాలంలో ఉపాధ్యాయుడు చెప్పే కృష్ణ శతకం, నరసింహశతకం, దాశరథీ శతకం, భాగవతంలోని పద్యాలు అన్నీ నేర్చుకుని 8 ఏండ్ల ప్రాయం నుండే అర్ధరాత్రి వేళ దీపం ముందు కూర్చుని నిశ్చలధ్యాన నిమగ్నుడై భక్తి జ్ఞాన

వైరాగ్యాలకు సంబంధించిన కీర్తనలు, పద్యాలు వ్రాస్తూ, పాడుతూ ఉండేవారు. 10వ ఏట రెండు మూడు రోజుల కొకసారి సమాధి స్థితిలో ఉండేవారు. అదే వయస్సులో 108 కంద పద్యాలు కేశవ మకుటంతో చదివి గ్రామ పెద్దలను, బడి పంతులును, తల్లిదండ్రులను ఆశ్చర్య పరిచిన ఏక సంథాగ్రాహి, గొప్ప యోగి వేణుగోపాల స్వామి భక్తుడుగా సుబ్బయ్య ప్రసిద్ధి గడించాడు.

ఒకనాటి రాత్రి ఒక సాధువు సూచన మేరకు సద్గురువు అన్వేషణకు బయలుదేరగా ఆకాశంలో ఒక కాంతి గోళం కనపడింది. ఆ కాంతి గోళాన్ని చూస్తూ నడిచి దుర్గి గ్రామం చేరారు. ఆ కాంతిపుంజం దుర్గి వేణుగోపాల స్వామి గుడిపైన ఆకాశంలో నక్షత్రంగా నిలిచి పోయింది. సుబ్రహ్మణ్యం గర్భాలయంలో ప్రవేశించాడు. స్వామి విగ్రహం కన్నుల నుండి కారుణ్య తరంగాలు సుబ్రహ్మణ్యంలో ప్రవేశించగా స్వామిని స్తుతిస్తూ ఆశువుగా తనకే ఆశ్చర్యం కలిగించిన పద్యాలు చదివాడు. ఆ రోజుల్లోనే గొప్ప పండితకవి, త్రికాలజ్ఞులు, జ్ఞానపూర్ణుడు, దైవసాక్షాత్కారం పొందిన తాతాచార్యులు పెండ్లికి అంగీకరించని సుబ్బయ్యకు బోధ చేసి రాజ యోగిగా గృహస్థ ధర్మం నిర్వర్తించే పద్ధతి తెలిపి సమ్మతింపజేశారు. చివరకు 20వ ఏట 10 ఏళ్ల వధువు, మేనమామ కూతురు వేణమ్మను వివాహం చేసుకుని 16 రోజుల పండుగ తరువాత సుబ్రహ్మణ్యం తాతాచార్యుల ఆశ్రమంలో చేరి పంచకావ్యాలు, భారత భాగవతాలు, ప్రస్థానత్రయం, వేదాంత యోగ శాస్త్రాలు, వాటిలోని మర్మాలు సంపూర్ణంగా నేర్చుకున్నారు. అనంతరం తాతాచార్యులు సుబ్రహ్మణ్యంకు దీక్ష ఇచ్చి సుబ్బదాసు అని పేరు పెట్టారు. అనంతరం ఐదేళ్లపాటు తీవ్ర సాధన చేసిన సుబ్బదాసుకు గొప్ప ఆధ్యాత్మిక శక్తులు లభించాయి. సుబ్బదాసు దేహం చాలించే ముందు శిష్యులను రప్పించి తాను రచించిన తాటాకు గ్రంథాలను చూపించి వాటిని కాపాడుకోవాలని చెబుతూ, వారికి మిథ్యా జగత్తును గురించి బోధించారు. వృషనామ సంవత్సరం పుష్యబహుళ అష్టమి గురువారం రోజున (12-1-1882) న యోగ సమాధి స్థితులై కపాల ఛేదనం చేసుకుని పరమాత్మలో లీనమయ్యారు. చిన్నతనంలో యోగి తన నాల్కపై బీజాక్షరాలు రాసిన చోటనే ఆయన సమాధి స్థితులయ్యారు. నేడు ధర్మవరంలో ఆ సమాధి కవిపండితులకు యాత్రా స్థలం. ప్రతియేటా పుష్యబహుళ అష్టమినాడు ఆరాధనోత్సవం, నవమి నాడు ప్రభలతో స్వామి ఊరేగింపు జరిపి గురు పూజోత్సవం నిర్వహిస్తారు. దాససాహిత్యంలో ఆణిముత్యాలు, శతకాలు, యక్షగానాలు, నక్షత్ర మాలికలు, అష్టకాలు, తత్త్వాలు, కీర్తనలు, పాటలు, కృతులు ఎన్నో ఉన్నాయి. భగవద్భక్తులున్నంత కాలం ఆయన సాహిత్యం అజరామరం.

## 12. చేళ్ళగురికి ఎట్టిస్వాములు (1822 - 1922)

తెలంగాణాలో జన్మించి, మైసూరులో విద్యాభ్యాసంచే ఉన్నతోద్యోగం చేస్తూ తీవ్ర వైరాగ్యం చెంది ఆలు బిడ్డలను విడిచి అవధూతగా మారి నంజుండయ్య అనే ఆరాధ్య బ్రాహ్మణుడు

అవధూతగా మారినట్లు ఆయన ఎట్టితాత, ఎట్టిస్వాములుగా పిలువబడేవారని కొందరి కథనం. ఆయనను సేవించిన వారు చెప్పడం వల్లనే ఆయన చరిత్ర, మహిమలు వెలుగులోకి వచ్చాయి.

ఎట్టితాత ఎక్కడ ఏది లభిస్తే అది తినేవారు. ఆయన తింటుంటే కాకులు, కుక్కలు మూగేవి. స్వామి వాటికి తినిపిస్తూ తామూ తినేవారు. ఉద్యోగం వదిలి నిద్రాహారాలు మాని యోగసాధన చేస్తూ కొబ్బరి చెట్టుపైన ఉండే గొప్ప శివయోగిగా ప్రజలు, భక్తులు గుర్తించారు. లింగన హళ్లిలో లింగాయతుల నాగప్ప శుశ్రూష చేసి యోగ రహస్యాలను తెలుసుకున్న నంజుండప్ప దొడ్డబళ్ళాపురం గగనార్యుల వద్ద చేరి ఆయన ఆదేశం మేరకు దేహాభిమాన శూన్యతను, నిర్గంధిముని తత్వాన్ని నిరూపించుకుని, ఉపదేశం పొందారు. గగనార్యులు నంజుండప్పకు నిరంజనుడు అనే దీక్షా నామం ఇచ్చారు. స్మరణమాత్రంతోనే వందలమెట్లు దాటి వెళ్లగల సిద్ధ సంకల్పుడు శివయోగి ఎట్టిస్వాములు. ఆయన ఎన్నో మహిమలు ప్రదర్శించి ఎట్టితాత దొడ్డబళ్ళాపురం విడిచి చెన్నరాయల కొండ గుహలో కొంతకాలం, కళ్యాణ దుర్గం, ముష్టూరు, ఉరవ కొండలలో కొన్నాళ్ళుండి 1897లో చేళ్ళ గుర్కికి చేరారు. అక్కడ కౌపీనధారియై ఎండ, వానల్లో అంతర్ముఖుడై నిశ్చల సమాధి స్థితిలో ఉన్న ఎట్టిస్వామికి భక్తులు ఆశ్రయమిచ్చారు. ఊరి పెద్దలు కొత్త యిల్లు కట్టించి అందులో ఆయనను నిలిపారు. 1907లో భక్తులు మఠం నిర్మాణం ప్రారంభించి 1908లో పూర్తి చేశారు. ఎణ్ణతాత ఆ మఠంలో ప్రవేశించారు. అప్పటినుండి 1922 వరకు అక్కడే వుండి అనేక మహిమలు ప్రదర్శించారు. ఈనాటికీ ప్రదర్శిస్తూనే ఉన్నారు. సమకాలీన యోగులు, సిద్ధ పురుషులు ఎందరో ఆయనను దర్శించారు.

ఎట్టితాత 14 ఏళ్ల పాటు శిష్యుడు తిక్కయ్య కట్టించిన ఆ మఠంలో ఉండి ఆర్తులను, భక్తులను ఆనందింపజేస్తూ దుందుభినామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ చవితి మంగళవారం ఉదయం (30-5-1922) శివైక్యం చెందారు. మఠంతో పాటే తిక్కయ్య కట్టించిన సమాధిలోనే శిష్యులు, భక్తులు ఎట్టితాత శరీరాన్ని నిక్షేపించి నెలరోజుల పాటు శాంతి సమారాధనలు జరిపారు. ఇప్పటికీ ఆయన ఆరాధనోత్సవాలు ప్రతిఏటా జ్యేష్ఠ శుద్ధ షష్ఠి, అమావాస్య, శివరాత్రి రోజులలో జాతరలతో వైభవంగా జరుగుతున్నాయి. నిత్యం రెండుపూటలా పూజలు నిర్వహిస్తున్నారు. ఆయన పూజ ప్రతిమల్లో, పటాల్లో ప్రత్యక్షంగా దర్శనమిస్తూ కొందరితో సమాధిలోనుండి మాట్లాడుతూ, భక్తులకు స్వప్నంలో సాక్షాత్కరించటం ఎప్పటికీ ఎందరికో అనుభవైకవేద్యం.

## 13. చిప్పగిరి భంభంస్వామి (1833-1911)

హిందూ సన్యాసి వేషంలో కనిపించే ముస్లిం యోగి సయ్యద్ సుల్తాన్ మొహియుద్దీన్ ఖాదిర్ యే భంభంస్వామి. వారి వంశీయులు ప్రాచీన కాలం నుంచి కర్నూలు జిల్లా ఆలూరు

తాలూకా చిప్పగిరిలో ఉంటున్నారు. ఆయన అనేక ప్రదేశాలు సంచరించి ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. దేవుడొక్కడేనని, రాతి కట్టడాలపై మోజుతో ద్వేషం పెంచుకోవడం?, శరీరమనే మసీదులో ఆవాజ్ లేకుండా నమాజ్ (ధ్వని లేకుండా ప్రార్థన) చేయటం శ్రేష్ఠమని బోధించేవారు. భంభంస్వామి తమ అవతార సమాప్తి సమయం ఆసన్నం కావడంతో ఆలూరులో ఉన్నతమ శిష్యుడు భంషేక్ అబ్దుల్ దాసు వద్దకు వచ్చి సందేశమిచ్చారు. అక్కడ యోగ నిద్రలో వంశమూల పురుషుడు సత్తా ర్ షాని మహాత్ముడు దర్శనమిచ్చి ఆదేశించిన మేరకు చిప్పగిరి చేరి అక్కడ 11-10-1911 బుధవారం సజీవ సమాధి అయ్యారు.

## 14. కడప (గడికోట) సచ్చిదానంద పరమహంస (1865-1957)

కుంభకయోగం ద్వారా ఆత్మసాక్షాత్కారం పొంది దేశ విదేశాలలో వేలాది మందికి ప్రాణాయామ యోగం బోధించి, శారీరక మానసిక సుఖశాంతులు ప్రసాదించిన మహాయోగి సచ్చిదానంద పరమహంస. కాంచీపురం పొలిమేరలోని తిరుప్పనంకాడ గ్రామంలో శివభక్తులైన సోమసుందరం, విశాలాక్షి అనే ద్రావిడ వెలమకాపు దంపతులకు ఏకాంబరేశ్వరుని వరప్రసాదంగా రక్తాక్షినామ సంవత్సర మాఘ బహుళ పంచమి గురువారం ఉత్తరానక్షత్ర సింహలగ్నం (16-2-1865)న ఏకైక కుమారుడుగా జన్మించారు. ఆయనకు తల్లిదండ్రులు చేసిన నామకరణం కుప్పస్వామి. 1880లో లోయర్ ఫోర్త్‌తో చదువుకు స్వస్తి చెప్పిన కుప్పస్వామి 12 ఏళ్ళ వయసులో (1877లో) కంచిలోని వివిధ దేవాలయాలలోని అర్చామూర్తులను సేవించాడు. ఇంటి వద్ద పూజాగృహంలో పీట వేసి దానిపై జింకచర్మం, దానిపై ధవళవస్త్రం పరచి దానిపై ఉత్తర ముఖంగా చిన్ముద్ర ధరించి భ్రుకుటి మధ్యన చూపునిల్పి షోడశోపచారాలతో 12 ఏళ్ళపాటు మానసిక పూజ చేసి త్రికరణశుద్ధిగా కంచి ఏకాంబరేశ్వరునికి అంకితమయ్యారు. 13వ ఏట 42వ రోజున నిత్యానందుడనే వృద్ధ బ్రాహ్మణ రూపంలో ఏకాంబరేశ్వరుడే ప్రత్యక్షమై రేచక పూరక కుంభకాలు (ప్రాణయామం) నేర్పి సాధన చేయమని, మానసిక పూజ విడిచిపెట్టమని ఆదేశించాడు. కుప్పస్వామికి పరమహంస సచ్చిదానంద యోగీశ్వరుడు అదే జ్ఞాన నామాన్ని ప్రసాదించారు. సచ్చిదానందునికి 1890లో 17వ ఏట పెరుందేవితో వివాహం కాగా, సంసారం చేస్తూ రాజయోగిగా మనుగడ సాగించారు. ఇంట్లోనే ఒక గుహ నిర్మించుకుని నెలల కొలది దీర్ఘకాలం ధ్యాననిష్ఠలో ఉండేవారు. సంతానలేమితో పెరుదేవికి మనశ్శాంతి కరువైంది. చివరకు ఆమె 23-2-1912న శుక్రవారం నాడు చివరి శ్వాస విడిచారు. సచ్చిదానందులు సమస్తం పరిత్యజించి మద్రాసు సమీపంలో నిద్యానర్పడి తోటలో కొన్ని నెలలుండి అక్కడి నుండి కాలినడకన ఆంధ్రదేశంలోని కడప చేరారు. అక్కడ ఆయన జననమరణ రహస్యాలు, సంసార సాగరోత్తరణానికి చేయవలసిన సాధనలు, జీవాత్మ, పరమాత్మల రహస్యాలు 'జీవబ్రహ్మైక్య వేదాంత రహస్యం పేరిట ముందు తమిళంలోను, తరువాత తెలుగులోను వ్రాసి

ప్రచురించారు. తపస్సుకు, ఆశ్రమ నిర్వహణకు అనువైన ప్రదేశం గడికోటగా ఎంచుకున్నారు. మద్రాసు సమీపాన పన్‌చెట్టిలో ఒక మఠం నిర్మించారు. ఆంధ్రదేశంలోను, తమిళదేశంలోనే గాక, ఆఫ్రికా, శ్రీలంక, సింగపూర్, బర్మా, మలేషియాలలో తమ యోగశక్తులు ప్రదర్శించి యోగ కేంద్రాలు నెలకొల్పి వేలాది శిష్యులను సమకూర్చుకున్నారు. ఆయన యోగ విద్యలో నిష్ణాతులైన పరమహంస ఆయన 9-1-1957 సాయంకాలం బెంగుళూరు కెంపాపురం అగ్రహారంలో జీవసమాధి చెందారు. ఆనాటి నుండి ప్రతి ఏటా జనవరి 9న ఆరాధనోత్సవాలు, ఫిబ్రవరి 16న జయంతోత్సవాలు జరుగుతున్నాయి. మఠంలో ప్రతి రోజూ మూడు పూటలా పూజలతో పాటు ప్రతి ఆదివారం, ప్రతి పౌర్ణమి, అన్ని పండుగల పూజలు, ఉత్సవాలు జరుగుతున్నాయి.

## 15. కడప అవధూతేంద్రులు (1890-1978)

పిచ్చి బిచ్చగాడుగా నిరాడంబరంగా కడప వీధులలో తిరుగుతూ అనేక మహిమలు చూపిన యోగి అవధూతేంద్రులు, కర్నూలు జిల్లా త్యాగి గ్రామంలో ఎంకి ఈరిగాడు అనే పేద హరిజన దంపతుల అష్టమ సంతానంగా జన్మించిన ఈరన్నయే ఈ అవధూతేంద్రులు అని కొందరు చరిత్రకారుల భావన. ఈరన్న త్యాగిస్వామి వద్ద ఉపదేశం పొంది బనగానపల్లె వద్ద యాగంటి కొండ గుహలో తపస్సు చేసి అవధూతగా పరిణమించారు. ఆయన అసలు పేరు గంగయ్య అని కొందరి కథనం. 1938 -1939 ప్రాంతంలో ఆయన కడప చేరారు. పిచ్చివానిలా కడప వీధుల్లో తిరిగే అవధూతేంద్రులు ఆధ్యాత్మిక చింతనాపరులకు మార్గదర్శిగాను, ఆర్తులకు, దీనులకు మహనీయుడుగాను, ప్రేమమూర్తిగాను కనిపించేవారు. ఎన్నో అద్భుతాలు, లీలలు ప్రదర్శించారు. ఎందరో భక్తులు, శిష్యులు తయారయ్యారు. రానున్న అరిష్టాలను స్వామి తన విపరీత చేష్టల ద్వారా సూచించేవారు. 1978 ఏప్రిల్ 10న కాళయుక్తి చైత్రశుద్ధ తదియ సోమవారం ఉదయం 11 గం. 23 ని॥లకు కడప ఆసుపత్రిలో అవధూతేంద్రులు అవతారం చాలించారు. టీన్‌సాహెబ్ హోటలు వంటగది ఆయన సమాధి స్థలంగా మారింది. ఇప్పుడు ఆ సమాధిపై ఒక మందిరం వెలసింది. సమాధి తరువాత కూడా అవధూతేంద్రులు దివ్యలీలలు ప్రదర్శించటం ఇప్పటికీ ఒక విశేషమే.

## 16. చివటం అచ్చమ్మ అవధూత (1911-1981)

నిర్వికార విశ్వచైతన్యంతో తాదాత్మ్యం పొందిన సద్గురువుల కోవలో అసాధారణ సాధనతో ఆధ్యాత్మిక సోపానాలు అధిరోహించి మహోన్నత స్థితికి చేరిన అవధూత చివటం అచ్చమ్మ పశ్చిమగోదావరి జిల్లా రేలంగి గ్రామంలో కాపు కులస్థుడు మాయిష్టి భద్రయ్య కుమార్తెగా 1910లో జన్మించారు. కాలాంతరంలో అచ్చమ్మ చివటం అచ్చమ్మగా ప్రసిద్ధి చెందారు. చిన్ననాటి నుండే దృఢమైన దైవభక్తి, ఓర్పు, తోటివారిపై ప్రేమాభిమానాలు ఆమెలో విశిష్ట

లక్షణాలుగా ఉండేవి కాగా భర్త గరగ అంజయ్య జూదం ఆడుతూ భార్యను హింసించేవాడు. ఆమె ఎప్పుడు రామనామం జపించేది. ఒక రోజున అత్తగారితో చెప్పి బంధాలు తెంచుకుని సర్వం త్యజించి పోయిన అచ్చమ్మ చిన్నాయ గూడెంలో భజనలు చేసే ఒక భక్తుని ఇంట్లో కొన్నాళ్ళున్నారు. తిరిగి బలవంతాన రేలంగి వెళ్ళి తిరిగి చివటం వచ్చినా తోటలు, శ్మశానాలే ఆమె నివాసాలయ్యాయి. అవధూత పిచ్చమ్మ కొంతకాలం రాజమహేంద్రవరం స్త్రీల మఠంలో ఉండి కొంతకాలం, జైలు ప్రక్కన సాధుస్త్రీల మఠంలో ఉండి కొంతకాలం సాధన చేశారు. తిరిగి చివటం చేరి ఏకాంత ప్రదేశాల్లో ధ్యానం చేసుకునేవారు. సాధూరాం బావాజీ ఆమె గురువుగా ఎంచుకుని దిగంబరియై అవధూతగా మారారు. అప్పటినుండి రేలంగి, చివటం ప్రజలు ఆమెను సిద్ధురాలుగా గుర్తించి గౌరవించసాగారు. అవధూత పిచ్చమ్మ 12 ఏళ్ళు మౌనవ్రతం పాటించారు. అప్పుడప్పుడు మహాత్ములను దర్శించి వచ్చారు. ఎన్నో లీలలు, అద్భుతాలు ప్రదర్శిస్తూ భక్తులను నిరంతరం కనిపెట్టి ఆపద్బాంధవిగా వ్యవహరించేవారు. ఆమె అనుగ్రహంతో ఆశ్రితులకు ఆయురారోగ్యాలు, ఐశ్వర్యాలు సమకూరేవి. జ్ఞానుల్లో జ్ఞాని, భక్తులలో భక్తురాలు, అవధూతల్లో అవధూత అయిన 1981 జూన్ 8 రాత్రి 12 గంటల 52 నిముషాలకు కపాలాన్ని ఛేదించుకుని శరీరం చాలించారు. మరునాడు సాయంత్రం జ్యేష్ఠ శుద్ధ నవమినాడు మహాసమాధి జరిగింది. ఆమె సమాధిపై మందిరం నిర్మించారు. అమ్మ అనుగ్రహం భక్తి శ్రద్ధలతో దర్శించేవారికి ఈనాటికీ లభిస్తోంది.

## 17. చీరాల అవధూత (1912-1972)

చీరాల అవధూత స్వామి కడపజిల్లాలో ఒక వైశ్య కుటుంబంలో జన్మించి చిన్నప్పుడే ఇల్లు విడిచి వచ్చేశారు. 1967లో ఆయన వయస్సు 55 సంవత్సరాలుగా తెలియడంతో ఆయన 1912లో జన్మించి ఉండవచ్చునని చరిత్రకారులు భావిస్తున్నారు. 1943 ప్రాంతంలో చీరాల ఆసుపత్రి వద్ద గుంపెన చెట్ల నీడలో కాషాయాంబరాలు ధరించిన గురువు వెంట ఉండేవారు. సాంబ్రాణి కడ్డీలు వెలిగించి ఇసుకలో చెక్కి వటి బియ్యం చల్లేవారు. ఎడమకాలు బోద అవటం వల్ల ఆయనను బోదకాలు స్వామి అని కూడా పిలిచేవారు. స్వామి బాలుడుగా, యువకుడుగా, వృద్ధుడుగా చీరాలలోనే తిరిగేవారు. ఆహారం తీసుకోకపోయినా బలిష్ఠంగా ఉండేవారు. 1959లో ఆయన చిలకలూరిపేటకు వెళ్ళి అక్కడ 1963 వరకు ఉన్నారు. ఆయన పగలే అందరికీ కనపడేవారు. రాత్రి వేళల్లో కనపడేవారు కాదు . ఒకేసారి నెల్లూరు, గుంటూరు, హైదరాబాద్, శ్రీశైలంలో కనిపించేవారు. ఆయన అద్భుత శక్తులు, లీలలు ప్రదర్శించేవారు. అనారోగ్యవంతులకు ఆరోగ్యం చేకూర్చేవారు. ఆయన తితిక్షువు. దంద్వాలకు అతీతుడు. కోరికలుండేవి కావు. దేహాన్ని నిలుపుకోవడానికే భోజనం చేసేవారు. మౌనం పాటించేవారు. అఖండయోగం చేసేవారు. ఆయన కాళ్ళు, చేతులు, మొండెం వేరువేరుగా పడి ఉండేవి. ఇలా ఎన్నో లీలలు ప్రదర్శించిన నిరాడంబర అవధూత స్వామి ఆత్మ పరీధావి

సంవత్సర శ్రావణ బహుళ ఏకాదశి ఆదివారం 3-9-1972 తెల్లవారు ఝామున 4.30 గంటలకు పరమాత్మలో లీనమైంది. భక్తులు ప్రతిఏటా ఆయన ఆరాధనోత్సవాలు జరుపుతున్నారు. ఈనాటికీ ఆయన సమాధి దర్శించిన వారికి కోరికలు తీర్చి శాంతిని ప్రసాదిస్తున్నారు.

## 18. ధాభా కొండయాచార్య స్వామి (1834 - 1939)

మహారాష్ట్రలోని చాందా (చంద్రపూర్) జిల్లా ధాభా గ్రామంలో అంబేద మల్లయ్య, సుగంధమ్మ అనే జంగం దంపతులకు మూడవ కుమారుడుగా జన్మించిన శిశువుకు కొండయ్య అని పేరు పెట్టారు. విజయనామ సంవత్సర మాఘశుద్ధ తదియ సోమవారం (10-2-1834న) జన్మించిన కొండయ్య పుట్టగానే, 'నమో బసవ లింగాయనమ: మంత్రం ఉచ్ఛరించి అందరికీ ఆశ్చర్యానందాలు కలిగించారు. శిశువు జాతకం పరిశీలించిన దైవజ్ఞులు ఆ శిశువు 105 ఏళ్ళు జీవించి ఆశ్రుతులను, ఆర్తులను తన అపార మహిమలతో రక్షిస్తూ అఖండ కీర్తిని ఆర్జించగల భగవదంశ సంభూతుడు, వేదాంతి, రాజయోగి, సిద్ధ పురుషుడు అవుతాడని చెప్పారు. పుట్టిన 12 వ రోజునుంచే ఆ శిశువు మహిమలు ప్రదర్శించసాగాడు. ఏడాదిలో సమస్త విద్యలు అభ్యసించాడు.

వివాహమైనా సంసార బంధాలు తెంచుకుని అహర్నిశలు ఈశ్వర ధ్యానంతో కొండలు కోనలు తిరుగుతూ శ్రీశైలం అడవులు చేరారు. అడవులలో క్రూర జంతువులను సైతం మచ్చిక చేసుకుని వాటిని వేటగాండ్ర బారి నుండి రక్షించి అద్భుతాలు చేస్తూ శ్రీశైలం చేరారు. పాతాళ గంగలో స్నానం చేసి ఆ జలంతో మల్లికార్జునుని అభిషేకించి, భ్రమరాంబను దర్శించి మల్లికార్జునుని సింహద్వారం ఎదుట నిలిచిన కొండయ్యకు కోటి సూర్య ప్రకాశంతో సర్వేశ్వర తేజం దర్శనమైంది. సర్వసంగ పరిత్యాగి అయిన కొండయ్యకు సద్గురు కటాక్షం వల్ల అష్టాంగ యోగం, రాజయోగం సులభ సాధ్యమై లక్ష్యసిద్ధి కలుగుతుందని అశరీరవాణి వినపడింది. ఈశ్వరాజ్ఞ మేరకు చెల్వూరులోని పరమారాధ్యుల రాజయ్య ఆశీర్వాదంతో పాటు శ్రీశైలంలో వివిధ పుణ్య స్థలాలను సందర్శించి మారేడు, నిమ్మ, వెలగ చెట్లున్న గుహలో ఇరువురూ తపస్సు చేశారు. గురువు కొండయ్యకు మంత్రోపదేశం చేసి సకల శక్తులు ధారపోసి పరమహంస బిరుదుతో సత్కరించి లోకకళ్యాణార్థం దేశాటన చేయవలసిందిగా ఆదేశించారు. గురువు ఆదేశాన్ని అనుసరించి కొండయార్యుడు 12 సంవత్సరాలు కఠిన తపస్సు చేసి ఈశ్వరకృపను, సాధన చతుష్టయ సంపత్తిని, పరబ్రహ్మ తత్వాన్ని సాధించారు. తరువాత శ్రీశైలం నుంచి నంది మేండారం చేరారు. అక్కడి నుంచి అనేక అద్భుతాలు చేస్తూ దేశ సంచారం చేశారు. విపరీత చేష్టలతో అభీష్టాలు నెరవేర్చేవారు. వ్యాధులు నయం చేసేవారు.

సద్గురువు, శిష్యవత్సలుడు, సన్మార్గదర్శి - పరమహంస కొండయార్యులు 105 సంవత్సరాలు జీవించి ప్రమాథి సంవత్సరం కార్తీక శుద్ధ చవితి మంగళవారం 14-11-1939 నాడు ముందుగానే కట్టించుకున్న సమాధిలో ప్రవేశించి ద్వారం మూసివేయించుకున్నారు.

ఇప్పటికీ ఆయన సమాధి నుండి సూక్ష్మరూపంలో ఆర్తులకు కొంగు బంగారమై పూజలందుకుంటున్నారు.

## 19. గుంటూరు నల్లమస్తాన్ (1685 - 1895)

మస్తాన్ అంటే ఉర్దూ భాషలో "దైవోన్మత్తుడు" అని అర్థం. అటువంటి దైవోన్మత్తులైన ముస్లిం అవధూతలలో గుంటూరుకు చెందిన నల్లమస్తాన్. ఆయన కనీసం 200 ఏండ్లు జీవించి 23-5-1895 న సిద్ధి పొందినట్లు 'ఆంధ్ర మహాభక్త విజయం' అనే గ్రంథం ద్వారా తెలుస్తోంది. ఆ క్రమంలో ఆయన 1685 ప్రాంతంలో జన్మించి ఉండవచ్చునని కొందరు భావిస్తున్నారు. ఈయన పూర్వ నామం మస్తాన్‌వలి. తిరుచినాపల్లిలో సయ్యద్ వంశంలో జన్మించిన మస్తాన్‌వలి బాల్యంలోనే ఇల్లు విడిచి దేశసంచారం చేసి, అడవులలో నివసించి కఠిన తపస్సు చేసిన యోగిగా, యోగ సిద్ధులతోపాటు ఆత్మసాక్షాత్కారం పొందారు. 1880 నుండి ఆయనను సేవించిన నెల్లూరు జిల్లా పామూరు నివాసి షేక్ మదార్ సాహెబ్ ద్వారా నల్లమస్తాన్ చరిత్ర వెలుగులోకి వచ్చింది.

మస్తాన్ వలీ గుంటూరుకు వచ్చిన తొలిరోజుల్లో ఆసుపత్రి సమీపంలోని మునగచెట్టు క్రింద ఉండేవారు. ఒకరోజు ఉరుములు, మెరుపులతో కుంభవృష్టి కురిసినా ఆయన కూర్చున్న మేరలో వానలేదు. ఆయన తడవలేదు. అదే సమయంలో పిడుగుపడి చనిపోయిన ఒక మేకను, ఒక మనిషిని తన స్పర్శతో బ్రతికించారు. అటువంటి మహిమలను చూసి, కడప నివాసి అయిన ఒక మహమ్మదీయ వర్తకుడు గుంటూరు సంగడిగుంటలో ఆయనకు ఒక ఇల్లుకొని సమర్పించాడు. ఆ ఇంట్లోనే మస్తాన్‌వలీ, ఆయన శిష్యులు కొంతకాలం నివసించారు. ఈనాటికీ ఆయన దర్గాకు ఆనవాయితీగా ఆయన ఇంటి నుండి పూజాద్రవ్యాలు తీసుకువెడతారు.

మస్తాన్‌వలీ అనిద్రయోగి, ఆయన ఎల్లప్పుడూ తిరుగుతూనో, కూర్చునో ఉండి దైవధ్యానంలో వుండేవారు. ఎప్పుడూ నడుం వాల్చని అనిద్రయోగి ఆయన. మస్తాన్ యోగవిద్యలో ప్రవీణులు, సర్వజ్ఞుడు అనడానికి ఎన్నో ఉదాహరణలున్నాయి. ఆయన తాను దేహం చాలించే రోజును (23-5-1895) ఐదురోజుల ముందే భక్తులకు వెల్లడించారు. ఆ ప్రకారమే దేహాన్ని చాలించారు. భక్తుడు నగరం పిచ్చయ్య ఇచ్చిన స్థలంలో మస్తాన్‌వలీ దేహాన్ని ఖననం చేయడానికి భక్తులు ఏర్పాటు చేస్తుండగా ఆరోగ్యశాఖాధికారి నగరంలో సమాధి చేయకూడదని అభ్యంతరం తెలిపాడు. ఫలితంగా ఆ అధికారికి కడుపునొప్పి ప్రారంభం కావడంతో అందుకు అంగీకరించగా అధికారికి కడుపునొప్పి తగ్గిపోయింది. అనంతరం ఇస్లాం మతాచార ప్రకారం ఆయన భౌతిక కాయానికి సంస్కారాలు చేసి ఖననం చేశారు. అనంతరకాలంలో సమాధిపై పెద్దబండ వేసి గోరి, పెద్ద పెద్దకట్టడాలు నిర్మించారు. గుంటూరులో నల్లమస్తాన్‌వలీ దర్గా ఈనాటి హిందువులకు, ముస్లింలకు అభీష్టాలు నెరవేరుస్తున్న కల్పతరువుగా, దర్శనీయ యాత్రాస్థలంగా వెలుగొందుతోంది.

## 20. గంగాయపల్లె సూక్ష్మ మూర్తెమ్మ (1807-1928)

పాతిక సంవత్సరాలైనా నిండకముందే కర్మబంధాలను తెంచుకుని వల్లూరు మండలం గంగాయపల్లెలో వందేళ్ళు తపస్సు చేసి అక్కడే సమాధి చెందిన సూక్ష్మమూర్తెమ్మ 1807 ప్రాంతంలో కడపజిల్లా జమ్మలమడుగు తాలూకా కుందు నదీతీరంలోని పెద్దముడియం గ్రామంలో జన్మించారు. యనమదలగురవాచారి, అచ్చమ్మ అనే విశ్వబ్రాహ్మణ దంపతులు ఆమె తల్లిదండ్రులు. బాల్యంలోనే తల్లిని కోల్పోయిన మూర్తెమ్మ ఒంటరిగా నదీ తీరానికి వెళ్ళి ఇసుక దిబ్బల్లో గుంటలు త్రవ్వుతూ ఉండగా ఒక శివలింగం దొరికింది. ఆ లింగాన్ని ఆమె ఇంటికి తెచ్చి నిత్యం పూజింపసాగింది. వివాహమైన తరువాత కూడా ఆమె ప్రవర్తన మారకపోవడంతో ఆమెను యోగిని అన్నారు. ఆమె ఎన్నో మహిమలు ప్రదర్శించారు. ఇలా ఉండగా ఆమె మేనత్త, మేనమామ 20 ఏళ్ళ ఆమెను 1827 లో గంగాయపల్లెకు తీసుకువెళ్ళారు. అక్కడ ఆమె అంతర్ముఖత్వం, అతీంద్రియదృష్టి స్పష్టమయ్యాయి. ఎప్పుడూ ధ్యానం, తపస్సు చేస్తూండగా పిచ్చయశాస్త్రి అనే గురువు ఆమెకు మంత్రోపదేశం చేసి ఆమెకు చిన్నతనంలో లభించిన శివలింగాన్ని ప్రతిష్ఠించి పునాదికాలు నెరవేరుస్తూ మంత్రం జపించమని ఆదేశించాడు. ఆమె అలాగే చేస్తుండగా ఆమె సూక్ష్మదృష్టి మంత్రానుష్ఠానం నుండి యోగం వైపు మళ్ళింది. అప్పటి నుండి ఆమెను 'సూక్ష్మమూర్తెమ్మ' అనేవారు. అందుకోసం ఆమె కమలాపురం మండలం అప్పాయపల్లెకు చెందిన సుబ్బయ్య గురువువద్ద బ్రహ్మోపదేశం పొంది, యోగసాధనను తీవ్రతరం చేసింది. ఆమె సంయమ యోగాన్ని సాధించి అధర్మ కీర్తనలు, కందార్థాలు, సహస్రార ప్రదర్శన అనే వేదాంత యక్షగానం వంటి అనేక గ్రంథాలను, ద్విపదలు రచించారు. ఒక శిష్యుడు బెంగుళూరు సమీపంలోని ఎలహంకలో ఆమెకోసం ఒక ఆశ్రమాన్ని స్థాపించారు. ఆమె ఎన్నో యోగశక్తులు, చమత్కారాలు ప్రదర్శించారు. జానపదులు ఆమెను దేవతగా కొలిచేవారు. కడప-మద్రాసు రైలు మార్గంలో గల గంగాయపల్లెలో అన్ని రైళ్ళు ఆగేలా రైల్వే అధికారులు ఏర్పాటుచేసి అన్ని వసతులు కల్పించారు. విభవనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ తదియ బుధవారం 31-10-1928 మధ్యాహ్నం 12 గంటలకు ఆమె కుండలినీయోగంతో కపాలం చేధించుకొని పరబ్రహ్మైక్యం చెందారు. ఆమె నిర్మించుకున్న శివాలయం ప్రక్కనే శిష్యులు విధివిధానోక్తంగా ఆమెను సమాధి చేశారు. అమ్మపేరుతో ఉన్న ఆరు ఆశ్రమాలలోను సాధకులు ఉన్నారు. వారు ఇతర భక్తులు ఏటేటా ఆశ్వయుజ బహుళ తదియ, చవితి రోజుల్లో ఆరాధనోత్సవాలు వైభవంగా జరుపుతున్నారు. వేదాతీతురాలై 120 ఏండ్లు వెలిగిన ఆధ్యాత్మిక జ్యోతి సూక్ష్మమూర్తెమ్మ.

## 21. గుడివాడ ఆంజనేయ పరమహంస (1892-1941)

రాజయోగ సాధనలో రామనామ ప్రాశస్త్యం లోకానికి చాటిన మహనీయుల్లో గుడివాడ ఆంజనేయ పరమహంస అగ్రగణ్యులు. కృష్ణాజిల్లా గుడివాడలో భైరవభొట్ల సీతమ్మ, జోగీశ్వర

శర్మ అనే రామభక్త దంపతులకు నందన సంవత్సర కార్తీక బహుళ షష్ఠంలో ఒక ఆదివారంనాడు (13-11-1892)లో జన్మించిన శిశువుకు ఆంజనేయశర్మ అని నామకరణం చేశారు. పేరుకు తగ్గట్లు రామనామం పాడితేనే ఆంజనేయశర్మ నిద్రపోయేవాడు. రామ నామం వినపడితే ఏడుపు ఆపేవాడు. ఆంజనేయశర్మకు ఐదవయేట అక్షరాభ్యాసం, 8వ ఏట ఉపనయనం, తండ్రిగా బ్రహ్మోపదేశం యథావిధిగా జరిగాయి. పరమాత్మతత్వ రహస్యం తెలుసుకునేందుకు సీతారామాంజనేయ గ్రంథసారాన్ని ఒంట బట్టించుకున్నాడు. ఇలా ఉండగా 13వ యేట పితృ వియోగం, 16వ యేట లక్ష్మీకాంతమ్మతో వివాహం, సంసార బాధ్యతలను పెంచడంతో నూజివీడు చేరి ఉద్యోగంలో ప్రవేశించారు. అయితే మనసు మాత్రం రామునిపైనే ఉండేది. ఒక ఏడాదిలో భద్రాచలం ఓంకారాశ్రమ మండలికి చెందిన శ్రీ సచ్చిదానంద జోగీశ్వరా వధూత ఆంజనేయశర్మ ఇంటికి స్వయంగా వచ్చి మంత్రోపదేశం చేసి వెళ్ళారు. రెండేళ్ళలో ఆంజనేయశర్మకు బ్రహ్మవిద్య రహస్యాలు కరతలామలకమయ్యాయి. కష్టాల్లో ఉన్నవారికి రామకథలు చెప్పి కష్టాలు తీర్చేవారు బ్రహ్మభావన లేని వేదోపనిష్పత్తుల పాండిత్యం వ్యర్థమని, మనోలయమైతేనే జ్ఞానానికి పూర్ణత్వం సిద్ధిస్తుందని ఆంజనేయశర్మ ప్రవచించేవారు. గురువుల ఆదేశం మేరకు ఆంజనేయశర్మ 25వ ఏట 1940లో వానప్రస్థానం స్వీకరించి గుడివాడ తాలూకా పామర్రు సమీపాన కొండిపర్రులో ఒక మామిడి తోటలో హనుమంతుని విగ్రహం ప్రతిష్ఠించి అక్కడే ఉండేవారు. ప్రతి రోజు సాయంకాలం సద్బోధలు చేసేవారు. భార్యాభర్తలు ఇరువురూ ఒకేమార్గంలో ఉండి తమ ధర్మాలు అనుష్ఠించటం ఉత్తమం. భార్యలు భర్తల చేతనే మంత్రోపదేశం పొందాలి. ప్రతి మనిషి అన్ని పనులు చేయాలి. నిన్ను నీ వెరిగి ప్రపంచాన్ని తెలుసుకున్నప్పుడే నీలో ఉన్న బ్రహ్మం నీకు కనిపిస్తుంది. ఏకాగ్రచిత్తతయే సమాధి. సమాధిలో ఆలోచించే వస్తువు తప్ప ఇతరయేదీ కనపడదు. ప్రపంచంలో ప్రతి చిన్న వస్తువు నుండి మనం నేర్చుకోవలసింది ఎంతో ఉంది. అన్నింటికీ సిద్ధపడినప్పుడే గమ్యం చేరగలం. అహంకారం అంతం కావటమే మహత్తు అదే పూర్ణ సమాధి. గురుసేవ గురుకటాక్షం పొందటం వల్లనే అది లభిస్తుంది. అని ప్రబోధిస్తూ సజ్జన సాంగత్యాన్ని విస్తరించుకుని బాపట్లలో 'శ్రీమారుతి ప్రణవాశ్రమం' స్థాపించారు. వృషనామ సంవత్సరం ఆశ్వయుజ బహుళ షష్ఠి శనివారం రాత్రి 9 గంటలకు (11-10-1941) పరమహంస సోహం స్వరూపులయ్యారు.

## 22. గుట్టూరు కోన అంజనాదేవి (1917-1977)

కోనమాతాజీగా, దివ్యమాతగా ప్రసిద్ధి చెందిన యోగిని అనంతపురం జిల్లా పెనుగొండ తాలూకా పైదేటిలో ఒక నిరుపేద కుమ్మరి కుటుంబంలో జన్మించారు. ఆమెకు తల్లిదండ్రులు పెట్టిన పేరు అంజనమ్మ. ఆమె 1917లో జన్మించి ఉండవచ్చునని భావిస్తున్నారు. అంజనమ్మ చిన్నతనంలో పెనుగొండ బాబయ్య అనే ముస్లిం యోగి సమాధి వెనుక శివాలయం వద్దగల చక్కెర చెట్టు నుండి రాలే చక్కెరను అందరికి ప్రసాదంగా పంచేవారు. 15 ఏళ్ల

వయస్సులోనారాయణప్పతో వివాహం జరిగి 30 సంవత్సరాల సంసార జీవితం గడుపుతూ దైవభక్తి బలంతో ఎందరికో మేలు చేకూర్చేవారు. ఒకసారి కోన క్షేత్రవాసి పాండురంగడు స్వప్నంలో కలిగించిన ప్రేరణతో ఆమె తన జీవితాన్ని గుట్టూరు కోనకణ్వాశ్రమంలో గడపాలని నిర్ణయించుకున్నారు. ఆమె ప్రభావంతో ఎందరో భక్తులు ఆమెను చేరారు. ఆమె ఆపదలో ఉన్నవారిని ఎందరినో ఆదుకున్నారు. వ్యాధిగ్రస్తులకు, ఆర్తులకు తన దివ్యశక్తితో మనశ్శాంతిని చేకూర్చేవారు. ఆమె అనేక చమత్కారాలు ప్రదర్శించారు. నిరక్షరాస్యురాలైన 50 ఏళ్ల ముత్తైదువ, మహాజ్ఞాని, పాండురంగని భక్తురాలు, స్తుతి నిందల కతీతురాలు, సర్వసమానత్వం పాటించే సంయమి, వాక్శుద్ధిగల భవిష్యవాణి అంజనాదేవమ్మ 1977 జూన్ 4న 60వ ఏట పింగళ నంవత్సరం జ్యేష్ఠ బహుళ చవితి శనివారం సాయంత్రం 4 గంటలకు దేహం చాలించారు. ఆమె పార్థివ శరీరాన్ని భక్తులు కోనక్షేత్రంలోని ఆంజనేయస్వామి కట్టకు అవతలి భాగంలో సమాధి చేశారు. కోన ఆశ్రమాన్ని దర్శించే భక్తులు ముందుగా అమ్మ సమాధిని పూజించి అక్కడి దేవాలయంలో పూజలు చేస్తారు. ఆమె ఆరాధనోత్సవాలు శివరాత్రి పండుగ అక్కడ ప్రతిఏటా భక్తులు వైభవంగా జరుపుకుంటున్నారు.

## 23. గంటి ఓరుగంటి నృసింహయోగీంద్రులు (1914-1978)

కొన్నివేల సంవత్సరాలుగా హిమాలయాల్లో తపస్సు చేసుకుంటూ 12 సార్లు భారతదేశంలో అవతరించిన శ్రీవిశ్వేశ్వర మహాప్రభువుల 12వ అవతారం రామలాలా మహాప్రభువు శిష్యుడు గంటి ఓరుగంటి నృసింహయోగీంద్రులు. తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకా గంటి గ్రామవాసులు ఓరుగంటి సీతమ్మ, లక్ష్మీనారాయణ సంపన్న బ్రాహ్మణ దంపతులకు ఆనంద నామ సంవత్సర ఆశ్వీయుజ బహుళ త్రయోదశి శనివారం 17-10-1914 రోజున ముంగండలో జన్మించిన మగశిశువుకు లక్ష్మీనరసింహమూర్తి అని పేరు పెట్టారు. 8వ ఏట ఉపనయనం చేసి వేదాధ్యయనం చేయించారు. పదేళ్ల వయసులో భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజుల వీరగాథలు విని, సిద్ధ పురుషుల తోడ్పాటుతో దేశ స్వాతంత్ర్యం సంపాదించాలనే లక్ష్యంతో ఇల్లు విడిచి వెళ్లిపోయారు. అన్నవరం ప్రాంతాల్లో తిరుగుతుంటే తండ్రి ఇంటికి తీసుకు వచ్చారు. మళ్లీ పారిపోయి గుంటూరులో కాశీకృష్ణాచార్యులవద్ద సంస్కృతం నేర్చుకోవటానికి చేరారు. అంత చిన్న వయస్సులోనే లక్ష్మీనరసింహమూర్తి తెలుగు, హిందీ, సంస్కృతం అనర్గళంగా మాట్లాడేవారు. మళ్లీ ఆయనను తాత నరసింహం ఇంటికి తీసుకువచ్చి గట్టి కాపలా ఉంచి కావ్యపాఠాలు చెప్పించారు. సిద్ధ పురుషులను సేవించి మహిమలు సంపాదించాలనే కాంక్ష బలీయం కావడంతో 1926లో ఒక అర్ధరాత్రి తణుకులో రైలు ఎక్కి వెడుతుండగా హరిద్వార్‌కు చెందిన మార్వాడీ దంపతులు ఆయనను తమ యింటికి తీసుకు వెళ్లారు. ఆయన ఆరు నెలల్లో అనేక శాస్త్రాలు అభ్యసించారు. 1927లో మార్వాడీ దంపతుల అనుమతితో బదరీ యాత్రకు బయలు దేరారు. ఎనిమిది రోజులు

నడచి హరిద్వారు స్వర్గారోహణ చేసిన శతోపథం హిమాలయాలలోని పర్వత గుహలో ఉన్న
విశాలమైన సమాధి నిష్ఠుడైన 350 సంవత్సరాల మహాసిద్ధపురుషుడు, తపస్వి సర్వానందావధూతను దర్శించి సేవించి శిష్యుడుగా చేరిపోయాడు. కొన్ని హఠయోగ క్రియలను సాధన చేశారు. 7 రోజుల తరువాత అవధూత ఆయనకు అక్కడి మంచు వాతావరణంలో నిలవగలిగే శక్తిని ప్రసాదించారు. అవధూత ఆదేశం మేరకు లక్ష్మీనరసింహమూర్తి హరిద్వార్ మార్వాడీ దంపతుల వద్దకు వెళ్ళి శాస్త్రాధ్యయనం చేసి తిరిగి శతోపథం చేరారు. మరికొన్ని ధ్యాన హఠయోగాలు, యోగవిద్యలు సాధన చేశారు. ఆయన సిద్ధి పొందే ముందు లక్ష్మీనరసింహమూర్తిని తమ గురువు సచ్చిదానందావధూతకు గురువైన రామలాల ప్రభువును ఆశ్రయించమని, ఆయనే మోక్ష ప్రదాత అని చెప్పి సిద్ధి పొందారు. లక్ష్మీనరసింహమూర్తి 2-10-1930న శ్రీరామలాల ప్రభువును ఆశ్రయించటానికి ఋషీకేశం చేరారు. ఆయన 'వజ్రోళి' సాధన నేర్పించారు. నరసింహమూర్తిని ఆయన ప్రేమగా 'నర్సింగ్' అని పిలిచేవారు. గురు కృపతో నర్సింగ్ కృష్ణ భక్తుడై మధురకు వెళ్ళి కొంతకాలం అక్కడ కృష్ణనామ స్మరణంతో గడిపారు. అక్కడ బృహద్భాగవతం రచించిన గొప్ప పండితునితో పరిచయమైంది. ఏక సంథాగ్రాహి అయిన నర్సింగ్‌కు బృహద్భాగవతం కంఠస్థమైంది. రామలాల ప్రభువును సేవిస్తూ నర్సింగ్ పతంజలియోగ సూత్రాలలోని అన్ని భూమికలు అధిరోహించారు. 1936లో స్వగ్రామం గంటికి వచ్చి గురుస్మరణతో కొన్నాళ్ళు శాస్త్రాధ్యయనం చేసి రామలాల ప్రభువు దేహం చాలించే సమయానికి తిరిగి ఋషీకేశం చేరారు. గురు దేవుని ఆజ్ఞపై 1941లో ఆంధ్రదేశం తిరిగివచ్చి లక్ష్మీదేవిని వివాహమాడారు. ఆంధ్రదేశాలలో అనేక మందికి ధ్యాన దీక్షలు ఇచ్చారు. దేశమంతటా పర్యటించి భగవతోపన్యాసాలు చేశారు. నెహ్రూ, రాజేంద్రప్రసాద్ వంటి ప్రముఖుల ఎదుట వజ్రోళి వంటి యోగ శక్తులను ప్రదర్శించారు. 1975లో ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆయనను కళాప్రపూర్ణ బిరుదుతో సత్కరించింది. ఆదర్శ గురువు నృసింహయోగీంద్రులు 16-6-1978న పరమపదం చేరారు.

## 24. గొరగనమూడి జ్ఞానానంద స్వామి (1896-1969)

బ్రహ్మజ్ఞానంతో పాటు భౌతిక విజ్ఞాన శాస్త్రంలోనూ అత్యున్నత శిఖరాలెక్కిన జ్ఞాన విజ్ఞానాలు రెండింటిని సమన్వయం చేసి సాధించిన ప్రాచ్యవేదాంతి జ్ఞానానంద స్వామి పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం తాలూకా గొరగనమూడి గ్రామంలో భూపతిరాజు రామరాజు సీతయ్యమ్మ క్షత్రియ దంపతులకు దుర్ముఖి సంవత్సర మార్గశిర శుద్ధ పాడ్యమి శనివారం 5-12-1896 నాడు జన్మించారు. ఆయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు లక్ష్మీనరసింహరాజు. ఆయన ప్రాథమిక విద్య స్వగ్రామంలోను, వీరవాసరంలోను, మాధ్యమిక విద్య, నరసాపురం టైలర్ హైస్కూలు ఉన్నత పాఠశాలవిద్య అభ్యసించారు. ఆయన తణుకులో చదువుతున్న రోజుల్లో 1908లో ఒక ప్రముఖ మహారాష్ట్ర యోగి శ్రీవాసుదేవానంద సరస్వతి వాసుదేవ మంత్రం ఉపదేశించారు. ఆనాటి నుండి లక్ష్మీనరసింహరాజుకు శ్రీకృష్ణ పరమాత్ముడు ఆరాధ్య

ధైవమయ్యాడు. తండ్రి ఆయనకు వివాహం చేసినా అది రామకృష్ణ పరమహంస, శారదామాతల దివ్య దాంపత్యంగా పరిణమించింది. తండ్రి గారి లైబ్రరీ నుండి వేదాంత గ్రంథాలు, 1916లో మద్రాసు వెళ్లినప్పుడు అడయార్‌లో అనిబిసెంట్‌ను దర్శించి దివ్యజ్ఞాన గ్రంథాలు, వివేకానందుని రచనలు, శ్రీరామకృష్ణ పరమహంస జీవిత చరిత్ర, లోకమాన్య బాలగంగాధరతిలక్ ఉపన్యాసాలు శ్రద్ధగా చదివి, వినేవారు. ఇవన్నీ ఆయనలో అజ్ఞాతంగా ఉన్న త్యాగ వైరాగ్యాలను వెలికి తీశాయి. 1917లో స్కూల్ ఫైనల్ పరీక్షా ఫలితాల్లో తన నెంబరు లేకపోవటంతో విరక్తితో అజ్ఞాతంలోకి వెళ్లిపోయారు. ఉత్తరదేశయాత్ర చేస్తూ ఢిల్లీ నుంచి హరిద్వార్ మీదుగా ఋషీకేశ్ స్వర్గాశ్రమం చేరి సాధన చేశారు. ఫలితంగా ఆయనకు శ్రీ కృష్ణ పరమాత్మ సాక్షాత్కారమయ్యేది. ఆయన సాధనను గుర్తించిన వారు ఆయనను యోగిరాజు అని పిలిచేవారు. కొన్నాళ్ళ తరువాత ఆయన ఆబూ పర్వతం గురుశిఖరం దత్తాత్రేయ గుహలో 6మాసాలు పశ్చిమోత్తాసనంలో సాధన చేశారు. నీలకంఠ మహాదేవ్‌లో హఠయోగ ప్రక్రియలు సాధించి సవికల్ప సమాధి పొందారు. ఆ స్థితిలో ఆయనకు శ్రీకృష్ణ దర్శనమయ్యేది. హృషీకేశంలో శరశ్చంద్రజీ అనే సిద్ధ పురుషుడు లక్ష్మీనరసింహరాజుకు 25వ ఏట దీక్ష ఇచ్చి ఉపదేశం చేసి స్వామి జ్ఞానానంద అనే దీక్షానామం ఇచ్చారు. గురువుల అనుమతితో కాశ్మీర్ ప్రయాణమై బారాముల్లా సంత్‌సింగ్ గుహలో నాలుగు నెలల పాటు ప్రాణాయామం, ఆసనాలు, ధ్యానం సాగించారు. శ్రీనగరం కాళీ పర్వత గుహల్లోను, పర్వతంపై గుహలోను కొంతకాలం తపస్సు చేశారు. బాడీపూరా ఆపిల్‌తోట కుటీరంలో ధ్యాన నిమగ్నుడు కాగా అక్కడ ఆయనకు నిర్వికల్ప సమాధి జరిగింది. చివరకు జ్ఞానానందులు గొరగనమూడి చేరి తోటలోని కుటీరంలో తపస్సు చేస్తూ 'మ్యాన్ టు బుద్ధ' అనే ఇంగ్లీషు పద్యం రచించారు. అనంతరం కైలాసయాత్ర కూడా చేసి మానస సరోవరంలో మూడు రోజులు తపస్సు చేశారు. యోగ సాధనానుభూతులను స్వామి 30 పూర్ణ సూత్రాలుగా రచించారు. అలా పరబ్రహ్మ సాక్షాత్కారం పొందిన స్వామి జ్ఞానానంద జర్మనీ, ఇంగ్లాండ్, అమెరికా దేశాల్లో కలిన పరిశ్రమతో ఆధునిక విజ్ఞానంలో అత్యున్నత శిఖరాలందుకున్నారు. భారత ప్రధాని నెహ్రూ ఆహ్వానంపై నేషనల్ ఫిజిక్స్ లేబరేటరీ పరమాణు విజ్ఞాన పరిశోధనా విభాగం అధిపతిగా 17 ఏళ్ళు పని చేశారు. 1965 నుండి 69 వరకు ఆయన ఎందరికో మంత్రదీక్ష ఇచ్చారు. ఎన్నో వేదాంత, విజ్ఞాన గ్రంథాలు రచించారు. సౌమ్య సంవత్సర భాద్రపద శుద్ధ దశమి ఆదివారం 21-9-1969 ఉదయం 7గంటల 45నిమిషాలకు విశాఖపట్నంలో జ్ఞానానందులు దేహం చాలించారు. మరునాడు ఆయన భౌతికకాయాన్ని గొరగనమూడి శ్రీరామజ్ఞాన మందిరం ప్రాంగణంలో సమాధి చేశారు.

## 25. గుంటూరు బూర్లె రంగన్నబాబు (1895-1979)

భగవదనుభవాన్ని అనునిత్యం పొందిన అరుదైన మహనీయుడు బూర్లె రంగన్నబాబు. ఆయన నడుస్తూ, పనిచేస్తూ, మాట్లాడుతూ కూడా సమాధి స్థితిలోనే ఉండే పరిపూర్ణయోగి.

రంగన్నబాబు పూర్వీకుల నివాసం ఒంగోలు జిల్లా దరిశి తాలూకా శ్రీరామభద్రపురం కాగా ఒకతరం వారు పశ్చిమగోదావరి జిల్లా ముఖ్యపట్టణం ఏలూరుకు తరలి వచ్చారు.

వీర బ్రహ్మేంద్రస్వామి భక్తుడు బూర్లెపుల్లయ్య, జాలమ్మ అనే నిరుపేద వైశ్య దంపతులకు మూడవ సంతానంగా శ్రీరామ భక్తుడు రంగన్నబాబు 1895లో జన్మించాడు. ఒకనాడు తన వయసు వాడు అయిన అపరిచిత బాలుడొకడు రంగన్నను ఆరు నెలలు దేశమంతా తిప్పి ఇంటివద్ద క్షేమంగా దించి వెళ్ళాడు. రంగన్న సత్సంగాలకు ఆధ్యాత్మిక ప్రసంగాలకు, గోష్ఠులకు వెళ్లి పూర్ణ విశ్వాసంతో నిరంతర నామస్మరణ, ధ్యానాలతో ఇష్టదైవత సాక్షాత్కారం పొందవచ్చునని గ్రహించి ఆచరించాడు. ఆయన హృదయంలో రాముడు, ఆంజనేయుడు, శ్రీకృష్ణుడు కొలువయ్యారు. లక్ష్మీదేవమ్మను వివాహం చేసుకుని రంగన్న ఆరుగురు సంతానాన్ని పొందారు. నీళ్ల కావిళ్ళు మోసి వారిని పోషించారు. 1962లో భార్య లక్ష్మీదేవమ్మ మరణించిన తరువాత ఆయన భక్తులు నీళ్ల కావిళ్ళు మోసేపని నుండి తప్పించి గుంటూరులో నిలుపుకున్నారు. ఆయనను భక్తులు బాబుగారు అని పిలుచుకునేవారు. బాబుగారు తమవద్దకు వచ్చేవారితో లోతైన తాత్విక విషయాలు, జన్మకర్మల రహస్యాలు మాట్లాడేవారు. నామం చేస్తే కర్మ కరిగి పోతుందనేవారు. ఎన్నో మహిమలు ప్రదర్శించేవారు. 'అవన్నీ రామచంద్ర ప్రభువు రంగన్నబాబు ద్వారా చూపించిన లీలలేనని రంగన్నబాబు అనేవారు. సిద్ధార్థి సంవత్సరం కార్తీక శుద్ధ విదియ సోమవారం 22-10-1979 రోజున రంగన్న ప్రభువు శ్రీరామచంద్ర ప్రభువు పాదపద్మాలలో లీనమయ్యారు. ఆయనకు సమాధికాని, మందిరంగాని లేవు.

## 26. గోవర్ధనగిరి ముద్దయ్య స్వామి (1850 - 1940)

కర్నూలు జిల్లా ద్రోణాచలం తాలూకా గోవర్ధనగిరి గ్రామం 19వ శతాబ్దంలో పుణ్యాత్ములైన యాదవులకు గోసంపదకు నిలయం. ఆ గ్రామంలో సూరి వంశంలో బద్దుల రంగయ్య, చౌడమ్మ అనే యాదవ దంపతుల కనిష్ఠ పుత్రుడుగా 1850 ప్రాంతంలో జన్మించారు. ఆయనే అనంతరకాలంలో యోగిగా మారి ముద్దయ్య స్వామి అయ్యారు. 1940లో తమ 90వ యేట జీవ సమాధి అయ్యారు.

ఆయన చదువు సంధ్యలు రానిగి గ్రామీణుల నోట ఇల్లు కట్టుకున్న ఆంధ్ర జానపద యోగి శిరోమణి-ముద్దయ్య. ఆయనకు చిన్నప్పటి నుండి భక్తి, దైవ చింతనలతో పరధ్యానంలో ఉండే వారు. అక్షరజ్ఞానం లేదు. అడవిలో తమ ఆవులను మేపేందుకు తోలుకు వెళ్లి అక్కడ ఏ చెట్టు నీడనో, పుట్ట దగ్గరో ఏకాంతంలో ధ్యాన నిమగ్నుడయ్యేవాడు. ఒకరోజు మండుటెండలో ముద్దయ్య ఒకచోట ఉండగా ఒక పెద్ద నాగుపాము పడగ విప్పి ఎండ తగులకుండా ఆయన తలపై గొడుగు పట్టింది. ముద్దయ్యను అప్రయోజకుడుగా తలచిన తల్లిదండ్రులు ఆ ఊళ్ళోనే ఉండే సాధుపురుషుడు, ధార్మికుడు అయిన కొలుట్లయ్య అనే మాలదాసరి వద్దకు తీసుకువెళ్లి

తమ కుమారుని ప్రయోజకునిగా చేయమని ప్రార్థించారు. ముద్దయ్యను కొలుట్లయ్య తన వెంట యాగంటి క్షేత్రానికి తీసుకు వెళ్ళి అక్కడ యాగంటీశ్వరుని సమక్షంలో మంత్రోపదేశం చేశాడు. ముద్దయ్య దీక్షతో ఆ మంత్రాన్ని జపిస్తూ నిరంతరం భగవధ్యానంలో ఉండేవాడు. ఒక రోజున కోటిపెట్టి, బావి వద్ద ఒక జ్యోతిని వెలిగించి ఆరాధన కోసం ఒక శివలింగం చెక్క సాగాడు. అతని అన్నలు ఆ జ్యోతి ముందు ధ్యానంలో ఉన్న ముద్దయ్యను చూసి ఆగ్రహించి ఆ శివలింగాన్ని 'భోజనం' బావిలో పడవేసి ఆవులను ఇంటికి తోలుకు పోయారు. ధ్యానముద్ర చాలించిన ముద్దయ్య విషయం తెలుసుకుని బావిలో దూకి ఒక చేత శివలింగం, మరో చేత జింక చర్మం ధరించి నీటి పై తేలాడు. నడి బావిలో జింక చర్మం పరచి పద్మాసీనుడై చేతిలో శివలింగం ధరించి ధ్యాన నిమగ్నుడయ్యాడు. ఈ సంఘటనతో ముద్దయ్య మహిమ గోవర్ధనగిరి పరిసర గ్రామాల్లో కూడా వ్యాపించింది. తల్లిదండ్రులు ముద్దయ్యకు బలవంతంగా వివాహం చేశారు. ఆమె రజస్వల కూడా కాకుండానే చనిపోవటంతో మరింత వైరాగ్యాన్ని పెంచుకున్న ముద్దయ్య జ్ఞాన ధనసముపార్జన కోసం, సాధు జన సాంగత్యం కోసం దేశాటనకు బయలుదేరాడు. ఈలోగా తల్లి చౌడమ్మ మరణించిందన్న వార్తవిని గోవర్ధనగిరికి తిరిగి వచ్చి ఆమెకు సమాధి కట్టించి ఒక చెట్టునాటాడు. నేడు ఆ సమాధిని 'ముసలమ్మ కట్ట' అంటారు. ముద్దయ్య ఆ సమాధి వద్దనే పర్ణశాల నిర్మించుమని ఆశ్రమ జీవితం ప్రారంభించారు. అప్పడప్పడు పత్తికొండ తాలూకా గోనెగండ గ్రామంలో చింతలస్వామిని, యాగంటీశ్వరుని దర్శించేవారు. ఆశ్రయించిన ఆర్తుల బాధలు తొలగిస్తూ అభయ హస్తంతో ధర్మ ప్రబోధం చేస్తూ ప్రజలను భక్తి మార్గంలో నడిపించే ముద్దయ్యస్వామికి ఎందరో శిష్యులు తయారయ్యారు. ఆయన ఎన్నో అద్భుతాలు, మహిమలు ప్రదర్శించారు. ఆయన బాల్యంలో చెక్కిన శివలింగాన్ని ఆశ్రమం సమీపంలో ప్రతిష్ఠించారు. ముద్దయ్య స్వామి తాము జీవసమాధి అయ్యే విషయం ఐదేళ్ళకు ముందే చెప్పి సమాధి నిర్మాణం చేయించుకున్నారు. తమ ప్రాణవాయువులను బ్రహ్మరంధ్రం ద్వారా విడిచి పెట్టారు. ఆయన ఆరాధనోత్సవం ప్రతి ఏటా శ్రావణ శుద్ధ సప్తమి నాడు వైభవంగా జరుగుతుంది.

## 27. హైదరాబాద్ భట్‌జీ బాపూ మహారాజు (1845-1932)

తమ జీవిత పర్యంతం, తనువు చాలించిన తరువాత కూడా ప్రతి ద్వాదశినాడు అన్నదాన వ్రతం సాగిస్తున్న సత్పురుషుడు భట్‌జీ బాపూ మహారాజు. ప్రతి దినం మధ్యాహ్నం భోజన సమయానికి ఎందరో అతిధులు ఆయన సంస్థానంలో ఉండేవారు. ఆయన ఏకాదశి నాడు ఉపవసించి రాత్రి ధ్యానానంతరం హరికథ, భగవన్నామ సంకీర్తన చేసేవారు. ఆ మహారాజు జీవితం లౌకికంగానే ఉండేది. ఆయన సామాన్యుని మాదిరిగా ప్రపంచ సుఖదుఃఖాలను అనుభవించారు. కష్టనష్టాలలో సహనం వహించారు. 'హృదయంలో అహంకారం లేనివారి హృదయ సింహాసనాన్ని భగవంతుడు అధిష్ఠిస్తారనీ, దానినే సహజ సమాధ్యవస్థ అంటారని,

అటువంటి సహజ సమాధి సాధ్యమైతే మనం చేసే ప్రతికర్మ భగవత్ కర్మగా మారి దివ్యకర్మ అవుతుందని, బోధించేవారు. పారమార్థికతతోపాటు లౌకిక కర్మలు కూడా చేసిన మహారాజు సంతానవంతుడైనా సంతాన ప్రేమలోపడక జీవితమంతా ధ్యానం, పూజ, అర్చన, భగవత్సేవ, భగవదుత్సవాలు, నాదోపాసనలోనే గడిపారు. ఆయన నిష్కామకర్మ యోగి. ఆయనకు మరాఠీ, తెలుగు, హిందీ, ఉర్దూ భాషలు, సంగీతం బాగావచ్చు. ఆయన విశ్వావసు సంవత్సర శ్రావణ బహుళ నవమి మంగళవారం 26-8-1845న హైదరాబాద్ ఉప్పగూడ (మహారాజు తోట)లో జన్మించారు. ఆయన తండ్రి రామచంద్రపంత్, తల్లి సీతామాయి చిన్నతనంలోనే భట్‌జీ మహారాజు బాలంభట్టు అనే సంస్కృత విద్వాంసుని వద్ద వేదం, సంస్కృత సాహిత్యం అభ్యసించారు. శ్రీమద్భాగవతంతో పాటు నాదబ్రహ్మోపాసన చేశారు. సంగీత కళను ఎంతో నిష్ఠతో ఉపాసించారు. ఆయన అలౌకిక గంధర్వుడు ఖ్యాల్ టప్పాగానంలో ఆయన నిష్ణాతుడు. ఆయన క్రోధాహంకారాలను జయించిన శాంతమూర్తి. ఆయనకు 60 ఏళ్ల వయసు రాగానే అంధత్వం ప్రాప్తించినా ఏకాదశీ వ్రతాలు, తపోధ్యానాలు విరమించలేదు. 85వ ఏట సన్యాస దీక్ష స్వీకరించి అంగీరసనామ సంవత్సర వైశాఖ శుద్ధ ఏకాదశి సోమవారం 16-5-1932 రోజున అనంతంలో కలిసిపోయారు. ఆయన భౌతిక కాయాన్ని వారి తోటలోనే సమాధి చేశారు. ఈనాడు ఉప్పగూడాలోని మహారాజు సమాధి ఒక యాత్రా స్థలం. అక్కడ ఇప్పటికీ ప్రతి ద్వాదశినాడు ఏడెనిమిది వందల మందికి సమారాధన జరుగుతోంది.

## 28. హైదరాబాదు నారాయణ మహారాజు (1860-1914)

ఉస్మానాబాద్ జిల్లా ఉద్గర్‌లో కేశవరావు, కృష్ణాబాయి దంపతుల నోములు, ఈశ్వరారాధనలు, హనుమదుపాసనల ఫలితంగా రౌద్రి సంవత్సర జ్యేష్ఠ శుద్ధ నవమి మంగళవారం (29-5-1860) రోజున జన్మించిన మహనీయుడు కాశీనాథుడు. ఆయనే అనంతర కాలంలో నారాయణ మహారాజుగా విఖ్యాతుడైన సద్గురువు.

పసితనంలోనే తల్లి చనిపోగా తండ్రి కేశవరావు తన ఐదుగురు సంతానంతో 1865లో హైదరాబాద్ చేరి అక్కడ ఖుర్షీద్‌జా దేవిడీ నవాబు వద్ద ఉద్యోగం సంపాదించాడు. ఐదేళ్ల నారాయణకు ఉపనయనం చేశాడు. అప్పటి నుండి నారాయణకు విద్యాధ్యయనం , ఉపాసన ధ్యానధారణాది నిష్ఠ బలపడసాగాయి. మంత్రదీక్ష కోసం నారాయణ కార్వాన్‌లోని కేసరి హనుమాన్ మందిరానికి వెళ్లి తపస్సు ప్రారంభించారు. బంధుమిత్రులు నారాయణకు బలవంతంగా వివాహం చేసి సంసారంలోకిలాగారు.

ఇలా ఉండగా సమర్థ రామదాస స్వామి సంప్రదాయానికి చెందిన శ్రీరామ కృష్ణ మహారాజు హైదరాబాదుకు వచ్చి నారాయణకు తారక మంత్రం, యోగం ఉపదేశించి, దాసబోధ గ్రంథం పారాయణ నిరంతరం చేయాలని, రామభక్తిని ప్రచారం చేయాలని, నిందాస్తుతులను లెక్క చేయకూడదని బోధించారు. 1880లో భార్య మరణించడంతో వికారాబాద్ సమీపంలోని

అనంతగిరికి, అక్కడి నుంచి సమర్థ రామదాస స్వామి స్థలమైన సజ్జనగడకు బయలు దేరారు. అక్కడ 'శ్రీరామ జయరామ జయజయరామ' అనే 13 అక్షరాల మంత్రాని 13 కోట్ల సార్లు జపించారు. దాసబోధ గ్రంథం అనేక ప్రతులు లిఖించారు. ఆరేళ్లపాటు కఠోర దీక్షతో తపస్సు చేసిన నారాయణ మహారాజుకు 1887లో శ్రీసమర్థ రామదాస స్వామి సాక్షాత్కారం లభించింది. అక్కడి నుండి బయలుదేరి కుండలవాడి చేరి శ్రీరామకృష్ణ మహారాజువద్ద సాంప్రదాయక దీక్షను స్వీకరించారు.

అనంతరం నారాయణ మహారాజు సజ్జనగడ చేరి స్వామి సమర్థుల సమాధి వద్ద తపస్సు చేసి సమర్థుల సాక్షాత్కారం పొందారు. తరువాత భారత దేశంలోని పవిత్ర క్షేత్రాలన్నింటిని దర్శించి హైదరాబాద్‌కు తిరిగి వచ్చిన నారాయణ మహారాజ్ 1891లో హైదరాబాద్ పాతబస్తీలో ఒక మఠం స్థాపించారు. అందులో నిత్యపూజలు, కార్యక్రమాలు, తాళసప్తాహాలు, శ్రీరామ నవమి ఉత్సవాలు ఏర్పాటు చేశారు. ఎన్నో లీలలు ప్రదర్శించారు. ఆయనకు ఎందరో శిష్యులు తయారయ్యారు.

ఆనంద నామ సంవత్సర జేష్ఠం శుద్ధ దశమి బుధవారం 3-6-1914 రోజున ఉదయం 7గంటలకు నారాయణ మహారాజు గీతా పారాయణం జరుగుతుండగా స్పృహ కోల్పోయి శ్రీరామచంద్రుని పాద పద్మాలలో కలిసి పోయారు. పురానాపూల్ శ్మశాన వాటికలో ఆయన భౌతిక కాయానికి అంతిమ సంస్కారం జరిగింది. సద్భక్తులకు ఆమహారాజు సాక్షాత్కారం ఇప్పటికీ లభిస్తోంది. మఠంలో ఏడాది పొడుగునా ధార్మిక కార్యక్రమాలు, రెండుపూటలా పూజ, హారతులు, శ్రీరామనవమి ఉత్సవాలు, జ్యేష్ఠ శుద్ధ దశమినాడు నారాయణ మహారాజు ఆరాధనోత్సవం, శ్రావణమాసంలో మహారాజు సమాధికి రుద్రాభిషేకం, మార్గశిర పూర్ణిమ నాడు దత్త జయంతి, మాఘమాసంలో దాసనవమి ఉత్సవాలు జరుగుతూ ఉంటాయి.

## 29. కేశవస్వామి భాగానగర్‌కర్ (1610 - 1683)

ఛత్రపతి శివాజీ గురువు సమర్థ రామదాసుతో పాటు మరో నలుగురు సత్పురుషుల సమర్థ పంచాయతన కూటమిలో నాల్గవయోగి భాగ్యనగర్ (హైదరాబాద్) కు చెందిన కేశవస్వామి భాగానగర్ కర్ ఒకరు. అక్కడ ప్రవహించే మూసీనదికి పూర్వనామం ముచికుందా నది. ఆ నదీతీరంలోని పంటచేల మధ్య గల ఒక వేదికపై కేశవస్వామి పాదుకలు ఇప్పటికీ దర్శనమిస్తాయి. ఆ పాదుకల క్రిందనే కేశవస్వామి సజీవసమాధి అయ్యారు. ఆ ప్రాంతాన్ని నేడు జియాగూడ పేరుతో వ్యవహరిస్తున్నారు.

ప్రస్తుతం కర్ణాటక రాష్ట్రం బీదరుజిల్లాలో నిలంగా సమీపాన కళ్యాణినగరంలో కేశవస్వామి ఆ ఊరి కరణం ఆత్మారాముడు, గంగాబాయి దంపతులకు (1610 ప్రాంతంలో) జన్మించారు. ఋక్శాఖా బ్రాహ్మణ కుటుంబానికి చెందిన ఆ దంపతులకు సంతానం కలుగనందున అనేక

వ్రతాలు, ఉపవాసాలు చేసిన ఫలితంగా గంగాబాయికి 80వ ఏట జన్మించిన కేశవునికి ఐదేళ్ల వయసు వచ్చేవరకు మాటలే రాలేదు. జగద్గురు శంకరాచార్యులు ఆ బాలుని చెవిలో మంత్రం చెప్పి శిరసుపై చేతినుంచి దీవించటంతో వాక్ప్రవాహ బయలుదేరింది. యుక్తవయసులో ఉపనయనాది సంస్కారాలు, శ్రీధరపంతు సబ్నవీసు కుమార్తెతో వివాహం జరిగినా పసితనం నుంచి విరక్తుడైన కేశవస్వామి సంసార బంధాలలో చిక్కుకోలేదు. నిత్యం నామస్మరణం, ధ్యానం, ఉపవాసాలు, జాగరణలతో కాలం గడుపుతూ కాశీరాజస్వామి అనే గురువువద్ద దీక్ష స్వీకరించి భక్తి వేదాంతాలు ప్రచారం చేస్తూ గ్రామాలు తిరుగుతూ భాగ్యనగరం చేరారు.

ఆయన ప్రవచనాలు భాగ్యనగర వాసులకు ముగ్ధులను చేసి ఆకర్షించగా వారు ఆయనను అక్కడే నిలుపుకోదలచి ముకుచిందా నదీ తీరంలో ఆయనకు కొంత భూమిని ఇచ్చి అక్కడ ఒక మఠాన్ని కట్టించారు. దుందుభినామ సంవత్సరం పుష్యశుద్ధ త్రయోదశి సోమవారం (1-1-1683) నాడు 73వ ఏట సమాధి చెందారు.

కేశవస్వామి జ్ఞానాజ్ఞానాల కతీతమైన బ్రహ్మను గుర్తించి, ప్రాపంచిక జీవితం గడుపుతూ పరమార్థిక క్షేత్రంలో గొప్ప స్థానాన్ని సంపాదించుకున్న సత్పురుషుడు. ఆయన కాలంలో (17, 18 శతాబ్దాలు) ఆంధ్ర దేశంలో ముస్లిం సుల్తానుల, నవాబుల, సేనానాయకుల ఆగడాలతో హిందూ ధర్మానికి, సంస్కృతికి విఘాతం ఏర్పడింది. బుద్ధి జీవులైన అగ్రవర్ణాల వారు స్వధర్మాన్ని, కర్మలను, వేషభాషలను విడిచిపెట్టారు. అటువంటి విరుద్ధ వాతావరణంలో మతమౌఢ్యపు ముస్లింల మధ్యనే ఉంటూ హిందూ ధర్మం, హిందూ సంస్కృతుల పరిరక్షణకు ఎంతో కృషి చేసిన సత్పురుషుడు, సాహసి - కేశవస్వామి.

ఆయన కామక్రోధాది అరిషడ్వర్గాలను జయించి భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధాలతో, దయ, ప్రేమ వంటి దైవీ గుణాలతో జనాన్ని జాగృతం చేశారు. సామాజిక, ధార్మిక రంగాల్లో ఒక చైతన్యం సృష్టించారు. స్వచ్ఛమైన ప్రేమ, వైరాగ్యాలతో విరోధులను కూడా ఆకట్టుకున్న మహానుభావుడు కేశవస్వామి హిందూ ధర్మ ప్రతిష్ఠను పెంచారు. ధర్మం పేరుతో హింస, బలులు వంటి దురాచారాలను నిర్మూలించారు. కపట సన్యాసుల బండారం బయటపెట్టి బ్రహ్మబోధనకు సాక్షాత్కారం అవసరమని, అది సంతుల ఆశ్రయంలోనే లభిస్తుందని ప్రబోధించారు. ఆత్మ సాక్షాత్కారం పొందిన మహాయోగి, అభేద భక్తికి నడయాడే రూపం అయిన కేశవస్వామి మరాఠీ, హిందీ భాషల్లో అనేక పదాలు, అభంగాలు రచించారు. వాటిలో 850 పదాలు ముద్రణకు నోచుకున్నాయి. వాటికి రాగాలు కూడా కూర్చారు. కేశవస్వామి రచించిన 2700 శ్లోకాలు, 231 పదాలు అముద్రిత రూపంలో శంకర శ్రీకృష్ణదేవ్ సమర్థ వాగ్దేవతా మందిరంలో నేటికీ దర్శనమిస్తున్నాయి.

ఆయన జనంలో భక్తివిశ్వాసాలు నెలకొల్పటానికీ, విరోధి వర్గానికి కనువిప్పు

కలిగించటానికి ఎన్నో చమత్కారాలు, అద్భుతాలు ప్రదర్శించారు.

ఐదు వందల సంవత్సరాల క్రితం ధరణీ గర్భంలో దాగిన కేశవస్వామి తమను నమ్మి కొల్చేవారికి ఈ నాటికీ అభీష్టాలు నెరవేరుస్తున్నట్లు భక్తులు చెప్పకుంటూ ఉంటారు. నేటికీ జియాగూడ, కేశవస్వామి నగర్‌లో ఉన్న సమాధి, హైదరాబాద్‌లో ఒక భక్తి కేంద్రంగా విరాజిల్లుతోంది.

శావాబేగ్ అనే ఒక ముస్లిం శిష్యుడు కేశవస్వామిని గురించి ప్రస్తుతించిన వాక్యాలు అక్షరసత్యాలు.

"కేశవస్వామీ కేవల సౌఖ్యరాశీ
మనో భావే శరణ రిఘాత్యాసీ
పదో పదీ సహజ జోడే కాశీ
మణే శాహ బేగ్ సమాధి అనాయసీ"

## ౩౦. కైవారం అమరనారేయణ (1730-1840)

తెలుగులో కాలజ్ఞానాలు చెప్పిన ప్రముఖ యోగులలో ఒకరు కైవారం అమరే నారాయణ. జీవితంలో సగభాగం గడిచి పోయిన తరువాత దివ్య జ్ఞానాన్ని సంపాదించుకుని మహాయోగియై, మహా భక్తుడు తాను తరించి, ఎందరినో తరింప జేసిన మహనీయుడు అమరే నారాయణ. మైసూరు రాష్ట్రంలో తెలుగువారు అధికంగా ఉన్న కోలారు జిల్లాలో చింతామణి తాలూకా కైవారం (ఏకచక్రపురం)లో గాజుల వ్యాపారం చేసుకునే దంపతులు కొండప్ప, ముద్దమ్మల ఏకైక సంతానంగా సాధారణ సంవత్సరం క్రీ. శ. 1730లో జన్మించిన శిశువు అమర నారాయణ, యోగి అయిన తరువాత ఆయన తనపేరు నారేయణగా మార్చుకున్నారు.

అమరనారాయణ శైశవ దశలోనే తల్లిదండ్రులతోపాటు తమ ఇలవేలుపైన అమర నారాయణ స్వామి గుడికి పోయి నిమీలిత నేత్రాలతో భగవ ధ్యానం చేసేవాడు. వీధి బడి చదువులు ముగించి స్వయంగా తెలుగు సంస్కృత భాషలు అభ్యసించటంతో పాటు భక్తి వాఙ్మయాన్ని సొంతం చేసుకున్నాడు. తండ్రితో గాజుల మలారం మోస్తూ ప్రసిద్ధ క్షేత్రాలలోని దేవీదేవతలందరినీ దర్శించాడు. యుక్త వయస్సు రాగానే నారాయణకు మునియమ్మతో వివాహమైంది. తల్లిదండ్రుల మరణానంతరం పిల్లలతో అమిత పేదరికంతో బాధపడినా భక్తి ఇంకా ఎక్కువైంది.

నారాయణ స్వామి ఏభై ఏళ్ళ వయసులో ఒకసారి చిత్తూరు జిల్లా మొగలి వెంకటగిరి కనుమలో ఒక రాత్రి విశ్రమించినప్పుడు పరదేశి స్వామి అనే మహాతపస్వి ఆయనకు మంత్ర దీక్ష ఇచ్చారు. మంత్ర గురువు ఆజ్ఞ మేరకు నోటిలో బెణసరాయి పెట్టుకుని మూడేళ్ళు కఠిన

తపస్సు చేయగా ఆరాయి చక్కెరగా మారి మంత్ర సిద్ధుడయ్యారు. అనేక అద్భుత శక్తులు ప్రదర్శించారు.

తన మహిమలతో తనకు పేదరికంలో అప్పలిచ్చిన ఋణదాతలే అప్పలు మాఫీ చేసి తిరిగి కైవారం గ్రామానికి ఆహ్వానించి ఒక ఆశ్రమాన్ని నిర్మించారు. ఇప్పడున్న మఠం స్థానంలోనే ఆశ్రమం ఉండేది. ఆనాడు స్వామి తన కుటీరం వద్ద నాటిన అశ్వత్థ మొక్క నేడు భక్తాభీష్ట ప్రదాయ కల్ప వృక్షంగా విస్తరించి పూజలందుకుంటోంది.

నారేయణ యోగీంద్రులు 110వ ఏట శార్వరినామ సంవత్సరం జ్యేష్ఠ శుద్ధ తదియ మంగళవారం రాత్రి 12 గంటలకు (2-6-1840)న సమాధి అవుతానని ప్రకటించి సరిగా అదే సమయానికి పరమపదం చెందారు. ఆయన పార్థివ శరీరాన్ని ముందుగా సిద్ధం చేసిన స్థలంలో సమాధి చేశారు. నమ్మి కొలిచే భక్తులకు ఈనాటికీ ఆ సమాధి కోరికలు తీరుస్తూ కొంగు బంగారంగా విరాజిల్లుతుంది.

సమాజాన్ని సన్మార్గంలో నడిపించి దేశానికి హితం కూర్చేందుకు సమాజంలో హెచ్చుతగ్గులు, ఆడంబరాలు, హింస, దురాచారాలు, అవినీతిని ఖండిస్తూ భక్తి, జ్ఞానవైరాగ్యాలు, సదాచార సత్ప్రవర్తనాలు ప్రభోధిస్తూ అనేక గ్రంథాలు, తత్వాలు, శతకాలు, కాలజ్ఞానాలు, కీర్తనలు రాగతాళాలు కూర్చి రచించిన మహా పండిత యోగి అమర నారేయణస్వామి.

## 31. కుర్తాళం మౌనస్వామి (1868 - 1943)

ఆంధ్రదేశంలోని బాపట్ల తాలూకా నూనెవారి పాలెం వాస్తవ్యులు అచ్యుతుని బాపనయ్య, సీతమ్మ దంపతుల మూడవ సంతానంగా 20-4-1868 న జన్మించిన శిశువుకు పిచ్చయ్య అని పేరు పెట్టారు. సమీపజ్ఞాతులు పందిళపల్లె వాసులు అయిన అచ్చుతుని లక్ష్మీ నరసయ్య, సుందరమ్మ దంపతులు బాలపిచ్చయ్యను దత్తుతీసుకుని శివయ్య అని పేరు మార్చి పెంచి పెద్ద చేసి చదువు సంధ్యలు చెప్పించారు. చిన్నతనంలోనే భక్తి, జ్ఞానాలు కలిగిన శివయ్యకు చీరాలకు చెందిన కామేశ్వరమ్మతో వివాహమై కొన్నాళ్ళు అబ్కారీ శాఖలో ఉద్యోగం చేశారు. 1894లో రాజమహేంద్రవరం తరలి పోయి ఒక ధాన్యం వ్యాపారి వద్ద గుమాస్తా ఉద్యోగంలో ఉంటూనే దేవీ ఉపాసన చేశారు. రాత్రి వేళల్లో రామాయణ, భారత పురాణ ప్రవచనాలు, హరి కథా కాలక్షేపాలు చేసేవారు. ఇలా ఉండగా ఆయన దృష్టి బాహ్య జగత్తునుండి అంతరిక జగత్తువైపు, ఆత్మాన్వేషణ దిశగా సాగింది. 1906 లో ఒకనాటి అర్ధరాత్రి గురువును అన్వేషిస్తూ ఇల్లువిడిచి వెళ్ళి పోయి అనేక దివ్య క్షేత్రాలు, యోగ భూములు దర్శించి ఒక యేడాది తిరువణ్ణామలై రమణ మహర్షి ఆశ్రమంలో ఉనారు. ఉత్తర దేశయాత్రలో అచ్చుతానంద సరస్వతీ స్వామి వద్ద సన్యాసం స్వీకరించి శివచిదానంద సరస్వతి అనే దీక్షా నామం స్వీకరించారు. గురువు ఆజ్ఞతో యోగ సాధన చేస్తూ దేశమంతటా తిరిగారు. 1908 లో నైమిశారణ్యంలో తిరుగుతూ ఒక పర్వత గుహలో కొన్ని వందల ఏళ్ళుగా తపస్సు చేస్తున్న

వెంకటాచలం పంతులును సేవించి అనేక యోగ శక్తులను సాధించారు. దత్తాత్రేయుని అపరావతారమైన శ్రీవాసుదేవానంద సరస్వతి (టెంచె స్వామి) శుశ్రూష చేసి సమస్త శాస్త్రాలు, యోగంలలోని నిపుణులయ్యారు. యోగంతోసిద్ధ పురుషులై ఒక కారణంతో మౌన వ్రతానికి పూనుకుని మౌన స్వామిగా మారారు. కొంతకాలం పంచవటి వద్ద గుహలో యోగ నిష్ఠలో ఉన్నారు. అనంతరం మూకాంబికా క్షేత్రం చేరారు. అక్కడి నుండి మంగుళూరుకు బయలు దేరి చిత్రకూట పర్వత ప్రాంతంలో సమాధి స్థితులై అద్భుతాలు ప్రదర్శించారు. చివరి కుర్తాళం చేరి అక్కడ స్థిరపడ్డారు. ఎన్నో మహిమలు ప్రదర్శించారు. తమతరువాత మఠ మందిరాలకు ట్రస్ట్ ఏర్పాటు చేసి 28-12-1943న దేహం చాలించారు. దండాయుధ పాణి మందిరంలో స్వామిని సమాధి చేశారు. 13-7-1951న ఆ సమాధిపై లింగ ప్రతిష్ఠ జరిగింది. ఆయన ఆనాడు దత్తాత్రేయ మందిరంలో స్థాపించిన సిద్ధేశ్వరీ పీఠం ఈనాటి పీఠాధిపతి శ్రీ శివ చిదానంద భారతీ స్వామి ఆధ్వర్యంలో భారత దేశంలో ప్రశస్తి పొందిన అద్వైత పీఠంగా విరాజిల్లుతోంది.

## 32. కురుమద్దాలి పిచ్చమ్మ అవధూత (1870 - 1951)

గత జన్మలో కొన్ని యోగ భూమికలు అధిరోహించి మరుజన్మలో మిగిలిన యోగ భూమికలలనధిరోహించి శాశ్వతానందాన్ని అనుభవించి జీవన్ముక్తులైన వారిలో మాలపిచ్చమ్మ ఒకరు. కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా కురుమద్దాలి గ్రామంలో వట్టె ముత్తయ్య వీరమ్మ అనే ఉత్తమ సంస్కార వంతులైన మాల దంపతుల ఆఖరిబిడ్డగా 1870లో పిచ్చమ్మ జన్మించింది. చిన్నతనం నుంచి జ్ఞాన వైరాగ్యాలతో ప్రవర్తించటం చేత ఆమెను పిచ్చి పిచ్చమ్మ అనేవారు. రామాలయంలో శ్రీరామ చంద్రుని చూస్తూ మైమరచినప్పుడు పిచ్చమ్మకు తనలోనుండి తన వంటి ఒక రూపం బయటికి వచ్చి గజ్జెల గలగలలతో తిరుగుతూ మాట్లాడేది. వివాహం చేస్తే పిచ్చి కుదురుతుందని ఆమె తల్లిదండ్రులు పెళ్ళి చేశారు. కొన్నాళ్ళకు పిచ్చమ్మ గర్భవతి కాగా భర్త నాలుగో నెలలో చనిపోయాడు. 10వ నెలలో పిచ్చమ్మ ఆడ శిశువును ప్రసవించి భాగ్యమ్మ అని పేరు పెట్టింది. పిచ్చమ్మ కూలి నాలి చేసి నీతి నిజాయితీలతో కష్టించి పని చేసి సంపాదించిన కూలి డబ్బుతో భాగ్యమ్మను ముద్దు ముచ్చట్లతో పెంచుతూ, మిగిలిన డబ్బును ధర్మకార్యాలకు వినియోగించేది. భాగ్యమ్మకు యుక్త వయస్సులో వివాహం చేసింది. అయితే కొద్ది రోజులకే ఆమె భర్త కూడా చనిపోయాడు. మారు మనువు చేసినా భర్త ఆదరణలేక భాగ్యమ్మ బావిలో పడి చనిపోవడంతో పిచ్చమ్మ గత జన్మలో కొరవడిన యోగాన్ని గురువు సహాయం లేకుండా సాధన చేసింది. తన సంపాదనను దాన ధర్మాలు చేసి మొలకు గోనె పట్టా చుట్టుకుని శ్మశానంలో నిరంతరం రామనామం, హనుమన్నామం, భగవద్ధ్యానాలతో గడిపేది. అలా ఉండగా ఒక గోసాయి వచ్చి ఆమెకు ఉపదేశించాడు. ఆమేరకు ఆమెతోటి మానవుల దుఃఖనివారణ కోసం తపన చెందగా ఆ తపనలోనే ఆమెకు జ్ఞాన సిద్ధి గలిగింది.

ఆమె ఏకాంతంగా ఉన్నప్పుడు కాలసర్పాలు వచ్చి పడగలు విప్పి ఆడేవి. ఈ దృశ్యం చూసిన వారు ఆమెను మహాత్మురాలు గా గుర్తించారు. ఎన్నో అద్భుతాలు మహిమలు ప్రదర్శిస్తూ సదా రామ నామం చేసే పిచ్చమ్మ రామావధూత పిచ్చమ్మగా ప్రసిద్ధి కెక్కింది. ఆమెకు కొందరు భక్తులు 1925లో ఆశ్రమం నిర్మించారు. ఆమె తపస్సుకు అనుకూలంగా సమాధి ప్రవేశానికి వీలుగా భూగర్భ భువనేశ్వరం ఏర్పాటు చేశారు. ఆమె వారానికి మూడు రోజులకో సారి సమాధిలోకి వెళ్లేది. 1951 జనవరి 15 ఖర నామ సంవత్సర పుష్య శుద్ధ అష్టమి సోమవారం నాడు ఆమె రామనామం చేస్తూ రాత్రి ఒంటి గంటకు భ్రూమధ్యం నుండి గొప్ప ప్రకాశం వెలువడి ఆశ్రమమంతా నిండిపోయింది. ఆమె పునరావృత్తి స్థితి నందుకుని దేహత్యాగం చేశారు. ముందుగానే కురుమద్దాలిలో సిద్ధం చేసిన సమాధిలో ఆమె శరీరాన్ని శాస్త్రోక్తంగా నిక్షేపించారు. అమ్మ పేరుతో ఖమ్మం జిల్లాలో బూర్గం పహాడ్‌లో కూడా 1984లో ఒక ఆశ్రమం ఏర్పడింది. అక్కడ ఆధ్యాత్మిక సాంస్కృతిక కార్యక్రమాలు వైభవంగా జరుగుతున్నాయి.

## 33. కావ్యకంఠ వాసిష్ఠ గణపతి ముని (నాయన) (1878 - 1936)

భారతదేశ దాస్యముక్తికి విద్యా, సామాజిక, రాజకీయ రంగాల ద్వారా కృషిచేసి ఆధ్యాత్మిక రంగంలో సిద్ధ పురుషుడైన మహాయోగి కావ్య కంఠ వసిష్ఠ గణపతిముని. ఆయన ధార్మిక రంగంలో వేదకాలపు ఋషులకు దీటుగా, కవిత్వ పాండిత్యాల్లో సమకాలీనులలో మేటిగా రాణించారు. ఆయన తండ్రి నరసింహశాస్త్రి కాశీలోని ఢుంఠి గణపతిని ఉపాసించగా ఒక మధ్యాహ్నం గణపతి విగ్రహం నుండి ఒక శిశువు తనకు ఎదురుగా వచ్చినట్లు కనపడింది. అదేరోజు 17-11-1878 బహుధాన్య సంవత్సర కార్తీక బహుళ అష్టమీ ఆదివారం మఖ నక్షత్ర ప్రథమ పాదంలో ఆయన భార్య నరసమ్మ ప్రసవించిన శిశువే వాసిష్ఠ గణపతి ముని. తల్లి దండ్రులు ఆయనకు నామకరణం నాడు పెట్టిన పేరు సూర్య గణపతిశాస్త్రి. 10ఏళ్ల వయసు వరకు కావ్యపాఠాలు నేర్చి పంచాంగ గణనంలో పాండిత్యం సంపాదించారు. 12వ యేట విశాలక్షమ్మతో వివాహమైన తరువాత రెండు సర్గల 'భృంగ దూత' కావ్యం రచించారు. 18 ఏళ్లు వచ్చేసరికి గణపతి శాస్త్రి వ్యాకరణ, అలంకార, సాహిత్య శాస్త్రాలు, పురాణ ఇతిహాసాలు ఆపోశన పట్టారు. 13వ ఏట నుండే తండ్రి వద్ద పంచాక్షరి, మేధాదక్షిణామూర్తి, నారాయణాష్టాక్షరి, సౌరాష్టాష్టాక్షరి, చండీ నవాక్షరి, మాతంగి, బాల, వారాహి, భువనేశ్వరి, మహాగణపతి, పంచదశి, షోడశి అనే 12 మహామంత్రాలు సాధన చేయడంతో ఆయనలో తపస్సు చేయాలనే కాంక్ష ప్రబలింది. భార్యకు కూడా మహాగణపతి మంత్రం, శ్రీవిద్య దీక్ష ఇచ్చారు. ఆయన ప్రయాగ హంస తీర్థంలో కొంతకాలం, నాసిక్‌లోని నీలాంబికాలయంలో, భువనేశ్వర్‌లో కొంతకాలం తపస్సు చేశారు. తర్క వేదాంతాలు, వ్యాకరణ మహాభాష్యం నీతి శాస్త్రంలలో నిష్ణాతుడయ్యారు. గణపతి శాస్త్రి వైద్యనాథ క్షేత్రంలో కొంతకాలం తపస్సు చేసి సురేశ మిశ్రుని వద్ద 'తారా' మంత్రోపదేశం పొంది మంత్ర సిద్ధుడయ్యారు. అరుణాచలంలో

5 కోట్ల శివ పంచాక్షరి పూర్తి చేసి అరుణాచలేశ్వరుని అనుగ్రహం పొందారు. 1902లో వెయ్యి శ్లోకాల 'హరస్తుతి' కావ్యం రచిస్తూ నందీశ్వరుని ముందు నిలిచి శివునికి వినిపించేవారు. ఒక సంవత్సరం వేదాధ్యయనం చేసి సాయకాభాష్యం పఠించారు. కొంతకాలం వేలూరు క్రైస్తవ కళాశాలలో తెలుగు పండితుడుగా పనిచేశారు. ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. 1922లో అరుణాచలం చేరి 'ఉమాసహస్రం' సంస్కరించి 'ఇంద్రాణీసప్తశతి' రచనకు సంకల్పించారు. అనేక సూత్ర గ్రంథాలు, మీమాంస గ్రంథాలు, దేశ భక్తిని ప్రబోధించే ' రాష్ట్ర నిబంధన', సంస్కృతం ప్రపంచ భాష కావాలంటూ 'లాలి భాషోపదేశః' అనే గ్రంథాలను రచించారు. 1926లో 'పూర్ణ' అనే సంస్కృత నవల, ఇంకా 75 గ్రంథాలు వివిధ అంశాలపై రాశారు. 1929లో తిరువణ్ణామలై నుండి గోకర్ణ వెళ్ళి కలువ ఆశ్రమంలో కొంతకాలం ఉన్నారు. అనేక అద్భుతాలు ప్రదర్శించారు. ఖరగ్‌పూర్ కలకత్తాలలో కొంతకాలం ఉన్నారు. ఖర్గపురం ఆశ్రమంలో ఆయన కాల సంఖ్యలో భక్తులు, శిష్యులు ఉన్నారు. నాలుగు దినాలు ముందే తన దేహత్యాగం గురించి చెప్పిన గణపతి ముని ధాతృసంవత్సరం శ్రావణ శుద్ధ సప్తమి శనివారం 25-7-1936 మధ్యాహ్నం దేహత్యాగం చేశారు. భారతీయ వేదశాస్త్ర కావ్య ఇతిహాస పురాణాలను గణపతి ముని మాదిరిగా సమన్వయించిన వారు మరొకరు లేరు.

## 34. కదిరి మంగళం మునీంద్ర స్వామి (1876 - 1961)

పర్వత గుహల్లో తపస్సు చేసి సిద్ధులైన మహా యోగులలో ఒకరైన కదిరి మంగళం మునీంద్ర స్వామి తిరుమలకు సమీపంలోని స్వర్ణముఖీ నది ఒడ్డున గల యెలమండ్యం గ్రామంలో గాలిమాసి లక్ష్మణ రెడ్డి, అంజేరమ్మ అనే పాకనాటి రెడ్డి దంపతుల స్వప్న ఫలంగా జన్మించారు. ఆ బిడ్డకు మునిస్వామి రెడ్డి అని పేరు పెటట్టారు. ఆయనే అనంతరకాలంలో మునీంద్ర స్వామిగా ప్రసిద్ధికెక్కారు. చీరాల సుబ్బయ్య అనే భాగవతుడు ముని స్వామికి ఐదవ ఏట అక్షరాభ్యాసం చేయించి ఉపదేశించిన తారక మంత్రాన్ని శ్రద్ధగా ఉపాసించాడు. ఆయన హృదయంలో రాముని నింపుకొని వ్యవసాయ పనులు చేస్తుండగా ఒక రోజున సృష్టిరహస్యం గురించి ఆలోచించి ఆ రహస్యాన్ని ఛేదించాలని చింతించటంతో అతని ప్రవర్తనలో మార్పు వచ్చింది. ఏకాంతంలో ఉండేవారు. 18 ఏళ్ళు నిండిన మునిస్వామికి వివాహం చేసే దారిలో పడతాడని తల్లి దండ్రులు అతనికి చెంగమ్మతో వివాహం జరిపించారు. అయితే వారి దాంపత్యం జీవాత్మ పరమాత్మల పవిత్ర బంధంగా సాగింది.

ఇలా ఉండగా రక్తాక్షి పుష్యశుద్ధ ఏకాదశి సోమవారం 5-1-1925న మునిస్వామి వ్రత దీక్షితుడై తదేకంగా రామతారకం జపిస్తుండగా శుద్ధ నిర్వికల్ప సమాధి కలిగింది. ఆత్మ దర్శనం తరువాత మునిస్వామికి సమస్త ప్రపంచం పరమాత్మ స్వరూపంగా గోచరించింది. నిద్రాహారాలు మాని 8 నెలలు బ్రహ్మానంద మగ్నుడై తిరిగాడు. ఒక శ్రావణ పూర్ణిమనాడు వేదవేదాంగవేత, జ్ఞాని అయిన నారాయణాచార్యులు మునిస్వామికి శ్రీమదష్టాక్షరీ మంత్రం

ఉపదేశించి భ్రూమధ్యంలోకి చూడగా బాహ్యదృష్టిపోయి ఆత్మ సాక్షాత్కారం లభించింది. అనంతరం నారాయణాచార్యులు మునిస్వామి రెడ్డికి మునీంద్రస్వామి అనే దీక్షానామం ఇచ్చి అనేక వేదాంత రహస్యాలు బోధించారు. అప్పటి నుండి నిత్యం ఏకాంతంగా తపస్సు చేసుకుంటూ ఆత్మ శక్తితో సమస్త విషయాలు తెలుసుకునే మానవాతీత శక్తులు లభించాయి. అనేక మహిమలు, అద్భుతాలు చేస్తూ ఎందరో శిష్యులను, భక్తులను పొందారు. అనేక మంది నాస్తికులను ఆస్తికులుగా మార్చారు. అనుష్ఠాన వేదాంతి అయిన మునీంద్ర స్వామి 'బ్రహ్మజ్ఞానామృత సంగ్రహం' అనే గ్రంథాన్ని రచించారు. అది జిజ్ఞాసువుల పాలిటి కల్పవృక్షం. ఆయన సిద్ధ సంకల్పులు. పుత్తూరు తాలూకా కదిరి మంగళంలో ఆశ్రమాన్ని నిర్మించి, సమాధి కూడా ముందుగానే కట్టించుకున్నారు. నిర్యాణ సమయానికి వారం రోజుల ముందే శిష్యులకు తెలిపి సమాధి స్థితులయ్యారు. 18-5-1961న ప్లవనామ సంవత్సర జేష్టశుద్ధ పంచమి నాడు కళ్ళుతెరిచి భక్తులను, శిష్యులను ఆశీర్వదించి జీవసమాధి అయ్యారు. ఈనాటికి ఆయన సమాధి భక్తులను సర్వాభీష్టాలు నెరవేరుస్తూ నిత్యపూజలు అందుకుంటోంది. పూర్ణిమనాడు గురు పూజలు, వార్షికోత్సవాలు వైభవంగా జరుగుతున్నాయి. ప్రస్తుతం బ్రహ్మానంద భారతీస్వామి గురువు ఆజ్ఞ మేరకు మునీంద్ర స్వామి శిష్యుడుగా బ్రహ్మవిద్యా ప్రచారాన్ని నిర్విరామంగా సాగిస్తున్నారు.

## 35. కపిలగిరి యోగానంద నరసింహ మహర్షి (1886-1960)

కారణ జన్ముల కోవకు చెందిన యోగానంద మహర్షి 1886లో ఒంగోలు జిల్లా మర్కాపురం తాలూకా తోకపల్లి గ్రామంలో జన్మించారు. ఆయనకు తల్లిదండ్రులు చేసిన నామకరణం సుబ్బారాయుడు. ఆయన వీధి బడిలోకన్న ప్రకృతి పాఠశాలలోనే ఎక్కువ విషయాలు నేర్చుకున్నారు.

బాల్యం నుండి నాట్యం, నాటకాలు అంటే ఎక్కువ ఇష్టపడే సుబ్బారాయుడు ఇల్లు విడిచి ఒక నాటక సమాజంలో చేరి నటుడయ్యాడు. అతని ఆసక్తిని గమనించిన ఒక శ్రీవైష్ణవ పండితుడు చేరదీసి పురాణాలసారం, వేదాంతం బాగా ఒంటబట్టించి మంత్రాలు ఉపదేశించారు. సుబ్బారాయుడు ఆ మంత్రాలను నిష్ఠతో రేయింబవళ్ళు జపించి అడవులలోకి వెళ్ళిపోయాడు. అడవుల్లో ఒక పాశ్చాత్య సర్వేయరు సుబ్బారాయుడిని తనతో తీసుకువెళ్ళి తన శాఖలో ఉద్యోగం ఇచ్చి తీరికవేళల్లో అతని భక్తి గేయాలు వింటూ భక్తుడయ్యాడు. సుబారాయుడు చెప్పినది చెప్పినట్లు జరిగేది. ఇలాఉండగా ఉద్యోగరీత్యా తిరువళ్లూరు (వీరరాఘవ క్షేత్రం)కు బదిలీ అయింది. అక్కడ నిద్రాహారాలు మాని నామ జప యజ్ఞం చేసేవాడు. అది గమనించిన తెల్లదొర సుబ్బారాయుణ్ణి చెన్నపట్నానికి మార్చాడు. అక్కడ ఒకనాడు సుబ్బారాయునికి ఒక అవధూత దర్శనమైంది. ఆయన పాదాలవద్ద మూడు అహోరాత్రులు వుండగా నాలుగో రోజున అవధూత దీవించడంతో సుబ్బారాయుని ముఖం

సూర్యతేజస్సుతో వెలిగిపోయింది. సమస్త మంత్రాలు, యోగమర్మాలు, సిద్ధులు లభించాయి. అదిగంబరాచల యోగి తన శక్తున్నిటినీ సుబ్బారాయుడికి ధారపోసి అదృశ్యం కాగా సుబ్బారాయుడు శ్రీ యోగానంద మహర్షి అయ్యాడు.

ఎన్నో లీలలు, అద్భుతాలు ప్రదర్శించి కపిలగిరిపై తపస్సు చేయగా శ్రీలక్ష్మీనరసింహస్వామి ప్రత్యక్షమయ్యాడు. ఫలితంగా యోగానందుడు శ్రీలక్ష్మీ నరసింహాలయం కట్టించి స్వామిని ప్రతిష్ఠించి నిత్యారాధనలు ఏటేటా నరసింహస్వామి జయంతి ఉత్సవాలు జరిపేవారు. తమ అవతారం చాలించే సమయం రాగానే శిష్యులను పిలిపించి తనను జీవసమాధి చేయవలసిందిగా ఆదేశించారు. నారాయణదాసు అనే భక్తుని తన పీఠానికి వారసుడుగా అభిషేకించారు. శార్వరి పుష్య శుద్ధ త్రయోదశి శుక్రవారం (30-12-1960) పగల సమాధిస్థితులై బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకుని విశ్వాత్మలో కలిసిపోయారు. నారాయణదాసు గురువు గారి పార్థివ శరీరాన్ని కపిలగిరి మెట్ల పక్కన ఈశాన్యంలో సమాధి చేశారు. ఆనాటి నుండి ఏటేటా గురుసమారాధనలు వైభవోపేతంగా జరుగుతున్నాయి.

## 36. కొత్తరెడ్డిపాలెం లక్ష్మీకాంతానంద యోగి (1888-1970)

రచయిత, గాయకుడు, సంస్కృతాంధ్ర హిందీ భాషలలో నిష్ణాతుడు, నటుడు, కళారాధకుడు, వైద్యుడు, మహాయోగి అయిన కొత్తరెడ్డిపాలెం లక్ష్మీకాంతానంద యోగి గుంటూరు జిల్లా కొత్తరెడ్డిపాలెంలో ఆ గ్రామకరణం చెన్నంరాజు, కామేశ్వరమ్మ నియోగి దంపతులకు సర్వజిత్ సంవత్సర పుష్య బహుళ త్రయోదశి బుధవారం (11-1-1888) రోజున మూలనక్షత్రంలో జన్మించారు. గుంటూరు క్రైస్తవ కళాశాలలో మెట్రిక్యులేషన్ పాసయ్యారు. 18వ యేట చెన్నపట్నం ఇంజనీరింగ్ కళాశాలలో డ్రాఫ్ట్మేన్ పరీక్షలో ఉత్తీర్ణుడై కృష్ణా గుంటూరు రిజర్వాయర్ ప్రాజెక్టులో ప్రభుత్వోద్యోగం చేశారు. అదే సమయంలో తండ్రి గతించటంతో ప్రతిఏటా వంశాచారంగా జరుపుతున్న సీతారామ కళ్యాణం బాధ్యత ఆయనపై పడింది. అందుకు అధికారులు సెలవు ఇవ్వటానికి నిరాకరించటంతో ఆ ఉద్యోగానికి స్వస్తి పలికారు. అనంతరం అనసూయమ్మతో వివాహమైంది. గ్రామ కరణీకం, సేద్యం, సీతారాముల కొలువులో ఆయన జీవితం గడుపుతూ నాటకాలలో శ్రీకృష్ణ, హరిశ్చంద్ర, నల, బాహుక, సారంగధర, నరకాసుర, భీష్మ పాత్రలు పోషించారు. సంస్కృత, ఆంధ్ర హిందీ భాషలో రచనలు, వీణావాదనం, సుశ్రావ్యంగా పాడటం, హరికథాగానం, పురాణ ప్రవచనాలు ఆయన వ్యాపకాలయ్యాయి. ఏకాంతంలో ప్రాణాయామ సాధన చేసేవారు. ఆయుర్వేద గ్రంథాలు చదివి సొంతంగా మందులు తయారు చేసి పేదలకు ఉచితంగా వైద్య సేవలు అందించేవారు. లక్ష్మీకాంతానందుల గుణశీలాలు, ప్రతిభాపాటవాలు, ఆధ్యాత్మిక చింతన గుర్తించిన చంద్రశేఖరానంద సరస్వతీస్వామి తమ ఆశ్రమ స్థలాన్ని, తోటను ఆయనకు విడిచిపెట్టి కాశీకి

వెళ్ళిపోగా లక్ష్మీకాంతు, ఆయన చిన్న తమ్ముడు సుబ్బారావుతో కలిసి ఆధ్యాత్మిక సాధనలు ప్రారంభించారు. హఠాత్తుగా వారంరోజుల్లో తమ్ముడు మరణించడంతో మనస్సు వికలమై ఆనందాశ్రమం పేరిట మూడు కుటీరాలను ఆ స్థలంలో నిర్మించి ఉత్తర భారత యాత్రలకు బయలు దేరారు. కాశీలో బ్రహ్మానంద సరస్వతీస్వామి, హృషీకేశంలో ఆనందయోగిని సేవించి యోగ రహస్యాలు తెలుసుకున్నారు. కాశ్మీర మాధవానందులతో కలిసి హిమాలయాల్లో తిరిగారు. ఇంటికి వచ్చి ఆనందాశ్రమంలో శివలింగం ప్రతిష్ఠించి ఆ ప్రాంతాన్ని ఒక ఋషివాటికగా చేశారు. ఆనందాశ్రమంలో ఒక కుటీరం భూ గృహంలో రోజుకు మూడు నాలుగుసార్లు పట్టుకు నాలుగేసి గంటలసేపు యోగసాధన చేసేవారు. వివిధ యోగాలు ఆయనకు కరతలామలకమయ్యాయి. అనేక మహిమలు, అద్భుతాలు ప్రదర్శిస్తూ సమాజ సేవా కార్యక్రమాలు, సంస్కరణలు చేపట్టారు. సుమారు 25 గ్రంథాలు రచించారు సాధారణ సంవత్సర కార్తీక బహుళ అష్టమి శనివారం (21-11-1970) రోజున లక్ష్మీకాంతానందస్వామి తమ ఆరాధ్య దేవత శ్రీ గాయత్రీ మాతను హృదయంలో నిలుపుకొని బ్రహ్మైక్యం చెందారు.

## 37. గుడివాడ ప్రణవానంద స్వామి (1888-1969)

కేరళ రాష్ట్రంలో జన్మించి ఆంధ్రరాష్ట్రంలోని గుడివాడలో స్థిరపడి యావద్భారత దేశానికి జ్ఞాన భిక్ష పెట్టిన మహాపురుషుడు ప్రణవానందస్వామి. ఆయన కేరళ దేశంలో పాల్ఘాట్ వద్ద అల్తూరు అనే చిన్నగ్రామంలో 15-5-1888 సర్వధారినామ సంవత్సర వైశాఖ శుద్ధ చవితి మంగళవారం నాడు జన్మించారు. పసితనంలోనే తల్లిదండ్రులను కోల్పోయిన ప్రణవానందుడు గురుకులంలో విద్యాభ్యాసం చేసి ఆధ్యాత్మికంగా వైరాగ్య సంపన్నులయ్యారు. సంస్కృతం, మళయాళం, తమిళం, కన్నడ భాషలు నేర్చి, శ్రీకృష్ణానంద అవధూత శిష్యులై బ్రహ్మ విద్యను సముపార్జించుకున్నారు. విద్యార్థి దశలోనే ప్రణవానందుడు బ్రహ్మచర్యం పాటించి తత్త్వాన్వేషణ చేసి సన్యసించాలని నిశ్చయించుకున్నారు. పాదచారియై దేశ సంచారం చేస్తూ 1917లో ఆంధ్రదేశంలో గుడివాడకు వచ్చి తాతిరెడ్డి తోటను తపోభూమిగా ఎంచుకుని స్థిరపడ్డారు. ఆయన కఠోర తపోదీక్ష, నిష్కళంక నిరాడంబర జీవితం, సులభతరమైన బోధనా విధానం, పండితులను, పామరులను ఆకట్టుకోవడంతో దేశంలోని వివిధ రాష్ట్రాలలో ఎందరో ఆయనకు భక్తులయ్యారు. మీర్జాపురం రాజా దంపతులు ఆయన భక్తులై 1936లో ప్రణవాశ్రమం నిర్మించి శంకర ప్రతిష్ఠ చేసి నిత్యారాధనలు ప్రారంభించారు. గుడివాడ ప్రముఖులు, పరిసర గ్రామాల జిజ్ఞాసువులు. 'సనాతన హిందూ ధర్మ ప్రబోధ సంఘం' పేరిట ఒక సంస్థను నెలకొల్పి ఆ సంస్థ తరపున అనేకచోట్ల స్వామివారి ఆధ్యాత్మికోపన్యాసాలు ఏర్పాటు చేయసాగారు. ఆయన ఎవరినీ శిష్యులుగా చేర్చుకోలేదు. ఆయన అనేక జీర్ణ దేవాలయాలను ఉద్ధరించారు. విశ్వహిందూ పరిషత్తు రాష్ట్రీయ స్వయం సేవక సంఘం కార్యకలాపాలలో శ్రద్ధ చూపేవారు. గాంధీ స్మారక నిధికి విరాళాలు సేకరించి ఇచ్చారు. హృషీకేశం శివానందుల దివ్య జీవన

సంఘానికి ఆయన గుడివాడలో 1930లో ఒక శాఖను ప్రారంభించారు. కవి పండితులను, గాయకులను, నర్తకులను, హరిదాసులను, భాగవతులను ఆదరించి సన్మానించేవారు. ప్రణవాశ్రమంలో ప్రతిఏటా సప్తాహ దీక్షలతోపాటు గణపతి నవరాత్రులు, దేవీ నవరాత్రులు, కృష్ణాష్టమి, గీతాజయంతి, శంకర జయంతి, త్యాగరాజస్వామి జయంతి, విద్యారణ్య జయంతి, రామానుజ జయంతి, మధ్వాచార్య జయంతి, రమణ మహర్షి జయంతి వంటి పండుగలను ఎంతో వైభవంగా జరిపేవారు. ఆయన పేరిట దేశమంతటా అనేక ఆశ్రమాలు వెలిశాయి. ప్రణవానందులు 80 ఏళ్ల వయస్సులో కూడా నిరంతరం శ్రమించటం చేత 1967 నుండి అనారోగ్యానికి గురయ్యారు. 1969 మే 15న సాయంకాలం 3 గంటలప్పుడు బ్రహ్మైక్యం చెందారు. ఆశ్రమం ప్రక్కనే భక్తులు ఆయనను సమాధి చేశారు.

## 38. గొలగమూడి వెంకయ్య స్వామి (1887-1982)

ఆధ్యాత్మిక ప్రపంచానికి చక్రవర్తులైన అవధూతలలో ఒకరు గొలగమూడి వెంకయ్యస్వామి. 1887 ప్రాంతంలో నెల్లూరు జిల్లా చేజెర్ల మండలం ఆత్మకూరు తాలూకా నాగుల వెల్లటూరు గ్రామంలో కమ్మకులానికి చెందిన సోంపల్లి పిచ్చమ్మ- పెంచలయ్య నాయుడు దంపతుల జ్యేష్ఠ పుత్రుడుగా జన్మించారు. బాల్యం నుంచే గ్రామ సమీపంలోని అడవులలో తిరుగుతూ ఏకాంతంగా గడిపేవారు. ఆయన బాల్యంలో ఒక సాధువు (షిర్డీ సాయిబాబా అని కొందరి భావన) వచ్చి ఆయన నాలుకపై బీజాక్షరాలు వ్రాసినట్లు చెప్పకుంటారు. అప్పటినుండి ఆయనను ప్రజలు అవధూత వెంకయ్యస్వామిగా గుర్తించసాగారు. స్వామి అనేక గ్రామాలు తిరుగుతూ ఆశ్రమాలు ఏర్పరుస్తూ వెళ్లిన ప్రతిచోటా ధుని వెలిగించటం, తనను దర్శించేవారికి జీవిత సత్యాలను బోధించటం చేస్తూ ఉండేవారు. బొటన వ్రేలు సిరాలో అద్ది తెల్ల కాగితాలపై ముద్రలు వేసి ఆశీర్వాదంగా ప్రసాదించేవారు. చెడు లక్షణాలు గలవారిని కులహీనులుగాను, సద్గుణాలు గలవారిని బ్రాహ్మణులుగాను సంబోధించేవారు. ఆయన చేతి స్పర్శతో అన్నం ఔషధంగా మారి స్వస్థత చేకూర్చేది. ఆయన అతిపేద జీవితం గడుపుతూ ఆశ్రితులకు సిరులు ఇచ్చేవారు. అన్ని జీవులలోను వెంకయ్య ఉన్నాడు. 'సూర్యచంద్రులున్నంత వరకు తామెక్కడికీ పోమని హామీ ఇచ్చిన భగవత్ స్వరూపుడు వెంకయ్యస్వామి. స్వామి శరీరంతో ఉన్నప్పటి నుండి సమాధి చెందేవరకు, చెందిన తరువాత ప్రదర్శించిన ఈనాటికీ ప్రదర్శిస్తున్న మహిమలు అనేకం ఉన్నాయి. తల్లిగా, తండ్రిగా, గురువుగా, మార్గ నిర్దేశకుడుగా స్వామి విశ్వరూపం భక్తుల అనుభవానందంలో కనిపిస్తుంది. ఆగస్టు 24, 1982లో స్వామి తన భౌతిక దేహం చాలించి సమాధి చెందారు. అంతకు ముందు రోజంతా స్వామి 'సంపన్నత్వం', సాధారణత్వం 'సద్గురుసేవ' అని కేకలు వేయడం ప్రజలు ఉపదేశంగా భావించారు.

## 39. లింగనవాయి నిత్యానందస్వామి (1905-1959)

రామానుజ మతానుచరులైన కమ్మరైతు దంపతులు అప్పాస్వామినాయుడు, రుక్మిణీ అమ్మాళ్ దంపతులకు తిరునల్వేలి జిల్లా కోయిల్ పట్టి (శంకర కోయిల్)లో ద్వితీయ సంతానంగా జన్మించిన రంగనాథ స్వామియే అనంతరకాలంలో నిత్యానంద స్వామి అయ్యారు. విశ్వావసు సంవత్సరం కార్తీక శుద్ధ పంచమి గురువారం ఉత్తర ఫల్గుణ నక్షత్రం (2-11-1905)న జన్మించిన రంగనాథ స్వామి ఊరిబడిలోనే 12 ఏళ్ళ వయసు దాకా 8వ తరగతి వరకు విద్యనభ్యసించారు. తల్లి పూజా సమయంలో చేసే ప్రాణాయామాన్ని శ్రద్ధగా గమనించిన రంగనాథస్వామికి ప్రాణాయామం సాధించాలనే అభిలాష పట్టుదల ఎక్కువయ్యాయి. ఒకరాత్రి స్వప్నంలో ఒక మహా పురుషుడు దర్శనమిచ్చి రంగనాథుని తలపై చేయి ఉంచి ప్రాణాయామం చేసే విధానం నేర్పి అదృశ్యమయ్యాడు. అనంతరం ఎక్కడున్నా ఉదయాస్తమయాలలో ప్రాణాయామం సాధించేవాడు. విమలానందుని పరీక్షలో నెగ్గి ఆయనకు శిష్యుడై 15వ ఏట తల్లి అనుమతితో సన్యసించాడు. అరుణాచలం రమణ మహర్షి ఆశ్రమంలో కొంతకాలంలో సాధన చేశారు. మద్దికెర ఆశ్రమంలో గురువు విమలానంద స్వామి వద్ద శుశ్రూష చేస్తూ గీతా రహస్యాలు, యోగ రహస్యాలు గ్రహించారు. ఏకాంత శిష్యుడై 16 ఏళ్ళపాటు రంగనాథుడు 'చిన్నస్వామి'గా అనేక గురు పరీక్షలకు తట్టుకుంటూనే విరాక్కృత కృత్యుడయ్యారు. గురువు విడిచిన ధనుశ్శాల ఆశ్రమం తన ఏకాంత దీక్షాశ్రమంగా నిర్ణయించుకున్న చిన్నస్వామి అక్కడ కఠిన తపస్సు చేశారు. తరువాత కొందరు ఆయనను వనముల పాదలో ఆశ్రమం నిర్మించి అందులోకి చేర్చారు. అక్కడ ఆయనకు ఎందరో శిష్యులుగా చేరారు. 1946లో విమలానందుని నుండి చిన్నస్వామి బొల్లవరంలో సన్యాస దీక్షతోపాటు 'నిత్యానందుడు' అనే దీక్షానామం స్వీకరించారు. ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. వికారి సంవత్సర కార్తీక శుద్ధ విదియ 2-11-1959 సోమవారంనాడు శవాసనం వేసి ప్రాణాన్ని సహస్రారానికి ఎక్కించి తనను త్వరగా సమాధి చేయమని శిష్యుడు శివయ్యకు చెప్పారు. వైద్య సేవలు నిష్ఫలమయ్యాయి. 30-1-59 అమావాస్యనాడు శిష్యులు, సోదరులు లింగనవాయికి బండిలో తరలించి జీవసమాధి చేశారు. పలుచోట్ల ఈనాటికీ ఆయన ఆరాధనోత్సవాలను శిష్యులు కార్తీక బహుళ అమావాస్యనాడు భక్తి శ్రద్ధలతో వైభవంగా జరుపుకుంటున్నారు.

## 40. మంత్రాలయం రాఘవేంద్ర స్వామి (1596 - 1671)

ప్రహ్లాద, వ్యాసరాయల, ఆనందతీర్థుల అవతారంగా భక్తులు భావించి కొలిచే మంత్రాలయం రాఘవేంద్ర స్వామికి నామకరణ సమయంలో తల్లి దండ్రులు పెట్టిన పేరు వెంకట నాథుడు. తళ్ళికోట యుద్ధానంతరం ధర్మ రక్షణ కరువైన విజయనగరం విడిచి చోళరాజ్యం కంచీపురం

లోని పట్టణ అగ్రహారం చేరుకున్న తిమ్మణాచార్యులు గోపమ్మ దంపతుల మూడవ సంతానంగా శాలివాహన శకం 1518 లో ఫాల్గుణశుద్ధ సప్తమీ గురువారంనాడు జన్మించిన శిశువే వెంకట నాధుడు. విజయనగర ప్రభువు శ్రీ కృష్ణ దేవరాయల వీణ గురువు, గానగంధర్వుడు, కృష్ణాచార్యుల మనుమండు తిమ్మణాచార్యులు.

తిమ్మణాచార్యులు వెంకట నాధునికి మూడో యేటనే అక్షరాభ్యాసం చేయించగా పలకపై 'ఓం'కారం దిద్దమన్న తండ్రిని ఒక్క అక్షరం నారాయణ స్వరూపం ఎలా అవుతుందని ప్రశ్నించి భగవంతుడు సర్వ కళ్యాణ గుణ స్వరూపుడనీ, అనంతుడనీ ఆ వయసులోనే వివరించిన మేధావి, జ్ఞాని వెంకట నాధుడు.

వెంకట నాధుని ఉపనయనం జరిగిన కొన్నినాళ్లకే తండ్రి తిమ్మణాచార్యులు పరమపదం చేరడంతో బావ లక్ష్మీ నరసింహాచార్యులు వద్ద సమస్త శాస్త్రాలు, నిత్యకర్మానుష్ఠానాలు, అభ్యసించటమే గాక వీణావాదనంలో నిష్ణాతుడయ్యారు. యౌవ్వనంలో ప్రవేశించిన వెంకటనాధునికి పొరుగున గల అగ్రహారానికి చెందిన సరస్వతితో వివాహమైంది.

పౌరోహిత్యం, పిల్లలకు పాఠాలు చెప్పడం ద్వారా అతిపేదరిక జీవితం గడుపుతున్న వెంకటనాధ, సరస్వతీ దంపతులకు లక్ష్మీ నారాయణుడు అనే పుత్రుడు కలిగాడు. అతి దారిద్ర్యంతో బాధపడుతున్న ఈ కుటుంబం ఒకసారి పొరుగు సంస్థానానికి చెందిన న్యాయాధికారి ఇంట యజ్ఞ సంతర్పణకు వెళ్లగా ఈ పేద బ్రాహ్మణునికి గంధం తీసే పనిని పురమాయించారు. వెంకట నాధుడు అగ్నిసూక్తం పఠిస్తూ గంధం తీయడంతో భోజనాల వద్ద గంధం అలముకున్న వాళ్ల ఒళ్లంతా మంటలు లేచి హాహాకారాలు చేశారు. వెంకట నాధుడు జరిగిన పొరపాటును గుర్తించి క్షమాపణకోరి వరుణ సూక్తం పఠిస్తూ, తిరిగి గంధం తీసి ఇవ్వగా వారి మంటలు చల్లారడంతో వెంకట నాధుడు మహాత్ముడని అక్కడి వారంతా గుర్తించి సాష్టాంగ పడ్డారు.

వెంకట నాధుడు కుంభకోణం మధ్వ పీఠం - సర్వజ్ఞ పీఠంలో జీవితం గడపడానికి నిశ్చయించుకుని కుంభకోణం తరలివెళ్లారు. ఆ పీఠాధిపతి సుధీంద్ర తీర్థులు వెంకట నాధునికి వసతి కల్పించటంతో అక్కడ మూలరామ పూజలో పాల్గొనడం, విద్యార్థులకు బోధించటం, మధ్వాచార్యుల న్యాయసుధను అధ్యయనం చేయటం దినచర్యలుగా కఠోర నియమంతో గురువాత్సల్యాన్ని సంపాదించాడు. ఒకసారి గురువు గారితో రాజమన్నార్ శ్రీ గోపాల స్వామి దేవాలయానికి వెళ్లి అక్కడి శిష్యులకు తెలియని మహాభాష్యంలోని విషయాలు వివరించి తన పాండిత్య ప్రతిభతో 'మహా భాష్యం వెంకణ్ణాచార్యులు' బిరుదుతో గురువుగారి చేతనే సత్కరింపబడ్డారు. ఇంతటి పండితుడైనా దారిద్ర్యం తప్పలేదు.

ఇలా ఉండగా శ్రీరామ చంద్రుడు సుధీంద్ర తీర్థులకు స్వప్నంలో దర్శన మిచ్చి వెంకట నాధునికి ద్వైత మత సంరక్షణ భారాన్ని, మూలరామ పూజ బాధ్యతలను అప్పగించాలని,

అందుకు వెంకటనాధుడు సన్యసించవలసి ఉంటుందని ఆదేశించారు. అయితే అంతటి త్యాగం చేయలేనని వ్యథ చెందిన వెంకట నాధునికి సుధీంద్ర తీర్థులు సంసార మాయ, దివ్యాదేశములను గురించి బోధించి కుమారునికి ఉపనయనం చేయమని ఆదేశించారు. వాగ్దేవి స్వప్నంలో దర్శన మిచ్చి ధర్మోద్ధరణ శాస్త్ర వ్యాఖ్యానాల బాధ్యత చెప్పి శ్రీవిద్యా మంత్రాన్ని ఉపదేశించింది. కుమారునికి ఉపనయనం చేసి తంజావూరులో సన్యాస దీక్షను ఆశ్రమ నామంగా 'శ్రీ రాఘవేంద్ర తీర్థులు' పేరును శ్రీమూల రామ విగ్రహాలు, రాజ లాంఛనాలతో పీఠాధిపత్యాన్ని స్వీకరించిన రాఘవేంద్రులు ధర్మ ప్రచారం, గ్రంథరచన, తీర్థయాత్రలు విరివిగా కొనసాగించారు. మొదట ఒక ఏడాది ఉడిపి కృష్ణుని సన్నిధిలో మూలరామ పూజ నిర్వహిస్తూ వ్యాసరాయల చంద్రికకు తాత్పర్య చంద్రికను రచించారు. కావేరీ, కృష్ణ, గోదావరి, తుంగభద్ర తీరాలలో పర్యటించారు కృష్ణాతీర పర్యటనలో జయతీర్థుల తత్త్వార్థ ప్రకాశికకు వ్యాఖ్యానం, మధ్వాచార్యుల అణుభాష్యానికి తత్త్వ మంజరి వ్యాఖ్యానం రచించారు. గోదావరీతీర్థంలో ద్వైత మతాన్ని స్థాపించారు. అనేక పుణ్య క్షేత్రాలను దర్శించి అక్కడి దేవతలపై స్తోత్రాలు గానం చేస్తూ ధర్మ ప్రబోధం చేశారు. తిరిగి కుంభకోణ మఠం చేరారు. ఈ విజయ యాత్రలో ఆయన అనేక అద్భుతాలు ప్రదర్శించారు. మహాతపస్వి, యోగిరాజు, సిద్ధపురుషుడు, గొప్పకవి, పండితుడు, వ్యాఖ్యాత శ్రీ రాఘవేంద్ర యతి సార్వభౌములు నవిరోధికృత్ శ్రావణబహుళ విదియ శుక్రవారం 11-08-1671న బృందావనంలో ప్రవేశించారు. అది భక్తుల కోరికలు తీరుస్తున్న బృందావనం.

" పూజ్యాయ రాఘవేంద్రాయ । సత్య ధర్మ రతాయచ ।
భజతాం కల్పవృక్షాయ । నమతాం కామధేనవే ॥"

## 41. మచిలీపట్నం దొంతులమ్మ (1807 - 1932)

నర్మదాతీరంలో పుట్టి, కృష్ణాతీరంలోని బందరు మెట్టి 65 ఏండ్లు నివసించి 1932లో దేహం చాలించిన మహాయోగిని మచిలీపట్నం దొంతులమ్మ. బందరు చేరే నాటికి ఆమె వయస్సు ఉండవచ్చునని కొందరు భావించి ఆమె 1807లో జన్మించినట్లు నిర్ణయించారు. బందరు వచ్చిన కొత్తల్లో నెత్తిపై నీళ్ళ కుండలు దొంతులుగా ఉంచుకుని మోయటం చేత ఆమెను దొంతులమ్మ అని ప్రజలు పిలిచేవారు. ఆంధ్ర ఇతిహాసంతో గొప్ప ప్రాముఖ్యం గల బందరు పట్టణానికి ఆధ్యాత్మిక వైభవాన్ని సంతరించి పెట్టిన మహాయోగిని ముక్తికాంత దొంతులమ్మ నర్మదా నదీ తీరంలో సూర్యనాయక్ బంజారా భార్య దొంతులమ్మ ఒకనాడు భర్తకు పొలానికి చద్ది అన్నం తీసుకువెడుతూండగా ఒక యోగి దర్శనమిచ్చి సాంసారిక బంధాలు వీడి సుజ్ఞాన దీక్షలో ఉండమని ఆదేశించారు. ఆమె తన చెల్లెలిని భర్తకు వివాహం చేసి ఆయన అనుజ్ఞతో మహాయోగి సన్నిధికి రావడం, ఆయన ఆమెకు దీక్ష ఇవ్వడంతో అవధూతగా మారింది. దిగంబరిగా వీధుల వెంట తిరుగుతూ ఎన్నో అద్భుతాలు ప్రదర్శించేది.

ఆమె కర స్పర్శ మహాత్మ్యంతో వ్యాపారులు అధిక లాభాలు గడించేవారు. ఆమెకు ఎందరో శిష్యులు అయ్యారు. ఆమె దర్శన మాత్రం చేతనే భక్తుల అభీష్టాలు నెరవేరేవి. ప్రజోత్పత్తి సంవత్సర మాఘ శుద్ధ తదియ మంగళవారం 9-2-1932 రాత్రి 11.30 గంటలకు ఆమె దేహం చాలించింది. ఆమె మఠం మందిర నిర్మాణాలకు ఆమె భక్తులు, శిష్యులు స్థలం సంపాదించి, వాటిని నిర్మించి ప్రతిఏటా 11 రోజులు ఆరాధనోత్సవాలు ఈనాటికీ నిర్వహిస్తున్నారు. ఆమె ఈనాటికీ సమాధి నుండి పలుకుతుంది. ఆర్తుల కన్నీరు తుడుస్తుంది. స్వప్నంలో సాక్షాత్కరించి జ్ఞాన బోధ చేస్తుంది. భక్తుల భావిజీవిత నౌకను నడిపిస్తుంది.

**" ఆత్మ జ్ఞానమనెడి అగ్నిచే కాలిన,**
**తత్త్వజ్ఞాని తనువు తప్పకుండ**
**భూసమాధి చేసి పూజింపవలెనరుల్**
**అఖిల జీవసంగ ఆత్మలింగ "**

## 42. లింగాలదిన్నె బ్రహ్మస్వామి (1820 - 1889)

బాల్యంలో పసుల కాపరిగా జీవించి, బ్రహ్మజ్ఞానిగా అందలాలెక్కిన రాజయోగి, జ్ఞాని, కర్మిష్ఠి ధార్మికుడు, మాంత్రికుడు, గాయకుడు ఉత్తమోత్తమ పురుషులలో గణనీయుడు, - బ్రహ్మస్వామి. ఇంటి పేరు నుదురుపాటివారు. కౌండిన్యస గోత్రీక వెలనాటి వైదిక బ్రాహ్మణులు లక్ష్మీనరసయ్య, గున్నమ్మ దంపతులకు తమిళ నాడు సేలంలోని శదాపేటలో 1820లో జన్మించారు. తల్లి దండ్రులు పెట్టిన పేరు - నరసయ్య.

బాల్యంలో సేలం వద్ద కొండపై జరిగే లక్ష్మీ నరసింహస్వామి జయంత్యుత్సవాల సమారాధనకు సహచర బాలురతో వెళ్ళిన నరసయ్య ఒక గుహలో ఒక యోగి దయకు పాత్రుడై శ్రీ లక్ష్మీ నరసింహ మహా మంత్రాన్ని పొందారు. ఆయన ఆదేశం ప్రకారం కళ్ళు మూసి తెరిచేలోగా కాశీ చేరాడు. అక్కడ మహామంత్రాన్ని మననం చేసుకుంటూ నరసయ్య ఎన్నో మహిమలను ప్రదర్శించాడు. అప్పటి నుండి ఆయన బ్రహ్మస్వామిగా ప్రసిద్ధుడయ్యారు. అప్పటికి ఆయన వయసు 25 సంవత్సరాలు మాత్రమే.

బ్రహ్మస్వామి కీర్తి అంతటా వ్యాపించటంతో పుష్పగిరి పీఠాధిపతి శ్రీ శంకర భారతీ స్వామి తన ఆస్థానానికి రప్పించుకుని తూగుటుయ్యాలపై ఊగించి ఇష్టాగోష్ఠి చేశారు. తొడుగుపల్లె అగ్రహారంలో స్వామి ఒక బావిని త్రవ్వించి ఆ బావి నీళ్లను కాశీ గంగగా చెప్పారు. ఇప్పటికీ ప్రజలు ఆనీటిని గంగా జలంగానే భావిస్తున్నారు. ఒక భక్తుడు తన్మయత్వంతో స్వామిని పరమేశ్వర రూపంగా నిర్మల భక్తితో ధ్యానించగా స్వామి అతనికి లింగాకారంలో సాక్షాత్కరించారు.

బ్రహ్మస్వామి 32 లక్ష్మీ నరసింహ సాలగ్రామాలు బంగారు కప్పుతో ధరించేవారు కనుక అవిచ్ఛిన్నంగా అన్నదానం జరిపేవారు. ఆయనపై ఎందరో కవులు, పండితులు భక్తితో అనేక కృతులు రచించి అంకితమిచ్చారు. 75 ఏళ్ళు నిండిన బ్రహ్మస్వామి దేహం చాలించనున్నట్లు

ముందుగానే శిష్యులకు తెలిపారు. వికృతి నామ సంవత్సర భాద్రపద అమావాస్య 13-10-89 సోమవారం నాడు లింగాల దిన్నె బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకుని పరమాత్మలో ఐక్యం చెందారు.

లింగాల దిన్నెలో శివాలయంలో ఆయన కాయాన్ని సమాధి చేసి, దానిపై శివలింగ ప్రతిష్ఠ చేసి ఆలయం కట్టించారు. భక్తులు వైభవంగా ఈనాటికీ ఆరాధనోత్సవాలు జరుపుతున్నారు. బ్రహ్మస్వామి గతించి నూరేళ్ళు దాటినా ఆయన వెండి పాదుకలు, మేనా, దర్బాసనం, చిత్రాసనం, రుద్రాక్షకిరీటం, చిత్రపటం అన్నీ ఆనాటికీ దేవాలయంలోను, భక్తుల ఇళ్ళలోను వివిధ ప్రదేశాలలో భక్తుల పాలిటి కల్పతరువులై మహిమలు ప్రకటిస్తూనే ఉన్నాయి.

## 43. లద్దగిరి రామదాసు (1833 - 1893)

ఎక్కడో జన్మించి ఆంధ్రదేశంలో స్థిరపడి భక్తి, కర్మ,జ్ఞాన యోగాలను బోధించిన మహాయోగులలో ఒకరైన లద్దగిరి రామదాసు 30 ఏళ్ళ వయసులో (1863లో) కర్నూలు జిల్లా కోడుమూరు మండలం హంద్రీనదీ తీరంలో ఉన్న ప్రాచీన స్థలం లద్దగిరికి చేరారు. ఆయన 1833 ప్రాంతాలలో జన్మించి ఉత్తరదేశం నుండి లద్దగిరి కొండ వద్ద పొదలు, తుప్పలు, గుట్టలమధ్య ధ్యాన నిష్ఠలో ఉండేవారు. జింక చర్మంపై ఆసీనుడై తపస్సు చేస్తూ అవసరమైనప్పుడు ఆ చర్మాన్నే ఒంటిమీద కప్పుకునేవారు. కులమత భేదాలు పాటించక అందరినీ సమభావంతో దయా దృష్టితో చూసేవారు. నిత్యం తనను దర్శించే భక్తుల కష్టాలు తీర్చేవారు.

ఒక వానాకాలంలో కుంభవృష్టి కురిసి కొండ చరియలు విరిగి పడడంతో రామదాసు హంద్రీనదిలో పడికొట్టుకు పోయారు. అయితే ఆయన నీటిలో మునిగిపోక తేలియాడుతూ సమాధినిష్ఠలోనే కనిపించారు. ఇలా ఎన్నో మహిమలు చూపిన రామస్వామికి లయ హఠయోగాలు కరతలామలక మయ్యాయి. నిరంతరం రామనామం పారాయణ చేసేవారు. ఆయనకు జలస్తంభన విద్య తెలుసు. ప్రజలకు రాబోయే కష్టాలను ఆయన వింత చర్యలద్వారా ముందు గానే సూచించేవారు. తన మహిమలతో ప్రజలను సన్మార్గంలో నడిపించి శాంతి, ఆనందాలు కలుగజేశారు. కొందరికి యోగశక్తులు లభించాయి.

రామస్వామి తన శరీరత్యాగం గురించి 5 నెలల 10 రోజుల ముందుగానే తెలిపి 60 ఏళ్ళు నిండిన రామస్వామి ఆరు మాసాల తరువాత తమ సమాధిని తెరచి చూడమని చెప్పి విజయనామ సంవత్సరం కార్తీక బహుళ ఏకాదశి గురువారం 5-12-1893 నాడు దేహం చాలించారు. స్వామి నిర్దేశించిన చోటనే ఊరి వెలుపల స్వామిని సమాధి చేశారు. ఆరునెలల తరువాత సమాధి తెరచి చూడగా స్వామి నిద్రలో ఉన్నట్లే కనుపించి చిరునవ్వుతో కండ్లు తెరచి మూడుసార్లు ఓంకారం చేసి కండ్లు మూసుకున్నారు. శాశ్వత సమాధి చెందారు. ఆ సమాధి ఈనాటికీ భక్తుల పాలిటి కల్పవృక్షంగా అభీష్టాలు నెరవేరుస్తూ కష్టాలను తొలగిస్తోంది. మూడేండ్ల తరువాత భక్తులకు స్వామి కలలో కనపడి తన సమాధిపై మందిర

నిర్మాణానికి ఆదేశించారు. ఆమేరకు ఆలయ నిర్మాణం జరిగింది. ప్రతియేటా కార్తీక బహుళ ఏకాదశి, ద్వాదశి తిథిలో స్వామివారి ఆరాధనోత్సవాలు ఈనాటికీ జరుగుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రులలో ఒకరైన కోట్ల విజయభాస్కర రెడ్డి 1955లో స్వామికి రథం చేయించి ఇచ్చారు. నాటి నుండి రథోత్సవం కూడా జరుగుతోంది. ఆ ప్రాంత ప్రజలు, భక్తులు, తమ పిల్లలకు ఆయన పేరునే పెట్టుకుంటున్నారు.

## 44. మాదిరాజు వెంకట అప్పారావు (1859 - 1935) (మాధవరాజు వెంకటదాసు)

కవిరాజుగా, యోగిరాజుగా ప్రసిద్ధి చెందిన మాదిరాజు వెంకట అప్పారావు గుంటూరు జిల్లా మునుమాక గ్రామంలో కాశ్యపస గోత్ర నియోగిబ్రాహ్మణ భగవద్భక్తులు, నిష్ఠాగరిష్ఠులు అయినా వెంకమాంబ, లక్ష్మీనారాయణ దంపతుల పుణ్యఫలంగా సిద్ధార్థినామ సంవత్సర ఆషాఢ బహుళ అష్టమి శనివారం 23-7-1859న జన్మించారు. తొమ్మిదేళ్ళ వయస్సులో తండ్రి ఆయనకు చౌలోపనయనాది సంస్కారాలు జరిపి వేదాధ్యయనం చేయించారు. 18 ఏళ్ళ వయసులో పితృవియోగం సంభవించడంతో ఖమ్మం కోర్టులో వాది ప్రతివాదులకు తెలుగు, ఉర్దూ భాషల్లో కాగితాలు వ్రాసియిచ్చి వచ్చిన స్వల్పాదాయంతో జీవితం గడిపేవారు. తరువాత చింతిరేల పోస్టు మాస్టరుగా ఉద్యోగం రావడంతో అక్కడికి వెళ్ళారు. అక్కడి వేదాంత విద్యా విశారదుడు రాళ్ళబండి నరసింహ శాస్త్రితో పరిచయమై వేదాంత గ్రంథాల అధ్యయనం, చర్చలు జరిపేవారు. ఉద్యోగంలో అకారణనిందకుగురై, తాను నిర్దోషి అని రుజువైనా విరక్తి చెంది రాజీనామా చేసి తల్లిని మేనమామ ఇంటికి పంపారు. ఆయన నరసింహశాస్త్రి వెంట హైదరాబాద్ చేరి పీఠ్ఠానా శంకర ప్రభువులను దర్శించారు. ఆయన అప్పారావుకు పంచముద్రలు, అష్టాంగ యోగాలు బోధించి వాటిని శ్రీశైలంలో నిర్జన ప్రదేశంలో సాధన చేయమని ఆదేశించారు. ఆమేరకు అప్పారావు శ్రీశైలం చేరి భ్రమరాంబా మల్లికార్జునులను దర్శించి నిర్జన ప్రదేశంలో తపస్సు ప్రారంభించారు. కొన్నేళ్ళు గడిచిన తరువాత పీఠ్ఠానా శంకర ప్రభువు అప్పారావును శ్రీశైలం నుంచి రప్పించి తిరిగి ఆహారం స్వీకరించ వలసినదిగా ఆదేశించి అచలజ్ఞానాన్ని ఉపదేశించారు. విధ్యుక్తంగా త్రివిధదీక్షలు, త్రివిధ ప్రసాదాలు అనుగ్రహించి జీవబ్రహ్మైక్య సంధానం చేశారు. ద్వాదశి షోడశీ మంత్రాలుపదేశించి పునర్జన్మ లేని త్రోవచూపారు. సన్యాసం కూడదనీ, రాజయోగాన్నే అనుసరించాలని, కనుక వివాహం చేసుకొని తల్లికి సంతోషం కలిగించమని దీవించి పంపారు. అలాగే ఆయన వివాహమాడి తిరిగి శంకర ప్రభువులను దర్శించటానికి వెళ్ళారు. శంకర ప్రభువులు ఆయనను దీవించి ఇంటి పేరు మాధవరాజుగాను, పేరును వెంకటేశ్వరదాసుగాను మార్చుకోమన్నారు. ఆయనే సిఫార్సు చేసి రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగం ఇప్పించారు. అప్పారావు ఖమ్మంలోనే ఉంటూ ఆ ఉద్యోగం చేశారు. తన ఆధ్యాత్మిక ప్రగతికి ప్రతిబంధకంగా ఉన్న ఆ ఉద్యోగం విడిచి కరోడ్గిరీ

మాస్టర్‌గా చెక్‌పోస్టులో చేరారు. క్రమంగా అభివృద్ధి చెంది పదోన్నతితో తిరిగి చింతిరేల చేరారు. కొన్నాళ్లైన తరువాత ఆ ఉద్యోగానికి పుష్టార్ఘ్యమిచ్చి తిరిగి గురువు సన్నిధికి చేరారు.

శంకర ప్రభువులు అప్పారావుకు 'పరిపూర్ణ జ్ఞానానందదేశిక' అనే బిరుదుతో మంత్ర దీక్ష ఇచ్చే అధికారాన్ని ప్రసాదించారు. 1900లో అప్పారావు కుమార్తె వివాహ బాధ్యత నెరవేర్చుకుని 'భక్తానందసాగరం' అనే గ్రంథాన్ని రచించారు. అనంతరం ఆయనకు ఎందరో శిష్యులు ఏర్పడ్డారు. వేమవరంలో స్థిరపడి జ్ఞానామృతము, సీతాకళ్యాణము గ్రంథాలను రచించారు. ఎన్నో అద్భుతాలు, మహిమలు ప్రదర్శించారు. ఆయన సహజకవి. అనేక భక్తి వేదాంతకృతులు రచించారు. కొంతకాలానికి పక్షవాతం వచ్చి తగ్గింది. తరువాత యువనామ సంవత్సర శ్రావణ బహుళ అమావాస్య మంగళవారం 27-8-1935న సాయంత్రం 4 గంటలకు సహస్రారం ఛేదించుకుని దేహం చాలించారు. ఆనాటి నుంచి అక్కడ నవరాత్రి ఉత్సవాలు, భవానీ చంద్రమౌళీశ్వరుల కళ్యాణం, శ్రీవారి ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి.

## 45. మాస్టరు సి.వి.వి. (1862 - 1922)

పతంజలి మహర్షి యోగ సూత్రాలు ఆధారంగా 20వ శతాబ్దం మొదటి దశకాంతంలో భృక్తరహిత తారక రాజయోగ పూర్వకర్మలను నిర్మూలించే రాజయోగం పేరిట ఒక క్రొత్త యోగా మార్గాన్ని నిర్దేశించిన యోగి మాస్టరు సి.వి.వి. కుంభకోణం సమీపంలోని అమ్మారసత్రంలో నివసించినకామమ్మ, కుప్పస్వామి దంపతులకు విభవనామ సంవత్సర శ్రావణ బహుళ పాడ్యమి మంగళవారం (4-8-1868) రోజున జన్మించారు. ఆయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు వెంకాస్వామి ఐదవయేటనే ఉపనయనం చేసి తండ్రి చనిపోవటంతో వెంకట్రావు, సుబ్బమ్మ దంపతుల దత్త పుత్రుడుగా వెళ్లారు. ఇంటి పేరు కంచుపాటి, దత్తత తండ్రి వెంకట్రావు, స్వంత పేరు వెంకాస్వామి, తాతగారి బిరుదు రావు ఇవన్నీ కలిపి కంచుపాటి వెంకాస్వామి రావు అనే వటువు సి.వి.వి. పేరుతో జగత్ప్రసిద్ధులయ్యారు. వెంకాస్వామి వీధి బడిలో తెలుగు, తమిళం, దత్తతల్లి సుబ్బమ్మవద్ద సంస్కృతం నేర్చుకున్నారు. ఆనాటి ఆచారం ప్రకారం 12వ ఏటనే ఆయనకు రుక్మిణితో వివాహమైంది. మెట్రిక్ విశ్వవిద్యాలయంలో ప్రథముడుగా ఉత్తీర్ణుడై ఇంటర్ చదివి అనంతరం ఇంటివద్దనే ఆధ్యాత్మిక యోగ గ్రంథాలు పఠించారు. 1886 డిసెంబర్‌లో చెన్నపట్నం అడయార్‌లో దివ్య జ్ఞాన సమాజం వార్షికోత్సవాలకు వెళ్లిన సి.వి.వి.కి దేశ విదేశాల నుండి వచ్చిన జ్ఞానులతో ఆయనకు పరిచయమైంది, గోదావరి జిల్లా నుండి వచ్చిన టి. సుబ్బారావు ఉపన్యాసానికి ఆకర్షితుడయ్యారు ఆయన స్నేహంతో మేడం బావెట్స్కీ పరిచయమై ఆమెతో కలసి ధ్యానం చేయగా వెంకాస్వామికి సమాధి కలిగింది. నాటి నుండే ఆయన సాధన అంతర్ముఖంగా సాగింది. 1888 లో సి.వి.వి. కుంభకోణం పురపాలక సంఘానికి అధ్యక్షులయ్యారు. అనంతరం రైల్వే కాంట్రాక్టు తీసుకుని నష్ట పోవడంతో ఆస్తులు అమ్మవలసి వచ్చింది. భార్య రుక్మిణమ్మ 1904 లో చనిపోగా 1906లో వెంకమ్మను

వివాహమాడారు. వెంకమ్మ సాహచర్యంతో బ్రహ్మాంశాను భూతి పొంది స్థూల, సూక్ష్మ శరీరాల్లోని వ్యూహాలను అధీనం చేసుకుని జగదాచార్యులై మానవులలో ఆధ్యాత్మిక వికాసం కోసం ఒక ప్రణాళికను సిద్ధం చేశారు. 1908లో హేలీస్‌తోక చుక్క భూగోళం వైపు పయనిస్తూ ఉండగా దాని శక్తిని సి.వి.వి. తమలోకి ఆవాహన చేసుకుని తామే పరబ్రహ్మమనే అనుభూతిని పొందారు. బ్రహ్మం నుంచి వచ్చిన ప్రతి అణువు ధాతువృక్ష, జంతు, మానవ జన్మలుగా పరిణమించటానికి కారణమైన వాయుస్థితి శక్తులన్నిటిని పొంది సృష్టిచేసే క్రమాన్ని తెలుసుకున్నారు. మాస్టర్ సి.వి.వి. సృష్టి చేయగా జన్మించిన ఆ బాలునికి చందు అని పేరు పెట్టారు. 10 నెలల శిశువు చందు తండ్రి సి.వి.వి కి ఎమ్.టి.ఎ. అనే కొత్త మంత్రం నేర్పి, దాని తరువాత వారం వారం కొత్త మంత్రాలనుఅభ్యాసం చేయించి ఒక క్రొత్త ఆధారం చూపి దాని ద్వారా లోకానికి కొత్త వెలుగు ప్రసాదించవలసిందిగా కోరి చనిపోయాడు. 1910 లో వెంకాస్వామి గదిలో అప్రాకృత సాధన చేస్తూండగా అర్ధరాత్రి హేలీస్ తోక చుక్కతోకలోని కాంతి పిడుగు పాటు శబ్దంతో ఆయన శరీరంలో ప్రవేశించింది. అప్పటి నుంచి ఆయనను దర్శించినా, ఆయన స్పృశించినా, సంభాషించినా దివ్యాకర్షణకులోనయ్యారు. సాటి మానవులకు వ్యక్తిగత కుండలినీ శక్తిని ఉద్బోధించడానికి ఉపక్రమించారు. మాస్టర్ సి.వి.వి తన యోగ శక్తితో ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. చివరి దినాల్లో శనిగ్రహగతులను సవరించారు. శుక్ర గ్రహగతులు సవరించే యత్నంలో ఉండగా 10-5-1922న దుందుభి సంవత్సరం వైశాఖ బహుళ పాడ్యమి నాడు దేహం చాలించారు. సి.వి.వి. నవీన యోగ కేంద్రాలు ఆంధ్ర దేశ మంతటా ఉన్నాయి.

## 46. మలయాళ స్వామి (1885 - 1962)

ఏకాంత కఠిన తపశ్చర్యతో ఆత్మోన్నతి పొంది బ్రహ్మ విద్యా ప్రబోధ ప్రచారాలతో లోకకళ్యాణం సాధించిన పుణ్య పురుషుడు మహర్షి సద్గురు మలయాళ స్వామి. కేరళ దేశంలోని గురువాయురులో 29-3-1885 పార్థివ సంవత్సరం చైత్ర శుద్ధ ఏకాదశినాడు సదాచార సంపన్నులై రైత కుటుంబానికి చెందిన కరియప్ప, నొట్టియమ్మ దంపతులకు జన్మించినారు. ఆయనకు తల్లి దండ్రులు పెట్టిన పేరు వేలప్ప. ఆ శిశువు పెరిగి ఐదేళ్ళు రాగానే మాతృభాష అయిన మలయాళంలో అక్షరాభ్యాసం జరిగింది. ఏరోజు పాఠాలు ఆరోజే కంఠస్థం చేస్తూ భాగవత కాలక్షేపాలు, ఏకాదశీ వ్రతాలు పాటించేవారు. జీవకారుణ్యం ఆయనకు ఆ వయసులోనే అబ్బింది. 'దయగల హృదయమే దైవ నిలయమనే సూక్తి ఆయన చెప్పినదే. తండ్రి కోరిన ఆంగ్లవిద్యను అభ్యసించక బ్రహ్మ విద్యకు నిలయమైన సంస్కృతం నేర్చుకున్నారు. తిరువనంత పురానికి 20 మైళ్ళ దూరంలో 'శివగిరి' గురుకులంలో చేరి సంస్కృతం నేర్చుకుంటూ శివలింగ గురు స్వామి ఆదేశం ప్రకారం పంచశుద్ధులు, పంచ నియమాలు వేలప్ప సక్రమంగా పాటిస్తూ గురుసేవ, దైవసేవ, అతిథిసేవ చేసేవారు. అందరూ వేలప్పన్ను

భక్తన్ అని పిలిచేవారు. శివలింగ గురుడు భక్తన్‌కు యంత్రోపదేశం చేసి సాష్టాంగ విధులు, ధ్యాన స్థితిలోని అనుభవాలు, యోగరహస్యాలు ప్రణవాను సంధానం తదితర అంశాలు విశదీకరించారు. అతి స్వల్పకాలంలోనే వేల్పకు యమ నియమాలు అలవడ్డాయి. పాతంజలి యోగ దర్శ రహస్యాలు కరతలామలకాలయ్యాయి. అయినా ఆయన యోగమార్గం కంటే భక్తి జ్ఞాన మార్గాలనే ఎక్కువ అనుసరించేవారు. కొన్ని సంవత్సరాలు తీవ్రసాధనతో అత్యుత్తమ స్థితికి చేరారు. నవీన యుగంలో ఆధ్యాత్మిక విప్లవానికి, సాంఘిక జాగృతికి ఎంతో కృషి చేశారు. ఇరవై ఏళ్ళు కూడా నిండని వేలప్ప ఒక అర్థరాత్రి ఎవరికీ చెప్పకుండా ఇల్లు వెడలి కాలినడకన సమస్త పుణ్య క్షేత్రాలు దర్శించారు. అనేక గురుకులాలు దర్శించారు. హృషీకేశంలో ఆయనకు సమాధి స్థితి కలిగింది. చివరకు గోగర్భం చేరి పాండవ గుహలో తపస్సుతో పాటు ఆత్మ పూజా విధానాన్ని అవలంబించి అహింస, ఇంద్రియ నిగ్రహం, భూతదయ, సహనం, శాంతి, తపము, ధ్యానం , సత్యం అనే అష్ట పుష్పాలతో ఆత్మ పూజ చేశారు. ధ్యాన స్థితిలో జ్యోతిర్దర్శనం, దశవిధనాధ శ్రవణం అద్భుత దృశ్యాల ప్రత్యక్షీకరణ వంటి దశలను అధిగమించారు. ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. భగవంతుని నిరంతర దర్శనం కోసం, ఇతరులకు భగవత్ ప్రాప్తికి అడ్డు పడే ప్రతిబంధకాలు తొలగటం కోసం, అందరూ సత్య జ్ఞానానంద నిత్య పుణ్య మూర్తులని తెల్పటం కోసం, మానవులకు లోకోద్ధార ప్రవృత్తిని కలిగించటం కోసం తమకు పునర్జన్మలు ప్రసాదించాలని భగవంతుని ప్రార్థిస్తూ తపస్సు చేయడం మలయాళ స్వామి ప్రత్యేకత. స్వార్థపరులు సమాజానికి చేస్తున్న అన్యాయాలను ఖండిస్తూ 'శుష్కవేదాంత తమో భాస్కరం' అనే గొప్ప వేదాంత గ్రంథాన్ని, వెంకటేశాది పూజారత్నమాల, ధ్యానామృతం, యధార్థ భారతి, లోకోద్ధారకం వంటి అమూల్య గ్రంథాలు రచించారు. 1936 జులై 2న బాహ్య సన్యాసం స్వీకరించారు. అర్హత గల స్త్రీలకు సన్యాస దీక్షకు అనుమతించారు. బ్రహ్మ విద్యా ప్రచారానికి, సంఘ సంస్కరణకు పాటుపడిన మలయాళస్వామి శుభకృత్ సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి గురువారం 12-7-1962 ఉదయం సిద్ధి పొందారు.

## 47. పేరంటపల్లి బాలానంద స్వామి (1900-1976)

పరమాత్మని వ్యక్త రూపమైన ప్రకృతిని ఉపాసించి బ్రహ్మానుభవం పొంది ఆటవికులు, గిరిజనులలో చైతన్యం వెలిగించిన ముగ్గురు యోగులలో పేరంటపల్లి బాలానంద స్వామి ఒకరు. ఆయన జనన విషయాలు తెలియవు. ఆయన భాష, వివరించిన అంశాలను బట్టి అయన కేరళ దేశానికి చెందిన రాజకుటుంబంలో 1900 ప్రాంతంలో జన్మించి ఉంటారని చరిత్రకారుల భావన. బాలానంద స్వామి ఏకాగ్రతతో తీవ్రంగా ఆలోచించేవారు. అటువంటి ఏకాగ్రతా సాధనలో ఆయనకు విశ్వమాత సాక్షాత్కరించింది. అదే సమయంలో ఆయనకు వివేకానందుడు రచించిన 'మై మాస్టర్' పుస్తకం లభించగా అందులోని సారాన్ని ఒంట బట్టించుకున్నారు. దివ్యానుభూతి సాధించే లక్ష్యంతో ఏకాగ్రతతో భగవద్దర్శనం కోసం తపించే

ఉద్వేగంతో పరివ్రాజకుడై దేశ పర్యటనకు బయలు దేరారు. 1925లో ఒకరోజు రాత్రి పోచవరం సమీపంలో ఇక ఆజానుబాహువు శ్యామలాంగి అక్కడ నిద్రిస్తున్న స్వామిని తనతో తీసుకువెళ్ళి దట్టమైన పొదలు, పెద్దచెట్లు, డొంకలున్న ప్రదేశంలో విడిచి అంతర్ధానమైంది. తెల్లవారిలేచి చూసిన స్వామికి పక్కనే పానపట్టంతో కూడిన శివలింగం కనబడింది. సెలయేరులో స్నానం చేసి లింగాన్ని అభిషేకించి అక్కడే ఆశ్రమ స్థాపనకు స్వామి నిశ్చయించుకుని, కుటీరం నిర్మించుకుని తపస్సు చేశారు. తరువాత భద్రాచలం శివాలయంలో 4 నెలలు మౌనం పాటిస్తూ తపస్సు చేసారు. ఆయనకు అనేక సార్లు దివ్యానుభూతి, శబ్ద బ్రహ్మానుభూతి కలిగాయి. ఆయనకు కూనవరం మందారంలో శ్రీరామకృష్ణ పరమహంస సశరీరంతో ప్రత్యక్షమై అనేక విలషయాలతో పాటే రాజకీయాలను, వేదకాలం నాటి సమసమాజపు ఆదర్శాలను ప్రబోధించారు. దానిని భగవదాజ్ఞగా భావించిన బాలానందస్వామి పేరంటపల్లికి వెళ్ళి అక్కడి ఆశ్రమాన్ని అభివృద్ధిచేసి శ్రీరామకృష్ణులు, శ్రీరామతీర్థుల పటాలు ఉంచి పూజిస్తూ వారు ప్రబోధించిన ఆదర్శాలను ఆచరణలో పెట్టసాగారు. ఆ ఆశ్రమం పేరు 'శ్రీ రామకృష్ణ మునివాటం' అని అంటారు. 12 సూత్రాల శ్రమ నియమావళి రూపొందించారు. కొంతకాలం ఆశ్రమం విడిచి కొండ పైభాగాన చిన్న కుటీరం నిర్మించుకుని ధుని వెలిగించి తపస్సు చేయగా శ్రీకృష్ణ పరమాత్మ దర్శనమైన తరువాత ప్రజాసేవకు ఉద్యమించారు. స్వాతంత్ర్యోద్యమానికి తోడ్పడ్డారు. ఆయన ఇంగ్లీషు భాషలో అరడజను వరకు గ్రంథాలు రచించారు. రాక్షస సంవత్సర పుష్యశుద్ధ త్రయోదశి గురువారం 15-1-1976 ఉదయం 4 గంటలకు విశ్వ చైతన్యంలో విలీన మయ్యారు. ఆయన పార్థివ శరీరాన్ని భక్తులు పేరంటపల్లిలో మరునాడు సమాధి చేశారు. భక్తి యోగంతో ప్రారంభించి కర్మయోగిగా ప్రకృతి రూపమైన పరమాత్మను సేవించి, జ్ఞాన యోగిగా విశ్వచైతన్యంలో విలీనమైన బాలానంద స్వామి ఆరాధనోత్సవాలు ఏటేటా పేరంటపల్లి గుడిలో జరుగుతున్నాయి.

## 48. పెద్దకొన్నవరం నిత్యానంద స్వామి (1893-1965)

కడప జిల్లా ప్రొద్దుటూరు తాలూకా పర్లపాడు గ్రామంలో జీరెడ్డి చిన్న చెన్నారెడ్డి అనే పేద కర్షక దంపతుల ఐదవ సంతానంగా విజయనామ సంవత్సరం మార్గశిరమాసం (1893 డిసెంబర్) లో జన్మించిన శిశువుకు బాలవెంకట సుబ్బారెడ్డి అని నామకరణం చేశారు. సత్యం, భూతదయ, ప్రేమ జన్మతః వచ్చిన లక్షణాలు గల బాలవెంకట సుబ్బారెడ్డి చిన్నతనంలోనే తల్లి దండ్రులు మరణించగా పర్లపాడు నుండి 1909లో పెద్దకొన్నవరం గ్రామం చేరి సంస్కృతాంధ్ర సాహిత్యాలు క్షుణ్ణంగా అభ్యసించారు. రెండు భాషల్లోను 16వ ఏటనే కవిత్వం వ్రాసేవారు. పరాపర విద్యలు, గణిత సూత్రాలు, శుల్బసూత్రాలు, భూమి కొలతలు, కరణీకవృత్తి విషయాలు నేర్చుకున్నారు. 1914లో రాయచోటిలో ఉపాధ్యాయ శిక్షణ పూర్తి చేసి పెద్ద కొన్నవరంలోనే ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించారు. విద్యార్థుల పాలిటి కల్పతరువుగా భాసించిన ఈ గురువుకు

సద్గురువును అన్వేషించే తలంపు కలిగి కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ తాలూకా రాంపల్లె గ్రామంలో రంగా రెడ్డి అనే సత్పురుషుడున్నాడని తెలుసుకుని ఆయనను ఆశ్రయించారు. ఆయన సుబ్బారెడ్డి తీవ్ర వైరాగ్యము, స్వచ్ఛశీలం, భగవత్ ప్రేమలను గమనించి శిష్యునిగా స్వీకరించారు. త్రికరణ శుద్ధిగా సేవించిన బాలవెంకట సుబ్బారెడ్డి ఆయన సన్న్యాసదీక్ష, నిత్యానంద స్వామి అనే దీక్షానామం ప్రసాదించారు. నిత్యానందస్వామి గురువే పరబ్రహ్మంగా ఉపాసించి సాధన చతుష్టయం, శమాది షట్కసంపత్తి, అష్టాంగ యోగం సులభం చేసుకున్నారు. నిత్యానందులు 1925 నుండి కఠిన తపోదీక్షలో ఉండి 'విశ్వంభరీయః' గ్రంథ రచన సాగించారు. ఇంకా శ్రీమన్నారాయణాస్త్ర శరణాగతి, రామనామము, జానకీరామ శతకం, నారాయణస్తవం, శాంతి, శత పత్రం పుత్రహిత బోధిని వంటి ఎన్నో గ్రంథాలు రచించారు. చివరకు ప్రొద్దుటూరులో ఒక భక్తుని ఇంట్లో 17-2-1965 తెల్లవారు ఝామున 4 గంటలకు పరమపదించారు. ఆయన ఆదేశం మేరకు ఆయన శరీరాన్ని సమాధి చేయకుండా దహనం చేసి చితాభస్మాన్ని కుందు నదిలో కలిపారు. నిత్యానంద స్వామి పరిశుద్ధ అంతఃకరణుడు. నిర్మల యోగి, సిద్ధులు, మహిమలు ఆయనకు నచ్చేవికావు. ఆయన అనుభవయోగిగా అనుష్ఠాన వేదాంతాన్నే ప్రబోధించారు. స్వార్థపరులు కల్పించిన ఎక్కువ తక్కువలను సహేతుకంగా ఖండించారు.

## 49. రేపల్లె చిన్నమ్మ (1887-1956)

పూర్వజన్మ సుకృతంతో ఈ జన్మలో మహాజ్ఞానిగా ఎందరికో సద్గతి చూపించి జన్మ రాహిత్యం చేసుకున్న విశిష్ట యోగిని రేపల్లె చిన్నమ్మ. గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా గొరిగపూడికి చెందిన రేపల్లె లక్ష్మయ్య, శాయమ్మలనే కాపు దంపతులకు కనిష్ఠ సంతానంగా జన్మించిన శిశువుకు మాచమ్మ అని పేరు పెట్టారు. బాల్యం నుంచి ఆమెకు జాలి, వినయ విధేయతలు, సత్య సంధత, సాత్త్విక స్వభావము అలవడ్డాయి. ఆమెకు 14వ ఏట గరికపాటి గోవిందయ్యతో వివాహమైంది. అత్తవారింట ఆమెకు బొబ్బర్లంక లక్ష్మీదేవమ్మ అనే ప్రసిద్ధురాలైన యోగినితో పరిచయమైంది. ఏడుగురు సంతానానికి జన్మనిచ్చిన మాచమ్మకు పరమాత్మ సాక్షాత్కారం లభించి ఎన్నో మహిమలు ఆమె ద్వారా ప్రకటితమయ్యేవి. మాచమ్మకు ఎనిమిదవ బిడ్డ పుట్టిన తరువాత ప్రకృతి రహితమైన ఆత్మ మార్గాన్ని ఎన్నుకోగా భర్తపై ఆమెకు పితృభావం, భర్త గోవిందయ్యకు ఆమెపై మాతృభావం ఏర్పడ్డాయి. మాచమ్మ మహాత్మురాలని లోకం గుర్తించింది. అనంతరం మాతృభావం స్వార్థాన్ని అధిగమించి మంగళసూత్రం త్యజించిన మాచమ్మ 12 ఏళ్లపాటు మౌనం పాటించి, 7 సంవత్సరాలు మాట్లాడి తిరిగి 5 ఏళ్ళు మౌనం పూనింది. ఈ రెండవ మౌనకాలంలోనే సంజ్ఞల ద్వారా అమూల్య సత్యాలను మాచమ్మ తెలిపింది. ఆమెలోని శక్తి ఆమెను ఇంటి నుండి బయటకు తరమడంతో ఎక్కువగా నల్లూరుపాలెం, బొబ్బర్లంక, గొరిగపూడి గ్రామాల్లో ఉండి ఎందరికో వ్యాధులను నయం చేస్తూ మహిమలు చూపించారు. ఆమె ఏడు సంవత్సరాలు అన్నం తినకుండా ఒక నిమ్మతొన,

సగం సోడా నీరు మాత్రమే స్వీకరించేవారు. ఆమె గాంధీ మహాత్ముడు ఆంధ్రదేశ సంచారం చేస్తూండగా కలిసికొని బోధించిన బోధనలను ప్రజలు పాటించవలసిందిగా తమ 'యంగ్ ఇండియా' పత్రికలో ప్రకటించారు. అంతటి మహాయోగిని 1951లో రేపల్లె బావాజీ తోటలో ఒక భక్తుడు నిర్మించిన 'శాంతి కుటీరం'లో ప్రవేశించి 1956లో టైఫాయిడ్ జ్వరంతో దుర్ముఖి సంవత్సర మార్గశిర శుద్ధ పంచమి 7-12-1956 సాయంత్రం 5 గంటలకు దేహత్యాగం చేశారు. మరునాడు రాత్రి ఆమె పార్థివ శరీరాన్ని భక్తులు సమాధి చేశారు. ప్రస్తుతం ఆ సమాధి మాచమ్మ (చిన్నమ్మ) సజీవంగా ఉన్నప్పటివలెనే భక్తులకు, ముముక్షువులకు యాత్రా స్థలమైంది.

వస్తువులను జాగ్రత్తగా వాడటంలో ఆమెకు ఆమేసాటి. ఒక్క మెతుకు వృథా పోరాదు. సమృద్ధిగా లభించే నీళ్ళు కూడా అనవసరంగా పారపోయకూడదు అన్నది ఆమె సిద్ధాంతం. వృథా చేసిన వస్తువులు ఆమెను ప్రశ్నిస్తున్నట్లు భావించేవారు. అన్ని వృత్తుల రహితమే జన్మరాహిత్యం అన్నది ఆమె భావన.

## 50. ముషీరాబాద్ పిరాట్ల రామలక్ష్మమ్మ (1882-1969)

సంసార సాగరం ఈదుతూనే జపతప ధ్యానాలతో భవసాగరం దాటిన యోగినులలో ప్రముఖురాలు పిరాట్ల లక్ష్మమ్మ. పలనాటి సీమలో పల్లికుంత గ్రామానికి చెందిన సదాచార సంపన్నులు శ్రీరామ భక్తులు అయిన కంభంపాటి వెంకటప్పయ్య, బుచ్చమ్మ అనే బ్రాహ్మణ దంపతుల ప్రథమ సంతానంగా 12-4-1882 చిత్రభాను సంవత్సర చైత్ర బహుళ నవమి బుధవారం రోజున కృష్ణాజిల్లా జుజ్జూరులో మేనమామల యింట జన్మించారు. ఆమె చిన్నతనంలో పెద్దబాలశిక్ష రామాయణ, భారత భాగవతాలు చదివారు. అధ్యాత్మ రామాయణ కీర్తనలు, రామదాసు కీర్తనలు గానం చేయటం తండ్రి వద్ద నేర్చుకున్నారు. ఆనాటి ఆచారం ప్రకారం రామలక్ష్మమ్మకు 8వ ఏట ముక్త్యాలకు చెందిన పిరాట్ల మృత్యుంజయ శాస్త్రితో వివాహమైంది. ఈ దంపతులకు నలుగురు కుమారులు, ఐదుగురు కుమార్తెలు జన్మించారు. ఇంత పెద్ద సంసారానికి కేంద్ర బిందువైన రామలక్ష్మమ్మ యోగసాధనతో యోగిని అయ్యారు. అనాథలైన బాల వితంతువులకు, సంసార సాగరంలో మునిగి తేలే స్త్రీలకు మార్గదర్శనం చేసి జన్మ సాఫల్యం చేకూర్చాలని సంకల్పించారు. రాత్రివేళల్లో అత్తమామలు నిద్రపోయిన తరువాత ఎవరికీ తెలియకుండా ధ్యానం, యోగసాధన చేసేవారు. ఒకరోజున సాధన చేస్తుండగా మనస్సు అంతర్ముఖమై సమాధి స్థితికి చేరారు. అనంతరం తోటి స్త్రీలకు భక్తి వైరాగ్యాలు బోధిస్తూ యోగరహస్యాలు వివరించేవారు. కొంత కాలం తరువాత ఆమె తన భర్తతో 1932లో హనుమకొండకు వచ్చారు. అక్కడి భక్తులు ఆ దంపతులను అక్కడే నిలుపుకునేందుకు ఒక యిల్లు దానం చేశారు. ఆ ఇంటికి 'సచ్చిదానందాశ్రమం' అని పేరు పెట్టి సత్సంగానికి, తపోధ్యానాలకు, దేవతార్చనలకు ఉపయోగించారు.

రామలక్ష్మమ్మ కుమారుని చదువుకోసం కాకినాడలో ఉన్నప్పుడు ఎందరో బాధాసర్వద్రష్టులైన స్త్రీలకు మనశ్శాంతి కలిగించారు. ఇలా ఉండగా 1933 జనవరి 7న భర్త మృత్యుంజయ శాస్త్రి పరమపదించారు. 1938లో కాకినాడలో పెద్ద ఆశ్రమం స్థాపించి పేద విద్యార్థులకు ఉచిత భోజనాలు ఏర్పాటు చేయించారు. పూజా మందిరం, సత్సంగ భవనం, సాధకులకు, అనాథలకు ఆవాసం నిర్మించారు. హైదరాబాద్‌లో ఆమె భక్తులు, శిష్యులు ఒక ఆశ్రమం నిర్మించారు. రామలక్ష్మమ్మ శేషజీవితాన్ని ఈ మూడు ఆశ్రమాల్లోను గడిపి 87వ ఏట 4-1-1969 కీలకనామ సంవత్సర పుష్య బహుళ పాడ్యమి శనివారం నాడు శ్రీరామచంద్రుని పాదపద్మాలలో ఐక్యమయ్యారు. ఎందరికో జ్ఞానభిక్ష పెట్టిన నిరాడంబర యోగిని రామలక్ష్మమ్మ ఆరాధనోత్సవాలు పై మూడు ఆశ్రమాలలో నేటికీ జరుగుతున్నాయి. ఆశ్రమాలలో నిత్య కార్యక్రమాలతోపాటు ఏటేటా ఆశ్రమవార్షికోత్సవాలు, శరన్నవరాత్రులు, శ్రీరామ కళ్యాణోత్సవాలు విశేషంగా జరుగుతున్నాయి. కాగా, కాకినాడ ఆశ్రమం ప్రభుత్వ స్వాధీనంలో ఉంది. స్థితప్రజ్ఞురాలు రామలక్ష్మమ్మ యోగిని.

## 51. జిల్లెళ్ళమూడి అనసూయమ్మ (1923-1985)

అష్టసిద్ధులను కైవసం చేసుకున్న కుర్తాళం మౌనస్వామి రాజరాజేశ్వరీ యంత్రం ప్రతిష్ఠించిన రాజ్యలక్ష్మీ అమ్మవారి ఆలయం ఉన్న గుంటూరుజిల్లా పొన్నూరు తాలూకా మన్నవ గ్రామంలో రుధిరోద్గారి చైత్రశుద్ధ ఏకాదశి బుధవారం సూర్యోదయంతో (28-3-1923) జన్మించిన అమ్మ జిల్లెళ్ళమూడి అనసూయమ్మ. వల్లూరు (మన్నవ) సీతాపతి శర్మ, రంగమ్మలకు రాజరాజేశ్వరీ అంశతో అవతరించిన అనసూయమ్మ తల్లి గర్భంలో ఉండగానే తనదైన ప్రత్యేకతను ప్రదర్శించారు. పుట్టుకనుండే కులమతాల కతీతమైన దృష్టి ఆమెకు అలవడింది. మూడేళ్ళ వయసులోనే తల్లి అడిగిన ప్రశ్నకు బదులుగా తానే అందరికీ అమ్మనై ఉంటాను అని చెప్పిన మహనీయురాలు. జనన మరణాల గురించి, పూజా విధుల గురించి చిన్నప్పటి నుండి పెద్దలను ప్రశ్నించేవారు. ఐదేళ్ళ అనసూయమ్మ 1927లో చీరాలలో ఉన్న మౌనస్వామితో ఏకాంతంగా తత్వగోష్ఠి చేశారు. ఎన్నో అద్భుతాలు, లీలలు ప్రదర్శించారు. తనను దర్శించేవారికి స్వయంగా వండిపెట్టేవారు. జనం పెరగడంతో 1958 ఆగష్టు 15న భక్తులు అన్నపూర్ణాలయం ఏర్పాటు చేసి భోజన సౌకర్యం కల్పించారు. 1936లో అమ్మకు జిల్లెళ్ళమూడి గ్రామ కరణం బ్రహ్మాండం నాగేశ్వరరావుతో వివాహమైంది. ముగ్గురు బిడ్డలకు తల్లి అయిన శక్తి స్వరూపిణి అమ్మ జీవితంలో కుమార్తె, భర్తల మరణంలను తేలికగా తీసుకున్నారు. ఆమె ఉనికితో జిల్లెళ్ళమూడి పుణ్యక్షేత్రంగా మారేది. రూపం పరిమితం, శక్తి అనంతం, మాతృత్వం శతపత్రంగా విరిసిన సౌందర్యలహరి అమ్మ సన్నిధిలో ఎన్నో కళ్యాణాలు జరిపించారు. ఆమె మాట్లాడే ప్రతి మాట అర్థవంతంగా ఉండేది. ఆమె దృష్టిలో అందరూ మంచివాళ్ళే అంతా ఆత్మగా కనిపించటమే ఆత్మ సాక్షాత్కారం. అంతా దివ్యంగా కనపడటమే

దివ్య దృష్టి అని ఆమె ప్రవచించేవారు. 'జ్ఞానమే బ్రహ్మ' అని ఆమె బ్రహ్మ జ్ఞానాన్ని నిర్వచించారు. ఆమె చెప్పిన ప్రతి నిర్వచనం ప్రతి మాట ఆలోచింపజేసేవిగా, మార్గాన్ని సుగమం చేసి గమ్యాన్ని చేర్చేవిగా ఉంటాయి. సంప్రదాయాలపై తిరుగుబాటును బోధించి ఆచరింపజేసిన అమ్మ క్రోధననామ సంవత్సరం జ్యేష్ఠ బహుళ నవమి - దశమి బుధవారం (12-6-1985)న తనువు చాలించారు. ఇప్పుడు అనసూయేశ్వర ఆలయం నుండే యథావిధిగా పనులు జరిపిస్తున్నారు. జిల్లెళ్ళమూడిలో మాతృశ్రీ ఓరియంటల్ కళాశాల, మాతృశ్రీ సంస్కృత పాఠశాల, ఉచిత విద్య, భోజన వసతి సౌకర్యాలు, మాతృశ్రీ మెడికల్ సెంటర్, శ్రీ విశ్వజననీ పరిషత్, అన్నపూర్ణాలయం, ఆదరణాలయం - అమ్మ ప్రజాహిత కార్యక్రమాలకు ప్రతీకలుగా నడుస్తున్నాయి.

## 52. పాకలపాటి గురువులు (1911-1970)

ప్రకృతిలో పరమాత్మను దర్శించి, ఆ ప్రకృతితో తాదాత్మ్యం పొందిన మహాపురుషులలో పాకలపాటి గురువులు ఒకరు. ఆయన పశ్చిమగోదావరిజిల్లా ముండూరు అగ్రహారంలో దామరాజు గంగరాజు, వెంకమ్మ అనే ఆరువేల నియోగి దంపతుల మూడవ సంతానంగా జన్మించారు. ఆ శిశువుకు తల్లిదండ్రులు చేసిన నామకరణం వెంకట్రామయ్య. ఆరునెలల వయస్సులో తల్లిని, 9వ ఏట తండ్రిని కోల్పోయిన వెంకట్రామయ్య 8వ తరగతి విద్యనభ్యసిస్తూనే స్వార్థపరులు, డాంభికులు అయిన పెద్దలను సంస్కరించేందుకు ప్రయత్నించారు. తన అసాధారణ గ్రహణ, ధారణ శక్తులతో పండితుల ప్రశంసలను అందుకున్నారు. వెంకట్రామయ్యను గారపాటి పుల్లయ్య అనే కమ్మ భూస్వామి చేరదీసి బాబుగారు అని పిలుస్తూ ఉండేవారు ఆ పేరే ప్రచారంలోకి వచ్చింది. ఒకనాటి రాత్రి ఏలూరు స్టేషన్‌లో కలకత్తా వెళ్ళే మెయిల్ ఎక్కి ప్రయాణం చేస్తూండగా టిక్కెట్‌లేని బాబుగారిని నర్సీపట్నంలో టిక్కెట్ కలెక్టర్ దించేశాడు. అక్కడ దిగిన బాబుగారు ఊళ్ళో బీళ్ళు కొండలు, కోనల్లో కొన్ని సంవత్సరాలు తిరిగి బొబ్బిలి సమీపంలోని కలువరాయి చేరారు. అక్కడ మంత్ర తంత్ర జపయోగ సాధనలలో ఆరితేరిన ఆధునిక బ్రహ్మర్షి కావ్యకంఠ మునిని సేవించి అనేక విద్యలను కళలను అభ్యసించారు. విధ్యుక్తంగా గాయత్రీమంత్ర జపానుష్ఠానాదులు చేసి మంత్ర సిద్ధులయ్యారు. ఆయనది కంప్యూటర్ మేధస్సు కావడంతో వింత బాలుడుగా ప్రసిద్ధి చెందారు. అకస్మాత్తుగా ఆయన కలువ రాయివిడిచి అరణ్యాలు, పర్వతాలు, నదీతీరాలు, తీర్థ ప్రదేశాలు, యోగ భూములు, త్రివిష్టపం, బర్మా, రంగూన్, సిలోన్ అడవుల్లోని సుందర దృశ్యాలు సందర్శించి వేద, ఇతిహాస పురాణ, సాహిత్య, జ్యోతిష, మంత్ర, మూలికా వైద్య, పాకశాస్త్రాలలో నిష్ణాతులయ్యారు. ఎందరో యోగులను కలిశారు. 1930-1931లో బాబుగారు నర్సీపట్నం వచ్చి లంబసింగి ఆశ్రమంలో స్థిరపడ్డారు. కుసర్లపూడిలో ఒక భజన సంఘం స్థాపించారు. ఏజెన్సీ అడవులలో ఆటవికులకు లౌకిక పారమార్థిక జ్ఞాన ప్రబోధం చేస్తూ అనేక ఆశ్రమాలు స్థాపించారు. ఆయనకుభక్తులు పాకలపాడులో ఒక ఆశ్రమం నిర్మించారు. అక్కడ ఆయన

నిరాహారంగా అనేక మాసాలు కఠోర తపస్సు చేశారు. విక్రమదేవవర్మ బాబుగారిని జయపురం సంస్థాన ఆస్థాన కవిగా నియమించుకున్నారు. ఆటవికులకు భక్తి ప్రపత్తులు నేర్పి ఆరోగ్యభాగ్యాలు ప్రసాదించి వారికి ఆరాధ్యుడైన బాబుగారు సౌమ్య సంవత్సరం మాఘ బహుళ చతుర్దశి శుక్రవారం 6-3-1970 మహాశివరాత్రి పర్వదినాన నాడు లింగోద్భవ సమయంలో సిద్ధాసనంలో కూర్చుని రామా అంటూ 3 సార్లు కేకవేసి శరీర త్యాగం చేశారు.

## 53. ద్రోణాచలం రామచంద్రమాలిక్ బాబా (1910-1990)

ఆంధ్రదేశాన్ని అనుగ్రహించిన దత్తావతారులలో అవధూత రామచంద్ర మాలిక్ బాబా ఒకరు. కర్నూలు జిల్లా ద్రోణాచలంలో 1960లో ప్రవేశించి నిత్యాన్నదానంతో అందరి ఆకలిని పోగొట్టి విభూతి ప్రసాదాలతో అందరి అధివ్యాధులు తొలగించి, కోటీశ్వరులను, నిరుపేదలను సమానంగా ఆదరించి ద్రోణాచలం పరిసర గ్రామాల వారికి ఆరాధ్య దైవమయ్యారు. ఒకసారి భక్తులు అడిగితే తమ పేరు రాంచందర్ అని, జన్మస్థలం బద్రీనాథ్ అని మాత్రం చెప్పారు. ద్రోణాచలం ప్రవేశించేనాటికి ఆయన వయస్సు సుమారు 50ఏళ్ళు ఉండటంతో ఆయన 1910లో జన్మించి ఉండవచ్చునని భావిస్తున్నారు. ఆయన గ్రామం వెలుపల చాకిరేవు గట్టున మఱ్ఱిచెట్టు క్రింద ధ్యాన నిమగ్నులయ్యేవారు. బాబా వెలిగించిన ధుని రేయింబవళ్ళు మండుతూ ఉండేది. అందులోని బూడిదనే అందరికీ ప్రసాదంగా ఇచ్చేవారు. వింతవింత లీలలు ప్రదర్శించేవారు. ద్రోణాచలం భక్తులేగాక దూర ప్రాంతాల నుండి కూడా బాబా శరణుకోరి వచ్చే వేలాది భక్తులకు నెలల తరబడి నిరాటంకంగా అన్న సంతర్పణ జరిపించేవారు. బాబా తమ దృష్టితో, హస్తస్పర్శతో విభూతితో చిన్నచిన్న చిట్కాలతో దీర్ఘకాలిక రోగాలు, నొప్పులు నయం చేసేవారు. తాను ఇక్కడే ఉండగా అనవసరంగా డబ్బు ఖర్చుచేసి షిర్డీ వెళ్ళి వచ్చిన భక్తులను మందలించేవారు. ఒకనాడు భక్తులు అందరూ ఉండగా తాము 20దినాల తరువాత శరీరం చాలిస్తామని ప్రకటించారు. శుక్లనామ సంవత్సరం ఫాల్గుణశుద్ధ విదియ మంగళవారం (27-2-1990) ఉదయం బాబా శరీరం చాలించారు. బాబా పార్థివ శరీరాన్ని ఆయన తపస్సు చేసిన మఱ్ఱిచెట్టు క్రింద ఆంజనేయ స్వామి గుడికి ఎదురుగా విధివిధానంగా భక్తులు పద్మాసన స్థితిలో సమాధి చేశారు. బాబా భక్తులు 20-4-1992న మందిరాన్ని నిర్మించి విగ్రహ ప్రతిష్ఠ చేసి నిత్యపూజలు, మాఘ బహుళ విదియ నుండి ఐదురోజుల పాటు ఆరాధనోత్సవాలు ప్రతిఏటా వైభవంగా జరుపుతున్నారు. సమాధిలో నుండి కూడా తనను ఆశ్రయించిన భక్తులకు శాంతి సుఖాలు పంచుతున్నారు.

## 54. పశివేదల ప్రజ్ఞానంద స్వామి (1903-1983)

గొరగనమూడి జ్ఞానానంద స్వామి మరో శిష్యుడుగా విద్యావైద్య సామాజిక రంగాల్లో సేవలు చేస్తూ భగవంతునికి ప్రీతిపాత్రుడైన యోగి పశివేదల ప్రజ్ఞానంద స్వామి. పశ్చిమ

గోదావరి జిల్లా పాలకొల్లు సమీపంలో ఉన్న చింతపర్రులో వారణాసి రామకృష్ణయ్య, మహాలక్ష్మమ్మ దంపతుల ద్వితీయ పుత్రుడుగా జన్మించిన వెంకటప్పయ్యయే అనంతర కాలంలో ప్రజ్ఞానంద స్వామిగా ప్రసిద్ధికెక్కారు. శోభాకృత్ సంవత్సర ఆశ్వయుజ బహుళ పాడ్యమి బుధవారం 7-10-1903న జన్మించిన వెంకటప్పయ్యకు చిన్నప్పటి నుంచి రామభక్తి ఎక్కువ. బడి చదువులతోపాటు భక్తుల చరిత్రలు చదవటం, స్తోత్రాలు, కీర్తనలు గానం చేయటం అలవయ్యాయి. స్వాతంత్ర్యోద్యమ కాలంలో దేశభక్తి ప్రభోదించేశారు. బ్రహ్మచర్యం పాటిస్తూ, అపక్వాహారం భుజిస్తూ గాయత్రీ మంత్ర పురశ్చరణ, ప్రణవోపాసన, ప్రాణాయామం, యోగాసనాలు, కుండలినీ యోగం సాధించారు. భగవద్గీత, పంచాదశి, సీతారామాంజనేయ సంవాదం ఒంట బట్టించుకున్నారు. 1922లో తణుకు జాతీయ పాఠశాలలో హిందీ పండితుడుగా నియమితులైన ప్రజ్ఞానంద స్వామి హరిజన బాలుర హాస్టల్‌ను కూడా నిర్వహించేవారు. స్వరాజ్యంతో పాటు స్వరాజ్యం కోసం కూడా ఆయన అహోరాత్రాలు సాధన చేశారు. 1924న గొరగనమూడికి వచ్చిన స్వామి జ్ఞానానందుల వద్ద శాస్త్రోక్తంగా సన్యాసదీక్ష 'ప్రజ్ఞానంద' దీక్షానామం స్వీకరించారు. అనంతరం ఉత్తరదేశ యాత్ర చేసి ఉత్తరకాశీకి చేరారు. అనంతరం ఉత్తరదేశ యాత్రచేసి ఉత్తరకాశీకి చేరారు. 1932-1933 మధ్యకాలంలో వివిధ ప్రాంతాల్లో కఠిన తపస్సు చేశారు. 1934లో చాలాకాలం నండూరు గ్రామంలో మౌన ధ్యాన నిష్ఠలో ఉండటం చేత ఆయనకు నండూరి స్వామి అనే పేరు వచ్చింది. 1936లో నాసికా త్ర్యంబకం దర్శించి హరిద్వారం చేరి వివిధ ప్రదేశాల్లో తపస్సు చేశారు. 1936లో లక్ష్మీవనం, సహస్రధార, చక్రతీర్థం దర్శించారు. సత్యపంథలో తీర్థ విధులు నిర్వర్తించి చంద్ర, సూర్య, విష్ణు కుండాల మీదుగా స్వర్గారోహణ పర్వతం చేరారు. అక్కడ ఆయనకు గొప్ప దివ్యానుగ్రహం కలిగింది. తపస్సు ఫలించింది. బదరి గ్రామానికి తిరిగి వచ్చారు. 1937 నుండి 1939 వరకు వివిధ ప్రాంతాలలో తత్త్వోపదేశం చేశారు. 1939లో గోదావరి నదీ తీరాన కొవ్వూరుకు సమీపంలోని పరివేదలలో చిదానందాశ్రమం ఏర్పాటు చేసుకున్నారు. 1940 నుంచి 42 వరకు తిరుమల వైకుంఠ తీర్థ గుహలో ఏకాంతంగా తపస్సు చేసి తిరిగి చిదానందాశ్రమం చేరారు. గోదావరి వరద బాధితులకు అన్న సంతర్పణ, వైద్య సౌకర్యాలు, ఇతర సహాయ కార్యక్రమాలు ఏర్పాటు చేసి నిర్వహించారు. సమాజ సంస్కరణలో బాలవితంతువుల వివాహాలు నిర్వహించారు. గ్రామ సంఘాలు ఏర్పాటు చేసి గ్రామ రక్షణకు తోడ్పడ్డారు. ప్రజ్ఞానందులకు వేలాది మంది శిష్యులు ఏర్పడ్డారు. రుధిరోద్గారి భాద్రపద శుద్ధ అష్టమి బుధవారం (14-9-1983) ఉదయం గం. 11-45 ని॥లకు ప్రజ్ఞానందస్వామి బ్రహ్మైక్యం చెందారు. చిదానందాశ్రమం గోశాలలో ఆయన శరీరాన్ని భక్తులు సమాధి చేశారు. బ్రహ్మానుభవం పొంది సమాజ సేవలో జీవితమంతా వెచ్చించి ఆంధ్రయోగుల చరిత్రలో చిరస్మరణీయులైన ప్రజ్ఞానందస్వామి ఆరాధనోత్సవాలు, జయంత్యుత్సవాలు ఏటేటా శిష్యులు ఘనంగా జరుపుకుంటున్నారు.

## 55. ఏనుగులమహల్ ప్రణవానంద స్వామి (1896-1989)

పరబ్రహ్మం, అపరబ్రహ్మం కూడా అయిన ప్రణవం (ఓం కారం) మానవాకారమే ప్రణవానంద స్వామి. ఆయన స్వామి జ్ఞానానంద శిష్యుడు. తూర్పుగోదావరిజిల్లా కొత్తపేట మండలంలో ప్రసిద్ధ శనైశ్చర క్షేత్రం మందపల్లికి సమీపంలోని ఏనుగుల మహల్‌లో భారద్వాజస గోత్రీకుల తెలగాణ్య వైదిక బ్రాహ్మణ కుటుంబంలో కనకదండి విశ్వపతి శాస్త్రి సీతమ్మ దంపతుల జ్యేష్ఠ పుత్రుడుగా దుర్ముఖినామ సంవత్సర మాఘశుద్ధ పాడ్యమి 14-1-1896న జన్మించారు. ఆయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు వెంకట సోమయాజులు. ఎం.ఎ. వరకు విద్యనభ్యసించిన వెంకట సోమయాజులు 1915లో దేశ స్వాతంత్ర్యం కోసం పోరాటంలో పాల్గొనదలచి పంజాబులో లాలాలజపతిరాయ్ స్థాపించిన లాహోరు డి.ఎ.వి. కళాశాలలో చేరారు. 1919లో పట్టభద్రుడై కొంతకాలం వాయవ్య రైల్వేలో ఎక్కౌంట్స్ ఆఫీసర్‌గా పని చేసి 1920-1926 సంవత్సరాల మధ్యన పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెస్‌లో హరిజన సంక్షేమం, ఖద్దరు శాఖల్లో సేవచేసి సహాయ నిరాకరణోద్యమంలో కారాగార శిక్ష అనుభవించారు. 1927లో హిమాలయాల్లో పర్యటిస్తూ జ్ఞానానందస్వామి వద్ద దీక్షితులై ప్రణవానందులయ్యారు. అనంతరం హిమాలయాల్లో కఠిన తపస్సు చేసి హఠయోగ, రాజయోగ ఖేచర ముద్రలు సాధించి ఉన్నత యోగ భూమికలు అధిరోహించారు. 'జ్ఞాన దీపిక' పేరిట గీతా వ్యాఖ్యానం ప్రకటించి 29-8-1928న జ్ఞానానందులకు అంకితమిచ్చారు. అమర్‌నాథ్ గుహలో 15 దినాలు ఏకాంతవాసం చేశారు హిమాలయాల్లో వివిధ ప్రదేశాల్లోను మానససరోవర తీరంలోను, కైలాస పర్వతం సమాపంలోను, పశ్చిమ త్రివిష్టపం బౌద్ధారామాలలో చాలాకాలం తపస్సు చేశారు. హిమాలయాల్లో 25 చాతుర్మాస్యాలు నిర్వహించారు. కైలాస పర్వతాన్ని 36 సార్లు, మానససరోవరం 33 సార్లు ప్రదక్షిణం చేశారు. భూమి ఉపరితలానికి, భూగర్భానికి గల సంబంధించి అనేక పరిశోధనలు చేశారు. మన చరిత్రకు, సంస్కృతికి, దేశ రాజకీయాలకు నిష్కామకర్మ సేవ చేశారు. 1929లో అమర్‌నాథ్ గుహలో 15 రోజులు ఉండి శివపార్వతి గణేశలింగాలు ఏర్పడే తీరును పరిశోధించి వ్రాశారు. ఆయన సాహసయాత్రలు చేసి 1937, 1942, 1946 సంవత్సరాల్లో కైలాస శిఖరానికి కొత్త మార్గాలు, చారిత్రక విశేషాలు కనుగొన్నారు. 1947లో భారత ప్రభుత్వం ఆయనను 'పద్మశ్రీ' బిరుదుతో గౌరవించింది. ప్రణవానందులు గొప్ప శ్రీ విద్యోపాసకులు. శ్రీచక్రంపై గొప్ప సిద్ధాంత గ్రంథం రచించారు. ఏనుగుల మహల్ మందిరంలో 28-3-1983న రెండు టన్నుల మహాత్రిపుర సుందరీ అమ్మవారి శ్రీ చక్రమేరు యంత్రాన్ని స్థాపించారు. మానససరోవరం తీరాన తుగోల్హోలో ఒక యజ్ఞవేదిక నిర్మించారు. ఇప్పటికీ అక్కడ ప్రతిఏటా శ్రీ కృష్ణ పరమాత్మ జన్మదినోత్సవాలు జరుగుతున్నాయి.

ప్రణవానంద స్వామి ఎన్నో గ్రంథాలు రచించారు. గాయత్రీ మంత్రార్థాన్ని వివరించారు.

1978లో ఎండదెబ్బ తగిలి ఆయన జ్ఞాపకశక్తి క్షీణించింది. శుక్ల సంవత్సర వైశాఖశుద్ధ ద్వాదశి బుధవారం 17-5-1989 రోజున హైదరాబాద్‌లో విశ్వచైతన్యంలో లీనయ్యారు. తన అవశేషాలేవీ మిగల్చవద్దన్న స్వామి ఆదేశం మేరకు ఆయన శరీరాన్ని విద్యుత్ శ్మశాన వాటికలో దహనం చేశారు. ఏటేటా మాఘ శుద్ధ పాడ్యమి నాడు స్వామి వారి జన్మదినోత్సవాలు, ఉద్ధరణకు, ఆయన పరిశోధనలు మన చరిత్ర, సంస్కృతులకు తరగని సంపద.

## 56. రాయదుర్గం భంభం స్వామి (1886-1969)

చిప్పగిరి భంభం స్వామి శిష్యుడు రాయదుర్గం భంభం స్వామి (షేక్ అబ్దుల్ సాహెబ్) హిందూ మహమ్మదీయ మతాల సామరస్యం కోసం కృషి చేసిన మహనీయుడు చిప్పగిరి భంభం స్వామి ఆశీస్సులతో 1886లో ఆదోనికి చెందిన అలీసాహెబ్ రాజుజీ దంపతులకు జన్మించిన శిశువుకు అబ్దుల్ వహాబ్ అని పేరు పెట్టారు. అబ్దుల్ వహాబ్ 12వ ఏట అతని ఆగడాలకు తట్టుకోలేని తల్లిదండ్రులు అతనిని చిప్పగిరి భంభం స్వామి వద్దకు తీసుకువెళ్ళి అప్పగించారు. అబ్దుల్ వహాబ్‌కు చెవిలో ద్వాదశాక్షరీమంత్రం ఉపదేశించి లింగం, జందెం, గాజులు ధరింపజేసి 'భంషేక్ అబ్దుల్' అనే దీక్షానామం ఇచ్చి సాగనంపాడు. అల్లరి బాలుడుగా 12వ ఏట చిప్పగిరికి వెళ్ళిన అబ్దుల్ వహాబ్ 14 ఏండ్ల 'భంషేక్ అబ్దుల్ దాసు'గా తల్లిదండ్రులు ఉండే ఆలూరుకు తిరిగి వచ్చాడు. చిప్పగిరి భంభం స్వామి ఆదేశం మేరకు తల్లిదండ్రులు అతనికి యుక్త వయస్సు రాగానే వివాహం చేశారు. భంషేక్ అబ్దుల్ గృహస్థాశ్రమ ధర్మం నిర్వహిస్తూ గురువు బోధించిన రాజయోగం సాధించాడు. కొంతకాలం హఠయోగ క్రియలన్నీ పూర్తి చేసి జీవనోపాధికై పోలీసుశాఖలో ఉద్యోగానికి చేరాడు. త్రికరణశుద్ధిగా తన ఉద్యోగ ధర్మం నిర్వహిస్తూ గురువు బోధనలను, భగవద్భక్తికి సర్వమత సారాన్ని ప్రచారం చేశారు. ఎందరో అనుచరులను, శిష్యులను సంపాదించాడు. రోగగ్రస్తులు, గ్రహ పీడితులు, సంతానహీనులు, గృహ సమస్యలతో సతమతమయ్యేవారు భంషేక్ అబ్దుల్ దాసును ఆశ్రయించి మేలు పొందేవారు. ఆయనను జమేదారు స్వామిగా కీర్తించేవారు. ఆయన ఎన్నో లీలలు, అద్భుతాలు ప్రదర్శించారు. ఆయన 201 కీర్తనలు, 11 తత్త్వాలు రచించారు. తన సమాధి స్థలాన్ని ఒక నెల ముందే ఎంచుకుని కీలక సంవత్సర ఫాల్గుణ శుద్ధ దశమి శుక్రవారం (21-2-1969) ఉదయం 9-25 గంటలకు గురుమంత్రం జపిస్తూ పరమాత్మలో లీనమయ్యారు. నేటికీ రాయదుర్గంలో ఏటేటా బాబా ఆరాధనోత్సవాలు వైభవంగా జరుగుతున్నాయి.

## 57. శ్రీ విద్యారణ్యస్వామి (1296 - 1386)

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థాన మధర్మస్య యోగక్షేమం వహామ్యహం**

ధర్మానికి హాని జరిగినప్పుడు ధర్మ ప్రతిష్ఠాపనకోసం తానుగాగాని, తన అంశగాగాని భూమిపై అవతరిస్తానని శ్రీ కృష్ణ భగవానుడు భగవద్గీతలో చెప్పాడు. ఆకోవకు చెందిన భగవదంశ సంభూతుడు శ్రీ విద్యారణ్యస్వామి.

భారతదేశంపై ముస్లింలు జరిపిన దండయాత్రలు, దురాగతాలు సనాతన హిందూ ధర్మానికి, సంస్కృతికి గొప్పవిఘాతం ఏర్పడిన కాలంలో 1296లో శ్రీమతీ, మాయణ దంపతుల పెద్ద కుమారుడైన మాధవునిగా జన్మించిన మహనీయుడే అనంతరం వైదిక ధర్మరక్షణ చేసి శ్రీవిద్యారణ్య స్వామిగా ప్రసిద్ధి చెందారు. ఆయన జననం గురించి, జన్మస్థలం గురించి అనేక వివాదాలు ఉన్నప్పటికి విద్యానగర నిర్మాతగా, హిందూ రాజ్య స్థాపనకు నాంది పలికిన ప్రప్రథమ గురువుగా ధర్మంకోసం రాజకీయ చక్రం తిప్పిన విజయనగర సామ్రాజ్య స్థాపకుడయ్యారు. సుమారు 6 శతాబ్ధాల కాలం ముస్లిం మత ప్రాబల్యంతో అవిచ్ఛినంగా సాగిన గోబ్రాహ్మణ వధలు, మసీదులుగా మారిన మఠాలు, మందిరాలు, స్త్రీల మానభంగాలు, దుర్మరణాలు, బలవంతపు మత మార్పిళ్లకు తన తపశ్శక్తితో, దూరదృష్టితో అడ్డుకట్టవేసిన యోగి, మహాతపస్వి, మహా పండితుడు శ్రీ విద్యారణ్య స్వామి. ఆయన కేవలం రెండేళ్లలో 1334-1336 మధ్యకాలంలో విద్యానగరాన్ని నిర్మించి భగవంతుడైన విరూపాక్ష దేవుడే పాలకుడుగాను, ఆ దేవుని ప్రతినిధిగా మతం మారినా పదవి దక్కని పరాభవంతో అడవులలో తిరుగుతున్న హరిహరనాథుని తిరిగి హిందూ మతంలో చేర్చి విద్యానగర సామ్రాజ్యపాలకుడుగా నియమించి, పట్టాభిషిక్తుని చేశారు.

అనంతరం ఆయన కాశీ యాత్రకు బయలుదేరి మార్గ మధ్యంలో శృంగి అనే బ్రహ్మరాక్షసుని సహకారంతో వేదవ్యాస మహర్షిని దర్శించారు. వేదవ్యాసుడు శ్రీ విద్యారణ్యుని బదరికా వనానికి తీసుకువెళ్లి శ్రీ దేవతాస్వరూపాన్ని, సేవించే విధానాన్ని, సమస్త మంత్ర రహస్యాలను బోధించి, శృంగికి అన్న సంతర్పణ చేస్తే అభీష్టాలు సిద్ధిస్తాయని ఆశీర్వదించి, అంతర్ధానం చెందారు. అనంతరం విద్యారణ్యస్వామి శృంగితో మాతంగ పర్వతం చేరి తుంగభద్రానదీ తీరంలో విరూపాక్షదేవుని సన్నిధిలో ఉండిపోయారు.

వేదవ్యాసుని మార్గంలో సమస్త విద్యలను అభ్యసించిన శ్రీ విద్యారణ్య స్వామి వేద భాష్యం, ధాతువృత్తి వంటి గ్రంథాలు రచించారు. ఇంకా, జీవన్ముక్తి వివేకం, వేదాంత పంచదశి, బృహదారణ్యక వార్తికసారం, ఐతరేయ, తైత్తిరీయ ఉపనిషద్దీపిక, శంకరుల అపరోక్షానుభూతి దీపిక, అనుభూతి ప్రకాశిక, దృగ్దృశ్య వివేకం వంటి కృతులను రచించి ఆదిశంకరాచార్య తరువాత అద్వైత వాఙ్మయ సాహిత్యంలో ప్రముఖులయ్యారు. ఆయన 1346లో కాశీగంగా తీరంలోని కేదార్ ఘాట్ వద్ద చంద్రమౌళీశ్వర లింగాన్ని ప్రతిష్ఠించి పూజిస్తూ ఉండేవారని శాసనాలవల్ల తెలుస్తోంది.

వైదిక ధర్మరక్షణ కోసం కంచి, శృంగేరీ పీఠాలు మాత్రమే చాలవని భావించిన

విద్యారణ్యులు ఆంధ్ర ప్రాంతంలో విరూపాక్ష పుష్పగిరి పీఠాలు, కర్ణాటకలోని శివగంగ, ఆమని పీఠాలు, మహారాష్ట్రలో సంకేశ్వరం, కొల్హాపురం పీఠాలు స్థాపించి హిందూ ధర్మ ప్రతిష్ఠాపన చేసి అనంతరకాలంలో ఛత్రపతి శివాజీ గురువు సమర్థ రామదాసుకు ఆదర్శనీయులయ్యారు.

శృంగేరీ జగద్గురు పరంపరలో 12వ పీఠాధిపతిగా 1380-1386 మధ్యకాలంలో వ్యవహరించిన శ్రీ విద్యారణ్యస్వామి 26-5-1386న క్షయనామ సంవత్సర జ్యేష్ఠ బహుళ త్రయోదశి శనివారంనాడు పరమపదాన్ని అలంకరించారు.

జ్ఞాపకశక్తి, తపశ్శక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి - ఈ నాలుగు శక్తులు సమ్మేళన స్వరూపమైన శ్రీ విద్యారణ్యులు ఒక తపస్విగా, ఒక మహాయోగిగా, సామ్రాజ్య నిర్మాతగా, వైదిక ధర్మోద్ధారకుడుగా, వేదశాస్త్ర వ్యాఖ్యాతగా, వివిధ సంప్రదాయాల సామరస్య సంధాతగా, ప్రాచీన స్మృతులకు నవీన వ్యాఖ్యాతగా, రాజతంత్ర మర్మజ్ఞుడుగా, సకల శాస్త్రపారంగతుడుగా, సంగీత, సాహిత్య, శిల్పకళా పోషకుడుగా భగవదంశసంభూతుడు అనటం అతిశయోక్తి కాదు.

## 58. వేమన (1550 - 1650)

తెలుగు తెలిసిన ప్రతివాని గుండెలో ముద్రపడేలా పద్యంతో భాషా భావాలు రెండూ అర్థమయ్యేలా ప్రకృతిలోని ప్రతి సత్యాన్ని అనుభవపూర్వకంగా పండిత పామరులకు సైతం బోధించిన మహాయోగి, సంఘసంస్కర్త, మహావేదాంతి, నాథయోగి, మానవతావాది, మర్మజ్ఞాని, రసవాది, ఆయుర్వేద విజ్ఞాని, తంత్రవాది, ప్రజాకవి - యోగి వేమన.

సమాజంలోని అసమానతలు, అంధ విశ్వాసాలు, అవినీతి, అధర్మం, జీవహింస వంటి ఎన్నో అత్యాచారాలు, అవకతవకలపై పద్యంతో దండెత్తిన మహాకవి, శతక వాఙ్మయంలో సంచలన సృష్టికర్త - వేమన. అంతే కాదు ఆయన తత్వవేత్త, హేతువాది, లోకాయతవాది-కూడా. పామరులకు సైతం తత్త్వబోధను ప్రజల భాషలో చెప్పటానికి ఉద్యమించిన వేమన శివయోగి, రాజయోగి, అవధూతయోగి.

కొండవీటి రెడ్డి రాజుల పరివారంలోని వాడైన వేమన మొదట వేశ్యాలోలుడై, తరువాత విరాగి అయినాడని కొందరి అభిప్రాయం. కాగా ఆయన సామాన్య కాపు కుటుంబంలో జన్మించినట్లు కొందరు చెబుతారు.

తాను నమ్మిన, తనకు తెలిసిన విషయాలన్నింటినీ నిర్భయంగా ప్రపంచానికి తెలిపిన సాహసి-యోగి వేమనకు యోగిగా కంటే కవిగానే అధిక ప్రశస్తి లభించింది. వేమన కవిత్వంలో హాస్యం, అధిక్షేపం, వ్యంగ్యం దర్శనమిస్తాయి తిక్కన కంద పద్య, శ్రీనాథుని సీసపద్యం కంటే వేమన ఆటవెలది అనే చిన్న వృత్తంలో కేవలం మూడు పాదాల్లో అనంత భావాలను యతి స్థానాలు వదలక నీతి ప్రబోధం చేసిన ఒక కవితా యోగి-వేమన.

వేమన వ్రాసిన వేలాది పద్యాలలో కేవలం శతకరూపంలో మాత్రమే నేడు పద్యాలు లభిస్తున్నాయి. 'గంగిగోవు పాలు గరిటెడైనను చాలు', 'ఇంటిలోని పోరు ఇంతింత కాదయా',

ఆకలన్న వాని కన్నంబు బెట్టిన', 'ఎఱుకలేని దొరల ఎన్నాళ్ళు గొలిచిన', 'నిన్ను జూచుచుండ నిండును తత్త్వంబు' - ఇలా నానుడులు, సామెతల రూపంలో తిట్లు, దీవెనలు సమ్మిళితం చేసి తెలుగు దేశమంతటా విశ్వదాభిరాముడైన వేమన పద్యాలు కొన్ని 5వ శతాబ్ధంలో బద్దెన కవి రచించిన 'సుమతీ శతక' నీతులకు దగ్గరగా ఉన్నాయి.

'ఆ కొన్న కూడెయమృతము' - సుమతీశతక పద్యం 'ఆకలన్న వాని కన్నంబు బెట్టిన', 'రాపొమ్మని పిలువని', 'అడిగిన జీతంబియ్యని'-సుమతీ శతక పద్యాలు. 'ఎఱుకలేని దొరల ఎన్నాళ్ళు గొలిచిన'... ఇలాసాగాయి.

సుమతీ శతకంలో ఎక్కువగా కరణాల ప్రసక్తి ఉండగా వేమన శతకంలో ఎవరినీ విడిచి పెట్టలేదు. 'ఎంతసేవజేసి ఏ పాటు పడినను రాచమూక నమ్మరాదురన్న' - అని ఆనాటి పాలకులను దుయ్యబట్టాడు. 'ఎంచెరు మతమందు నెనగ మాంసముదిని, మారుపేరు పెట్టి మధువు త్రావి, వావివరుస దప్పి వలికి పాలౌదురు' అని వైష్ణవులను, 'లింగధారికన్న దొంగలు లేరని' శైవులను సమానంగా విమర్శించాడు. 'అప్పలేని వాడె అధిక బలుడు'...అని, 'తప్పలెన్ను వారు తమతప్పలెరుగరు' అంటూ లోకధర్మాన్ని తెలిపాడు. 'బుద్ధి చెప్పినవాడు గ్రుద్దిన నేమయా', చెరుకు రసము కన్న చెలి మాట తీపిరా!', 'తలలు బోడులైన తలపులు బోడులా', 'అలవికాని చోట అధికులమనరాదు!' వంటి నానుడులు, సామెతలు, నీతి బోధలు చేశాడు. 'చదువులందు, పాడి మొదవులందు, స్త్రీల పెదవులందు, రాజ్య పదవులందు' అంటూ అను ప్రాసలతో అలరించి చదువరులను ఆకర్షించాడు.

అంతేకాక కొన్ని శాస్త్రగ్రంథాలతో పరిచయంతో ఆ శ్లోకాల ఆధారంగా పద్యాలు రచించి 'వేదవిద్యలెల్ల వేశ్యల వంటివి, భ్రమల బెట్టి తేటపడగనీవు, గుప్త విద్య ఒక టెకుల కాంత వంటిది' వంటి విమర్శనాత్మక సత్యాలను వెల్లడించాడు. 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' అనే ఉపనిషద్వాక్యాన్ని ' మర్మమెరుగలేక మతముల గల్పించి, యుర్వి దుఃఖులగుదు రొకరికొకరు, గాజు ఇంట కుక్క కళవళపడు రీతి' అని భిన్న మతాల వాళ్ళ కలహాలను వివరించాడు.

శివసహస్ర నామాల్లో అభిరామ శబ్ధం శివ సంబంధంగా ఉంది. విశ్వదుడు అంటే లౌకిక అలౌకిక విశ్వాన్ని ఇచ్చేవాడు అని అర్థం కావటంతో విశ్వదుని పై అమిత భక్తి గల వేమనా అనే అర్థం వచ్చే 'విశ్వదాభిరామ వినుర వేమ' అనే మకుటంతో రాసిన పద్యాల ద్వారా ప్రజలను, సమాజాన్ని జాగృతం చేసిన మహాకవి, సంస్కర్త - వేమన.

శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి, వేమన సమ కాలీనులే. వారిలో వేమనయే పెద్దవాడు. వేమన కాలం 15-17 శతాబ్దాల మధ్య ఉండి ఉండవచ్చునని పరిశోధకులు భావిస్తున్నారు. అనంతపురం జిల్లా కదిరి తాలూక కటారు పల్లెలో వేమన పేరుతో సమాధి ఉంది. ప్రతిఏటా అక్కడ చైత్రమాసశుక్ల పక్షంలో వచ్చే మొదటి ఆదివారంనాడు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. అక్కడ వేమనకు గుడి కూడా ఉంది. అలాగే కడప, కర్నూలు, అనంతపురం

జిల్లాల్లో వేమన పీఠాలు కూడా ఉన్నాయి. ఇలా చిరస్మరణీయంగా వైభవం పొందుతున్న కవి యోగి శ్రేష్ఠుడు - వేమన.

## 59. పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వామి (1608 - 1693)

**జన్మత:** యోగ శక్తులతో ఉద్భవించిన మహా యోగి పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి. హఠ, రాజ, స్వర, మంత్ర, లయ యోగాలన్నీ కలసిన మహాయోగ సాధకుడు ఆయన చాలా విస్తృతంగా కాలజ్ఞానం వివరించిన అగ్రగణ్యుడు వీరబ్రహ్మేంద్ర స్వామి.

పరిపూర్ణాచార్యులు - ప్రకృతాంబల కన్న బిడ్డ కాగా, నందికొండ పాపఘ్ని మఠాధిపతి వీరభోజాచార్య, వీర పాపాంబలు భగవత్ప్రసాదంగా లభించిన ఆ బిడ్డను పెంచి వీరంభొట్లయ్య అని నామకరణం చేశారు. వీరంభొట్లయ్య 13 సంవత్సరాల వయస్సు వచ్చే నాటికే సకల విద్యల్లో నిష్ణాతుడయ్యాడు. తండ్రి వీర భోజాచార్యులు కాలధర్మం చెందగా వీరంభొట్లయ్య తల్లిని ఓదార్చి ముక్తి మార్గాన్ని నిర్దేశించి పిండోత్పత్తి క్రమాన్ని, జీవుని చతుర్ధశ లక్షణాలు చెప్పి, సాంఖ్య తారకామస్క యోగాలు బోధించి తన విశ్వ రూపం ప్రదర్శించి పోయాడు. తల్లి అనుమతితో తీర్థయాత్రలు చేస్తున్న హరిహర క్షేత్రం వద్ద వీరంభొట్లయ్యకు పొరపాటున గోహత్య చేసిన ఆనంద్ సింగ్ అనే రాజ కుమారుడు ఆనంద యోగిగా మారి తారసిల్లాడు. అతనికి వీరంభొట్లయ్య ద్వాదశీ మహామంత్రాన్ని ప్రసాదించి శాప విముక్తి మార్గాన్ని సూచించారు. ఆ ఆనంద భైరవ యోగియే మరు జన్మలో దూదేకుల సిద్ధయ్యగా పుట్టి బ్రహ్మంగారి శిష్యుల్లో అగ్రగణ్యుడయ్యాడు. వీరంభొట్లయ్య తీర్థ యాత్రలు కొనసాగిస్తూ కర్నూలు జిల్లా బనగాని పల్లె చేరాడు.

బనగాని పల్లెలో మహా జ్ఞాని గరిమిరెడ్డి అచ్చమ్మ వద్ద వీరప్పయ్య పేరుతో వీరంభొట్లయ్య గోపాలకుడుగా చేరాడు. అడవిలో ఆవులు మేస్తుండగా వీరప్పయ్య రవ్వల కొండ గుహలో కూర్చుని కలియుగం 4808 సంవత్సరాల తరువాత జరుగబోయే కాలజ్ఞానం వ్రాసేవాడు. అలా వ్రాసిన కాలజ్ఞానం తాళ పత్రాలను అచ్చమ్మ ఇంటివద్ద పాతరలో బద్రపరిచాడు. ఆ తాటాకుల పాతర మీద కొన్ని దినాలకొక చింత చెట్టు మొలిచింది. అది ఈ నాటికీ ఉంది. వీరప్పయ్య అచ్చమ్మ వద్ద 12 ఏండ్లు ఉన్నాడు.

వీరప్పయ్య మఠంలో ఉంటూ భక్తులకు జ్ఞానోపదేశం చేస్తుండగా ఒకనాడు అన్నాజయ్య అనే బ్రాహ్మణుడు రాగా అతనికి కాలజ్ఞానం (ద్వితీయాశ్వాసం) బోధించి నారాయణాష్టాక్షరి మంత్రాలుపదేశించాడు. ఆ అన్నాజయ్యే కాల జ్ఞానాన్ని ప్రచారంలోకి తెచ్చాడు.

కడపజిల్లా బద్వేలు తాలూకా కందిమల్లయ్య పల్లె గ్రామం చేరి వీరప్పయ్య వడ్రంగం, కమ్మరం వృత్తితో జీవిస్తూ తన వద్దకు జ్ఞానబోధ చేసేవారు. హస్త స్పర్శతో మృతుని బ్రతికించి మహిమ చూపిన వీరప్పయ్యకు ఆ గ్రామంలోని శివకోటయ్య తన కూతురు గోవిందమ్మను

వీరప్పయ్యకిచ్చి వివాహం చేశాడు. అప్పటి నుండి వీరప్పయ్య పేరు వీరబ్రహ్మంగా మారింది. వీరబ్రహ్మం గోవిందమ్మ దంపతులు తీర్థయాత్ర చేసి తిరిగి కందిమల్లయ పల్లె చేరే సరికి అక్కడి భక్తులు వీరబ్రహ్మం కోసం ఒక మఠాన్ని నిర్మించారు. ఆ మఠంలో వీరబ్రహ్మం తనను ఆశ్రయించిన వారికి అభీష్టాలు తీరుస్తూ సుజ్ఞానాన్ని బోధించేవారు.

ముస్లిం సిద్ధయ్యను శిష్యుడుగా స్వీకరించి బ్రహ్మోపదేశం చేసి తారకయోగం, పంచముద్రలు బోధించారు. అనంతరం శిష్య సమేతతంగా రాయలసీమ, కోస్తా ఆంధ్రా, తెలంగాణాలలో పర్యటించి అనేక మహిమలు చూపారు.

వీరబ్రహ్మం సమాధి కాబోయే ముందు భార్యకు, కుమారులకు సంసార స్వరూపం, గోవిందాచారికి హంసస్వరూపం, ఛాయా పురుష లక్షణాలను బోధించి గోవిందాచారిని మఠాధిపతిగా చేసి పట్టాభిషేకం చేశారు. సిద్ధయ్యకు 'అచల పరిపూర్ణం' బోధించి దివ్య దృష్టి ప్రసాదించి విశ్వరూప దర్శనమిచ్చారు. సిద్దయ్యకు తన యోగ దండం, పాదుకలు, శిఖాముద్రిక, చేతికర్ర ఇచ్చి శ్రీ ముఖ సంవత్సర వైశాఖ శుద్ధ దశమి శుక్రవారం (5-5-1693)న సమాధిలోకి వెళ్ళి పోయారు. అప్పటి నుండి ప్రతి యేటా వైశాఖ శుద్ధ దశమి లగాయతు వారం రోజుల పాటు స్వామి ఆరాధనోత్సవాలు, శివరాత్రికి కళ్యాణోత్సవం, నరనంది ఉత్సవం మూడు రోజుల పాటు జరుగుతాయి.

వేమన మాదిరిగా వీరబ్రహ్మం కూడా తమ భావాలను ప్రజలకు అర్థమయ్యే రీతిలో తేట తెలుగులో పద్యాలుగా, పాటలుగా పాడి జాగృతం చేసిన ఆశుకవి. ఆయన రచించిన కాలజ్ఞానంలో 12 అశ్వాసాలు వచన కాలజ్ఞానంకాగా రెండు అశ్వాసాలు సౌజన్య పత్రికలు ముద్రితాలు. ఇంకా జీవైక్యబోధ, ద్విపదకాల జ్ఞానం, 287 పరమహంస కాళికాంబ పద్యాలు, కాలజ్ఞాన గోవింద వాక్యాలు (326 పద్యాలు), తత్వాలు కలియుగాంతానికి జరుగబోయే చారిత్రక, భౌగోళిక, సామాజిక, ధార్మిక సంబంధ విషయాలు కాలజ్ఞానంలో వివరించారు. విదేశీ తెల్లదొరల పాలన, వర్ణాశ్రమ, ఆచార సంకరం, నవీన నాగరికత, సులభమైన వేగవంతమైన ప్రయాణ సాధనాలు, విద్యుద్దీపాలు, మహాత్మాగాంధీ నాయకత్వం, రాష్ట్రం ప్రాశస్త్యం, వితంతు వివాహాలు, విడాకులు, అగ్రవర్ణాల అధోగతి, పంచముల ఉన్నతి, బూటకపు సన్యాసులు, త్రాగుబోతులు, గుండాల స్వేచ్ఛ, విహార, ఆర్థిక సామాజిక రంగాల్లో భేదాలు, పోయి సర్వసమానత్వం రావటం వంటి అనేక విషయాలను ప్రస్తావించారు.

త్రికాలవేది, బ్రహ్మజ్ఞాని వీరబ్రహ్మేంద్రస్వామి ఏ యుగంలోనూ ఆరాధ్యుడే.

## ౬౦. శ్రీపాద శ్రీ వల్లభులు (1323 - 1344)

కర్దమ ప్రజాపతి కుమార్తె అనసూయ, బ్రహ్మమానస పుత్రుడు అత్రిమహర్షుల కోరికపై వారికి త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల సంయుక్తాంశతో జన్మించిన కుమారుడు దత్తాత్రేయుడు. ఆయన జీవులకు మోక్షేచ్ఛ, ధర్మనిష్ట కలిగించడానికి సద్గురు రూపంలో

అవతరించిన భగతత్త్వమే దత్తాత్రేయుడు. ఆయన గురువులకు గురువు, పరమగురువు సచ్చిదానందస్వరూపుడు, అభీష్టాలు తీర్చే యోగం, జ్ఞానం ప్రసాదించే పరమగురువు.

కాగా, దత్తాత్రేయుని రెండవ అవతారం శ్రీ శ్రీ పాదవల్లభులు. బౌద్ధ యుగంలో పిష్టపురంగా ప్రసిద్ధికెక్కిన నేటి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం అగ్రహారంలో సుమతి, అప్పలరాజు శర్మ అనే బ్రాహ్మణ దంపతుల ఇలవేలుపు అయిన దత్తాత్రేయస్వామివారి భక్తికి మెచ్చి వరమిచ్చిన ప్రకారం (6-8-1323)లో భాద్రపద శుక్ల చవితి (వినాయక చవితినాడు) పుత్రుడుగా జన్మించారు. తల్లిదండ్రులు ఆ బిడ్డ ముఖ వర్చస్సు, పాదాల్లోని దివ్య చిహ్నాలు, శరీరం గమనించి శ్రీ పాదుడు అని నామకరణం చేశారు. శ్రీ పాదునికి 8వ ఏటనే తల్లిదండ్రులు ఉపనయనం చేయగా ఆ వయస్సులోనే ఆయన వేదవేదాంగాలు సమస్త విద్యలు కంఠస్థంగా అభ్యసించారు.

శ్రీపాదునికి 16 ఏండ్ల వయస్సు రాగానే తండ్రి రాజుశర్మ వివాహ ప్రయత్నాలు చేస్తుండగా తాను మనవ కన్యను పెండ్లాడబోనని, లౌకిక వివాహం తనకు వద్దనీ, యోగశ్రీని వరించానని చెప్పడంతో వారు మిక్కిలి దుఃఖించారు. శ్రీ పాదుడు తన యదార్థ రూపంలో వారికి ప్రత్యక్షమై జ్ఞానోపదేశం చేసి వారికి మోక్షం లభించేలా వరం ఇచ్చారు. తల్లిని తాను ప్రత్యక్షమైన రూపాన్నే ధ్యానించమని కోరిన శ్రీపాదుడు తల్లిదండ్రులకు మూడుసార్లు ప్రదక్షిణం చేసి వారి అనుమతితో సన్యసించి పాదచారియై తీర్థక్షేత్ర యాత్రకు బయలుదేరారు. యోగ శ్రీవల్లభుడైనందున అప్పటి నుండి ఆయన పేరు శ్రీపాద శ్రీవల్లభుడుగా మారింది.

శ్రీపాదశ్రీవల్లభులు ముందుగా ద్వారకా బృందావనం, కాశీ, బదరీ మొదలైన ఉత్తరదేశ యాత్రలు చేసి పశ్చిమ తీరాన గల మహాబలేశ్వర క్షేత్రం చేశారు. ఆత్మలింగ రూపంలో పరమశివుడు వెలసిన ఆ పుణ్యక్షేత్రంలో మూడేళ్ళుండి శ్రీశైలం వెళ్ళారు. అక్కడి నుండి బయలుదేరి నివృత్తి సంగంలో స్నానం చేసి కృష్ణ-వేణి రెండు నదులు కలిసే చోట కృష్ణానది మధ్యలో ఉన్న కురువపురం అనే చిన్న ద్వీపం చేరారు. అక్కడి చిన్న కురువపురంలో ఒక ఎత్తైన పెద్ద బండను పైకెక్కి కలయజూచి అక్కడికి మూడు కిలో మీటర్ల దూరంలో ఉన్న పెద్ద కురువపురంను తన తపో క్షేత్రంగా నిర్ణయించుకుని శ్రీపాదులు అక్కడ స్థిర పడ్డారు. నేటికీ అక్కడ శ్రీపాదుల ప్రార్థనా మందిరం, అందులో నిర్గుణ పీఠంపై వారి పాదుకలు, సమీపంలో అశ్వత్థ, మర్రి, మేడి చెట్లు ఉన్నాయి.

కురువపురంలో ఆయన ఎన్నో కరుణాద్భుతలీలలు ప్రదర్శించారు. కొలిచిన వారికి కొంగు బంగారమై, తలచినవారికి ఆర్తత్రాణ పరాయణుడై, సజ్జనులకు నిజరూపంలో సాక్షాత్కరిస్తూ అందరికీ ఆరాధ్యుడైన శ్రీపాదవల్లభులు తారణనామ సంవత్సరం ఆశ్వయుజ బహుళ ద్వాదశి సోమవారం 4-10-1344 న దేహం చాలించారు. శ్రీపాద వల్లభులు అవతారం చాలించేందుకు కొన్ని నెలల ముందు ఒక చాకలికి తురక రాజుగా పుట్టే వరమిచ్చి తాను నరసింహసరస్వతిగా అవతరించి కలుసుకుంటానని మాట ఇచ్చారు. అదే ప్రకారం ఆయన 1369లో నరసింహసరస్వతిగా జన్మించి 1459లో దేహం చాలించారని పండితులు

భావిస్తున్నారు.

శ్రీపాదవల్లభుల దత్త సంప్రదాయం నేటికీ ఆరాధ్యనీయం కాగా ఎందరో మహా యోగుల కురువపురం తపోక్షేత్రమైంది. ఈ కురువపురం ఆంధ్ర ప్రదేశ్‌లోని మహబూబ్‌నగర్ జిల్లా సరిహద్దు కర్ణాటక ప్రాంతంలో రాయచూరు జిల్లా కేంద్రానికి 20 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇప్పటికీ ఆ తీర్థ స్థలంలో ప్రతిఏటా వినాయక చవితినాడు శ్రీపాదుల జయంతి, ఆశ్వయుజ బహుళ ద్వాదశి (గురుద్వాదశి) నాడు గుప్త దివసం, మార్గశిర శుద్ధ చతుర్ధశి నాడు దత్తజయంతి, మాఘ బహుళ పాడ్యమినాడు దత్తాత్రేయుల మూడవ అవతారమైన నరసింహ జయంతి ఉత్సవాలు వైభవంగా జరుగుతున్నాయి.

కలియుగంలో నాథ సంప్రదాయానికి చెందిన గోరక్షనాథునికి దర్శనమిచ్చి అవధూతగీత గురుగీత బోధించినట్లు మన చారిత్రక కాలంలో జ్ఞానేశ్వర్, తుకారాం, చక్రధర్‌లకు దర్శనం ప్రసాదించిన దత్తాత్రేయుడు మొత్తం 16సార్లు భూమిపై అవతరించ జ్ఞానబోధ చేశాడు. మార్కండేయ, స్కాంద, భాగవత పురాణాలు, కాశీఖండం వంటి గ్రంథాల ద్వారాను, శాండిల్యోపనిషత్ లోనూ దత్తాత్రేయుని ప్రస్తావన ఉంది. భక్తవత్సలుడు దత్తమూర్తి ద్వితీయ అవతారమే శ్రీపాద శ్రీవల్లభులు.

## 61. నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రులు (1788 - 1907)

అజ్ఞానాంధకారంలో అలమటించేవారికి జ్ఞాన నేత్రాలను ప్రసాదించి ఇహపరాలను సుగమం చేసే దైవాంశ సంభూతులైన గురువులలో శ్రీ నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్ర నాధుడు ఒకరు. కర్ణాటక దేశంలో జన్మించి, ఆసేతు హిమాచలం యోగ భూములను సందర్శించి, సమస్త యోగ మార్గాలలో ఆరితేరి ప్రాంతీయ తారతమ్యాలు లేకుండా శిష్యులకు భక్తులకు జ్ఞాన భిక్ష పెట్టిన మహా యోగి నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రులు. మైసూరు రాష్ట్రం చిక్కమగళూరు తాలూకా దానమాస గ్రామంలో ఒక వైదికాచార సంపన, భక్తనిష్టా గరిష్ట కుటుంబంలో భాగీరథీ, గోపాల పండితులకు క్రీ.శ. 1788 కీలక నామ సంవత్సరం ఆషాఢ బహుళ షష్టి శనివారం నాడు జన్మించిన శిశువుకు నంజుండయ్య అని నామకరణం చేశారు. ఐదవయేట అక్షరాభ్యాసం చేయించారు. నంజుండయ్య 12 ఏళ్ళకే ఆనాటి పండితులచే అసమానమేధావి అని ప్రశంసలందుకున్నారు.

ఆ కాలంలో శ్రీ రామానంద ఘనేంద్రులు అనే యోగి దివ్య దృష్టితో నంజుండయ్య మేధా సంపదను గ్రహించి, దాన మాసంలోని గోపాల పండితుని ఇంటికి వచ్చి తల్లికి ఒక కాగితం ఇచ్చి అదృశ్యమయ్యారు. ఆ కాగితం చదివిన నంజుండయ్యలో వైరాగ్యం కలిగి శ్రీరామానందుని కోసం అన్వేషించి చాముడేశ్వరి కొండ గుహలో సమాధి నిష్ఠలో ఉన్న ఆయనను చేరారు. అక్కడ కొన్ని సంవత్సరాలు గురు శుశ్రూష చేసి ఆయన బోధించిన యోగాలన్నింటినీ సాకల్యంగా అభ్యసించారు. అప్పటి నుండి ఆయన పేరును సచ్చిదానందుడుగా మార్చారు.

అనంతరం గురు దీవెనలతో దానమాసకు చేరి కొంత కాలం తల్లి దండ్రులను సేవించి వారి అనుమతితో శ్రీశైలం వెళ్ళి అక్కడ భ్రమరాంబా మల్లికార్జులను దర్శించి పాతాళ గంగ సమీపంలోని ఒక గుహలో 24 సంవత్సరాలు యోగాభ్యాసము, కఠోర తపస్సు చేసి పూర్ణహఠయోగ సిద్ధులయ్యారు. అణిమాద్యష్ట సిద్ధులు, ఘుటికాపాదుకా గమనాగమలు పరకాయ ప్రవేశ విద్యలు కరతలామలకం చేసుకున్నారు. తరువాత ఆసేతు హిమాచలం యోగ భూములు, పుణ్య క్షేత్రాలు తిరుగుతూ ఆశ్రయించిన వారికి వివిధ యోగాలు నేర్పారు. ఈ విధంగా ఆయన 60 సంవత్సరాల యోగ జీవితం గడిపారు. 1890లో బళ్ళారిజిల్లా విరూపాక్ష క్షేత్రానికి సమీపంలోని గౌరీపురం చింతామణి పీఠానికి భక్తుల కోరికపై పట్టాభిషిక్తులయ్యారు. అప్పటి నుండి స్వామి దీక్షానామం శ్రీ సచ్చిదానంద నీలకంఠ సదానంద చింతామణిగా మార్చుకున్నారు. ఆయన తనకు గల శక్తులను తమ కోసం ఎన్నడూ వాడుకోని మహాయోగి. ప్లవంగ నామ సంవత్సర కార్తీక బహుళ దశమి శనివారం 30-11-1907 మధ్యాహ్నం 12 గంటలకు తమ 119 వ యేట దేహం చాలించారు.

సచ్చిదానంద మఠంలో ప్రతి యేటా చైత్ర మాసంలో శ్రీ రామ కళ్యాణోత్సవం, ఆశ్వయుజమాసంలో శరన్నవరాత్రి ఉత్సవాలు, కార్తీక బహుళ దశమి నాడు ఆరాధనోత్సవాలు ఇప్పటికీ జరుగుతున్నాయి.

## 62. తుంగదుర్తి బుచ్చయ్య (1760-1854)

పూర్వజన్మలో బ్రహ్మవిద్యా సాధన ఫలితంగా మరు జన్మలో యోగసిద్ధిని గడించి, గురూపదేశంతో సకల శాస్త్రపారంగతులై అతి చిన్న వయసులోనే అష్ట సిద్ధులు హస్తగతం చేసుకున్న యోగి తుంగదుర్తి బుచ్చయ్య. ఆయన బాల్యం నుంచి పరమపదించే వరకు గుంటూరు జిల్లా నర్సారావుపేట తాలూకాలోని చేజెర్ల కపోతేశ్వర స్వామి ఆలయంలోనే జీవితం గడిపి ఆనంద నామ సంవత్సర భాద్రపద బహుళ పాడ్యమి గురువారం 7-9-1854న బ్రహ్మైక్యం చెందారు.

శ్రీ కపోతేశ్వర క్షేత్ర చరిత్ర ప్రకారం ఆయన జీవితం గురించి తెలుస్తోంది. కరణకమ్మ వైదిక బ్రహ్మణుడైన బుచ్చయ్య విద్యా శూన్యుడై బాల్యం నుండే వ్యవసాయం చేస్తూ ఉండేవారు. ఒకసారి మేఘాల మల్లికార్జున స్వామి కొండ సమీపంలో భూమి దున్నుతుండగా దాహం వేసి ఆ కొండ గుహల్లోనికి నీటి కోసం వెళ్ళిన బుచ్చయ్య నాలుకపై అక్కడ ఉన్న ఒక ఋషి బీజాక్షరాలు వ్రాసి మధుమతి విద్యను ఉపదేశించాడు. ఆనాటి నుండి బుచ్చయ్య కవి, జ్ఞాని, మహిమాన్వితుడు అయ్యారు.

బుచ్చయ్య శ్రీగిరికి వెళ్ళి అక్కడ ఆరేళ్ళు నిద్రాహారాలు మాని ఘోర తపస్సు చేస్తూ, వారానికో, 15 రోజులతో సమాధి నుంచి బయటకు వచ్చి కాయ కసరులు తినేవారు. ఏడవ సంవత్సరం తన జన్మ స్థలం కురిచేడు గ్రామం ప్రవేశించి ఒక దేవాలయం చేరారు. అనంతరం చేజెర్లకు

వెళ్లి కపోతేశ్వరుని దర్శించి, అక్కడ నుంచి శ్రీశైలం వెళ్లి తపస్సులో నిమగ్నమయ్యారు. శ్రీశైల భ్రమరాంబ ఆయనకు సాక్షాత్కరించింది. ఆ సమయంలో ఆమె బింబం కదలడంతో బుచ్చయ్య తన తపోమహిమతో ఆ బింబాన్ని యథాస్థానంలో పునః ప్రతిష్ఠించారు. ఇప్పుడు శ్రీశైలంలో అర్చనలు జరుగుతున్న భ్రమరాంబ బింబం బుచ్చయ్య ప్రతిష్ఠించినదే. అంబ ఆదేశంతో చేజెర్ల కపోతేశ్వరాలయంలో దేవీ ప్రతిష్ఠ చేశారు. ఆయనకు ఆకాశ గమనాది సిద్ధులు బాల్యంలోనే అలవడటం వల్ల సంకల్పం చేతనే ఎన్నో పుణ్యక్షేత్రాలు దర్శించి వచ్చేవారు.

ఆయన సహజ పండితుడు. తెలుగు, సంస్కృత భాషల్లో ఆధ్యాత్మిక భావాలతో అనేక గేయాలు తన్మయులై పాడుతూ ఉండేవారు. ఆయన రచించిన కపోతేశ్వరాష్టకాన్ని బ్రాహ్మణ సమారాధన సందర్భాల్లో పాడుతూ ఉంటారు.

## 63. పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి (1710-1800)

గృహస్థాశ్రమాన్ని పాటిస్తూ రాజయోగం ద్వారా జీవన్ముక్తుడైన తెలుగు దేశాన్ని, తెలుగు భాషను పునీతం చేసిన బ్రహ్మనిష్ఠుడు పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి తెలుగు భాషలో అనుపమానమైన వేదాంత గ్రంథం, సీతారామాంజనేయ సంవాదం అనే ప్రకరణ గ్రంథాన్ని రచించారు. ఆయన వరంగల్ జిల్లా ఈదులవాయలో పరశురామ పంతుల రామమూర్తి, తిమ్మాంబ దంపతులకు జన్మించారు. అంబాల గ్రామంలో విద్యాభ్యాసం చేశారు. గ్రంథ రచనచేసి యోగవిద్యనభ్యసించిన గ్రామ వరంగల్లులోని మట్టెవాడ. ఆయనకు మొదటి గురువు తారక యోగ సిద్ధుడైన కుసుమనారాయణుడు, రెండవ గురువు మహాదేవగురుడు.

లింగమూర్తి రతిమన్మథ విలాసము, జీవన్ముక్తి ప్రకరణము, నారద పరమేష్ఠి సంవాదము, సాంఖ్యయోగము, తారకయోగము, మానస శతకము, సీతపాట, ఆత్మరామ శతకము, గోవింద శతకము, పంచరత్నములు, సీతారామాంజనేయ సంవాదం (తెలుగు వేదాంత సాహిత్య గ్రంథం) మొదలైన గ్రంథాలు రచించారు. "శాంతరస పోషణలో, కావ్యశైలిలో లింగమూర్తి పోతనకు దీటుగా నిలిచారు.

లింగమూర్తి బాల్యంలో మట్టెవాడకు సమీపంలోని ఈదులవాయ గ్రామం గుట్టల్లో తిరుగుతూండగా మహాదేవయోగి అనే మహాత్ముడు రామ మంత్రోపదేశం చేశాడని, లింగమూర్తి ఆగుట్ట గుహల్లో తపస్సుచేసి మంత్రసిద్ధిపొంది, గురువు అనుగ్రహించిన షట్చక్ర సీతారాములను ఇంటిలో ప్రతిష్ఠించుకున్నట్లు తెలుస్తోంది.

ఇదిలా వుండగా లింగమూర్తి బాల్యంలో అంబాల గురుకులంలో సంస్కృత ఆంధ్రభాషలు బాగా అభ్యసించి యౌవనంలో 'రతిమన్మథ విలాసం' అనే శృంగార కావ్యం రచించినట్లు, అనంతరం కుసుమనారాయణుడు అనే సాలె కుటుంబానికి చెందిన గృహస్థు వద్ద తారకయోగం నేర్చుకుని, ఆధ్యాత్మిక గ్రంథ పఠనంతో విరాగి అయ్యాడైనట్లు కొందరి కథనం.

లింగమూర్తి రామగిరి కొండల్లో తపస్సు చేసి బ్రహ్మవిద్యను అనుభవంలోకి తెచ్చుకున్న

తరువాత శ్రీరామచంద్రుడు బ్రాహ్మణ రూపంలో ప్రత్యక్షమై బంగారు రామమాడను, స్ఫటిక వినాయక విగ్రహాన్ని, మరకత లింగాన్ని, షట్చక్ర సాలగ్రామాన్ని, సీతారాముల విగ్రహాలను అనుగ్రహించి వానిని ఒకే స్థానంలో వుంచి ఇంట్లోనే పూజించమని, ఏడు తరాల వరకు ఆ ఇంటిలోనే వుండి శుభాలు చేకూరుస్తానని వరమిచ్చి అంతర్ధానమయ్యాడు. ఆ ఇల్లు నేడు శిథిలమైనా ఆయన పూజించిన పంచాయతనం దర్శనమిస్తోంది. ఆయన సమాధి మట్టెవాడ మెయిన్‌రోడ్డుకు ఉత్తర దిశలోని దేశీరావు తోటలో వుండేది. ఇప్పుడు కనపడంలేదు. అక్కడ శ్రీరామనవమికి ప్రతిఏటా ఉత్సవాలు మాత్రం జరుగుతున్నాయి.

## 64. నారాయణతీర్థులు (1580 - 1680)

సంగీత త్రిమూర్తులలో ప్రథముడైన త్యాగరాజ స్వామి గురువు శొంఠి వెంకట రమణయ్య, ఆయన తండ్రి వెంకట సుబ్బయ్యలకు గురువు నారాయణ తీర్థులు గొప్ప విష్ణుభక్తుడు, సిద్ధ పురుషుడు. ఆయన భక్తి పారవశ్యంతో చేసే సంకీర్తనకు శ్రీ కృష్ణ పరమాత్ముడు ప్రత్యక్షమయ్యేవాడట. తన గురువు రామానందునికి పరమాత్మ సాక్షాత్కారం చేయించిన సిద్ధ పురుషుడు నారాయణ తీర్థుడు. ఆయన వరహూరు వెంకటేశ్వరాలయంలో శ్రీ కృష్ణలీలా తరంగిణి గానంచేస్తూ అభినయించగా హనుమంతుడు తాళం వేసేవాడట.

నారాయణ తీర్థుల అసలు పేరు గోవింద శాస్త్రి. గులూరు జిల్లా కాజ గ్రామంలో గాంధర్వ దేవుడనే బిరుదుగల తల్లావర్ఝుల నీలకంఠ శాస్త్రి, పార్వతి దంపతులకు 1580 ప్రాంతంలో జన్మించారు. గోవింద శాస్త్రి ఆజన్మభక్తుడు. బాల్యం నుండే సంగీత సాహిత్యాలలో గొప్ప ప్రతిభను ప్రదర్శించేవారు. గురువు వాసుదేవశాస్త్రి వద్ద సంస్కృత సాహిత్యాన్ని ఆమూలాగ్రంగా ఆకళింపు చేసుకున్న ఏక సంథాగ్రాహి గోవిందశాస్త్రి విద్యార్థిగా ఉన్నప్పుడు కూడా ఎక్కువ సమయం గ్రామం చివర ఒక చెట్టు నీడన ఏకాంతంగా భగవద్ధ్యానంలో భక్తి రచనలు చేస్తూ తన్మయుడై పాడుకుంటూ ఉండేవాడు. గోవిందశాస్త్రి 12 ఏళ్ళు గురుకులంలో సమస్త శాస్త్రాలు అభ్యసించారు.

ఒకసారి భార్య పుట్టింటికి వెళ్ళగా, గోవిందశాస్త్రి అమరునాడే ఆమె వద్దకు వేదాద్రి వెళ్ళడానికి బయలు దేరారు. కృష్ణానదిని దాటుతుండగా వరద వచ్చి ప్రాణాపాయం ఏర్పడటంతో ఆపత్సన్యాసం తీసుకున్నారు. వెంటనే ఏదో ఆధారం దొరకడంతో అవతలి గట్టుకు ఈది అత్తవారిల్లు చేరుకున్నారు. అక్కడ అత్తగారికి అల్లుడుగాను, భార్యకు మతీశ్వరుని గాను కనిపించడంతో భార్య అడుగగా ఆపత్సన్యాసం తీసుకున్న వివరం చెప్పారు. అప్పడాయన భార్య పరమార్థ జీవితంలోని గొప్పతనాన్ని వివరించి సన్యాసాశ్రమ స్వీకారానికి అంగీకరించింది. గోవింద శాస్త్రి కాశీ వెళ్ళి శివరామానంద తీర్థులు అనే ప్రసిద్ధ యతికి శిష్యుడయ్యారు.

శివరామానంద తీర్థులు గోవిందశాస్త్రి పాండిత్యం, భక్తి వైరాగ్యాలకు తృప్తి చెంది సన్న్యాసదీక్ష, నారాయణ తీర్థులు అనే దీక్షానామం ప్రసాదించారు. నారాయణ తీర్థులు కాశీలోనే గోపాల సరస్వతి అనే మరొక యతీశ్వరుని వద్ద వేదాంత గ్రంథాలు అభ్యసించారు.

నారాయణ తీర్థులు కాశీనుంచి తిరిగి వస్తూ గోదావరి జిల్లా కూచిమంచి అగ్రహారంలో మూడు సంవత్సరాలుండి అక్కడ నుంచి కృష్ణా జిల్లా కూచిపూడి వచ్చారు. అక్కడ సిద్దప్ప అనే శిష్యుడు ఆయనను సేవించి ఆశ్రమం స్వీకరించి సిద్ధేంద్రయోగిగా మారి కూచిపూడి నాట్య సంప్రదాయకర్త అయ్యాడు. అక్కడి నుండి గుంటూరు జిల్లా వెల్లటూరు చేరి అక్కడ 'శ్రీ కృష్ణ లీలా తరంగిణి' అనే సంస్కృత యక్షగానాన్ని రచించారు.

నారుయణతీర్థులు శ్రీ కృష్ణలీలా తరంగిణి, శాండిల్య భక్తి సూత్ర వ్యాఖ్య, భక్త్యధికరణమాల హరిభక్తి సుధార్ణవం వంటి భక్తి రచనలు చేశారు. ఇవిగాక సాంఖ్య కారికావ్యాఖ్య సాంఖ్యతత్త్వ కౌముదీ వ్యాఖ్య, న్యాయ కుసుముంజలీటీక, న్యాయ ముక్తావళీటీక, భాట్టభాషా ప్రకాశం, యోగసూత్ర వ్యాఖ్య, సిద్ధాంత బిందుః, లఘుచంద్రికా, వేదస్తవటీక, వేదాంత విభావనాటీక, పంచకోశ మంజరి వంటి వేదాంత, న్యాయశాస్త్ర గ్రంథాలు సంస్కృతంలో రచించారు. పారిజాతాపహరణం అనే యక్షగానాన్ని తెలుగులో వ్రాశారు.

శ్రీ మద్భాగవతంలోని దశమ స్కంధ పూర్వ భాగంలో రుక్మిణీ కళ్యాణం దాకా ఉన్న కథను 12 అంకాలుగా విభజించి 156 కీర్తనలతో 'శ్రీ కృష్ణలీలా తరంగిణి' యక్షగానంలో సకల వేదాంత సారం ఇమిడి ఉన్నట్లు విజ్ఞులు పేర్కొన్నారు. సగుణనిర్గుణ పరబ్రహ్మ తత్త్వాన్ని బోధించే శక్తి విద్యా శంకరుల తరువాత తీర్థులకే లభించిందని ప్రసిద్ధి.

నారాయణతీర్థులు తిరుప్పందురుత్తి చేరి ఒక మామిడి చెట్టునీడన ధ్యాన నిష్ఠలో కొంత కాలం గడిపి ఆ చెట్టుకు దక్షిణ దిశలో సజీవ సమాధి అయ్యారు. అక్కడ ఆనాడు నారాయణ తీర్థులు ప్రారంభించిన ఉట్ల పండుగ ఈనాటికీ శ్రీ కృష్ణాష్టమి రోజున జరుపుకుంటారు. నారాయణ తీర్థుల ఆరాధనోత్సవం అక్కడ 6 రోజుల పాటు వైభవంగా జరుపుకుంటున్నారు.

## 65. ప్రకాశానంద స్వామి (1871 - 1962)

ఆంధ్రదేశంలో జన్మించి, గుజరాత్, సౌరాష్ట్ర కచ్, రాజస్థాన్ లలో పూజలందుకుని అక్కడే దేహం చాలించిన అవధూత ప్రకాశానంద స్వామి. విజయనగరం ప్రాంతంలోని ఒక గ్రామంలో వెలనాటి వైదిక కుటుంబంలో వెంకట్రామయ్య, గౌరమ్మలకు జన్మించిన సంతానానికి అనంతయ్య అని పేరు పెట్టారు. అనంతయ్యకు 8వఏట తండ్రి 19వ యేట తల్లి చనిపోయారు. తాత లక్ష్మీనరసింహం, నాయనమ్మ మీనాక్షమ్మ అతనికి ఉపనయనం చేసి ఫర్ద్ ఫారం వరకు చదివించారు. 15వ ఏట అనంతయ్య బడి చదువులు మాని సంస్కృతం, జ్యోతిషం నేర్చుకున్నాడు. అనంతయ్యకు వివాహం చేయడానికి సంకల్పించి తాంబూలాలు పుచ్చుకున్నాక

పెండ్లి కాకముందే వధువు చనిపోవడంతో అనంతయ్యలో వైరాగ్యం, జ్ఞాన తృష్ణ పెరిగింది. వాటిని గమనించిన ఆంగ్ల ఉపాధ్యాయుడు, గొప్ప వేదాంతి అయిన దత్తయ్య పంతులు 'తగిన గురువు లభిస్తాడని' ధైర్యం చెప్పారు.

అనంతయ్య మంచి గురువు కోసం అన్వేషిస్తూ 16వ ఏట ఇల్లు విడిచి వెళ్ళి పోయి 1887 జనవరి 14 న బెల్గాం పట్టణం చేరాడు. అక్కడ గొప్ప వేదాంతి, ఉత్తమ ఉపదేశకుడు అయిన డిప్యూటీ కలెక్టర్ లల్లూ భాయి గోవర్ధన దాసు పరిచయం కావడడంతో ఆయన వద్ద యోగ వాసిష్ఠాది వేదాంత గ్రంథాలు పఠించారు. అనంతయ్యకు సన్యసించాలన్న సంకల్పం ఉన్నట్లు చెప్పగా లల్లూభాయ్ సన్యాసంలో కష్టనష్టాలు చెప్పినివారించారు. దృఢ సంకల్పంతో పట్టు వీడని అనంతయ్య గురువు గారి అనుమతితో తీర్థయాత్రలు చేస్తూ తిరుమలలో స్వామి పుష్కరిణిలో స్నానం చేసి స్వయంగా ప్రేమ మంత్రం ఉచ్చరించి శిఖ, యజ్ఞోపవీతం తీసివేశారు. తిరుపతి నుండి మద్రాసుకు పోయి అక్కడ బుచ్చయ్య పంతులు వద్ద భాష్యంతో సహా ఉపనిషత్తులు చదువుకుని అక్కడి నుండి నాసిక్, అక్కడి నుండి హరిద్వారం వెడుతూ, దారిలో మహావైయాకరణి అమరేశానందుల వద్ద సిద్ధాంత కౌముది, వ్యాకరణ మహాభాష్యం చదువుకున్నారు. అమరేశానందులే అనంతయ్యకు 'ప్రకాశానంద స్వామి' అని పేరు పెట్టారు. ప్రకాశానంద స్వామి ఋషీకేశంలో శ్రీసుఖానంద స్వామి వద్ద హఠయోగ ప్రక్రియలు నేర్చి గుజరాత్‌లోని నడియార్ చేరి అక్కడ సంత్‌రాం గుడిలో ప్రమేయ గ్రంథాలు చదువుకున్నారు. ప్రకాశానందులు ఆశ్రమం స్వీకరించిన తరువాత 15 ఏళ్ళ పాటు గురువు లల్లూ భాయిని సేవించారు. ఆయన పరమపదించిన తరువాత ప్రకాశానంద స్వామి సర్వసంగ పరిత్యాగియై వందల కొలది శిష్యులు, జిజ్ఞాసువులకు ఉపదేశామృతం అందించి 40వ ఏట ఆత్మ సాక్షాత్కారం పొందారు. ఆయన త్రికాలజ్ఞులనటానికి ఎన్నో సంఘటనలున్నాయి. ప్రకాశానంద స్వామి ముముక్షువుల కోసం అనేక గ్రంథాలు రచించారు. వాటితో ఆయన అపార పాండిత్యానికి, బ్రహ్మవిద్యాపారమ్యాకి నిదర్శనమైన 'వార్తాలాపం' గ్రంథం. ఇంకా సంతగురు పరిచయం, ఆపణోధర్మ (మనధర్మం), ధర్మజ్యోతి, సప్తశ్లోక గత ఆయన రచించగా గుజరాతీ భాషలో ప్రచురణకు నోచుకున్నాయి. అనేక ప్రాంతాలు దర్శించి ద్వారకలో దేహం చాలించటానికి సంకల్పించి 15-1-1962న అక్కడికి చేరారు. 23-2-62 నస్వామి ఆత్మ పరమాత్మలో కలిసి పోయింది. ఆరోజు ప్లవనామ సంవత్సర మాఘ బహుళ చవితి శుక్రవారం. ఆయన భౌతికంగా లేకపోయినా ఇప్పటికీ ఆయన భక్తులు, శిష్యులు అనుభవిస్తున్నారు. స్వామి వారి శిష్యులకు అది యాత్రాస్థలం.

## 66. వాడరేవు లలితానంద సరస్వతి (1886-1951)

లోక కళ్యాణం కోసం దేవతాంశల రూపంలో జన్మించిన ఎందరో సత్పురుషులు, యోగులలో స్కందాంశ (సుబ్రహ్మణ్యస్వామి అంశ) గా అవతరించిన లలితానంద సరస్వతి

ఒకరు. నాడీ గ్రంథాల్లోని నంది నాడి ద్వారా ఆయన సుబ్రహ్మణ్య అవతారంగా వ్యయనామ సంవత్సర వృశ్చిక మాస బహుళ షష్ఠి, మంగళవారం శ్రవణ నక్షత్రంలో 17-11-1886 న జన్మించినట్లు తెలుస్తోంది. మేలు వళక్కూరు గ్రామాధికారి కాకర్ల వెంకట నరసు సోమయాజులు అనే ములికినాటి బ్రాహ్మణుడు లలితానందుని తన సోదరి భర్త అని, ఇద్దరు బిడ్డలు కలిగిన తరువాత సన్యసించారాని, ఆయన పూర్వ నామం రామస్వామి అని చెప్పడంతో ఆయనను అరవదేశంలో స్థిరపడిన ములికినాటి ఆంధ్ర బ్రాహ్మణుడుగా నిర్ణయించారు. కాగా గోదావరి జిల్లా పోలవరానికి చెందిన కరి అప్పన్నపంతులు లలితానందుడు తమ సోదరుడని చెప్పగా, తంజావూరు జిల్లా అధిరాంపట్నం వాసి సయ్యద్ మరక్కాయరు స్వామి తమ సోదరుడుగా ప్రకటించుకున్నారు. విశాఖజిల్లా జయపురంలో ఒక క్రైస్తవ వనిత, మరొక క్షత్రియ స్త్రీ ఆయనను తమ భర్తగా చెప్పడంతో ఆయన అన్ని రూపాలలో అందరికి ఆప్తుడైనట్లు తెలుస్తోంది.

లలితానందులకు మేలువళకూరు సమీపంలోని పశుమల కొండ గుహలు, తనియల గ్రామంలో కైలాసనాథేశ్వర అఖిలాండేశ్వరి ఆలయం, ఆంధ్రదేశంలో చీరాల సమీపంలోని వాడరేవు తపోవిహార స్థలాలుగా వుండేవి. ఆయా ప్రదేశాలలో ఆయన ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. ఆధివ్యాధులు నయం చేసేవారు. అలా తిరిగి తిరిగి 1940 విక్రమనామ సంవత్సరంలో పశుమల చేరి గుహలో దిగంబరంగా నిరంతర సమాధిలో ఉండగా పొన్నూరుకు చెందిన డాక్టర్ తంగిరాల సీతారామయ్య దంపతులు, కొసరాజు నాగయ్య 1941లో స్వామికి పశుమల మఠం కట్టించారు.

లలితానందు సరస్వతి సనాతన వైదిక ధర్మోద్ధరణ కోసం, ధర్మప్రచారం కోసం యజ్ఞాలు, మంత్ర, అనుష్ఠాన వేదాంత బోధ వంటి కార్యక్రమాలు చేపట్టారు. పశుమల, తనియల వాడరేవుల్లో ఏడాది పొడవునా ఏవో యజ్ఞాలు చేయించేవారు. ఆయన దేహాభిమాన రహితులై కేవలం సాక్షిమాత్రులుగా ఉంటూ పరబ్రహ్మానుభవం సాధించిన జీవన్ముక్తులు. సన్మార్గ ప్రవర్తన, ధర్మానుష్ఠానం, వైరాగ్యాలే సత్యాన్వేషణకు మార్గాలని బోధించి ఎన్నో యజ్ఞాలు నిర్వహించిన లలితానంద స్వామి ఖరనామ సంవత్సర కార్తీక బహుళ దశమి శనివారం 24-11-1951న పశుమలలోని ఆయన మఠంలో ఆయన ఉన్న గదిలోనుండి ఒకజ్యోతి వెలువడి ఆకాశం వైపుగా వెళ్లింది. తలుపులు తెరచిచూస్తే ఆయన దేహం చాలించారు. భక్తులు విధివిధానంగా ఆయనను సమాధి చేసి దానిపై మందిరం నిర్మించి నర్మదాలింగం ప్రతిష్ఠించారు. ఆయన పేరిట లలితానంత భక్త సమాజం ఏర్పడింది. లలితానందుడు సత్యం, శాంతం, సహనం, ఉపకారబుద్ధి కలిగి వుండాలని ఇతరుల నెపములుంచరాదని, జపతపాలు చేస్తూ పరుల బాధల్లో పాలు పంచుకోవాలని బోధించారు. మతాలు, జాతులు మరచిపోవాలని, ధనంతో పదవులతో అబద్ధాలు, వ్యసనాలు తగవని, పేదలను ఈసడించవద్దని, గురువులను మరవవద్దని ప్రబోధించిన మహాపురుషుడు ఆయన

'కవిలో దుష్టపథానువర్తనమే సత్యర్యంబటం చెంచి లో
కులు నాశంబగుటం మదిందలచి లోకోద్ధారణార్ధంబుకే
వల సన్యాసివిగా జనించితివె దేవా ! దేవసేనాపతీ
లలితానంద సరస్వతీ ప్రథితం సుబ్రహ్మణ్య దివ్యాకృతీ !

## 67. సద్గురు జగనాథస్వామి (1885 - 1974)

త్రికరణ శుద్ధిగా దైవానికే అంకితమయ్యే దివ్య మానవులను పుష్టి జీవులు అంటారు. ఆ కోవకు చెందిన సద్గురువు కోట జగన్నాథస్వామి. ఆయన పార్థివ సంవత్సర శ్రావణ శుద్ధ విదియ మంగళవారం 11-8-1885 ఒంగోలు పట్టణంలో కోటి సుబ్బయ్య, కామమ్మ అనే వైశ్య దంపతులకు జన్మించారు. పసికందుగా ఉన్నప్పడే ఉయ్యాలలో యోగాసనాలు వేసేవారు. ఆరేళ్ల వయస్సులో తల్లిదండ్రులు చనిపోగా చేబ్రోలు రెడ్డి పాలెంలో మేనమామ యింట పెరిగారు. ఒకసారి జగన్నాథస్వామి ఆడుకుంటూండగా కేశవరాజ యోగీంద్రులు సూక్ష్మ రూపంలో ఆయనను ఆకాశమార్గంలో తీసుకుపోయి శ్రీశైలం గుహల్లో దింపారు. అక్కడి మహర్షులు ఆయనకు పరకాయ ప్రవేశం వంటి మహా విద్యలు నేర్పారు. త్రిమూర్తులు ప్రత్యక్షమై మానవలోకంలో దేవాలయాలు నిర్మించి భక్తి ప్రచారం చేయ వలసిందిగా ఆదేశించారు. ఆమేరకు ఆయన అనేక చోట్ల భక్తి ప్రచారాలు, మంత్రోపదేశాలు చేశారు. ఉత్తర, దక్షిణ దేశ యాత్రలు చేశారు. పొన్నూరులో సహస్ర రామలింగేశ్వరాలయం కట్టించారు. దశావతార దేవాలయం నిర్మింపచేశారు. యుక్త వయసు రాగానే ఆయనకు చెంచమ్మతో వివాహం జరిగింది. కొద్దికాలంలోనే ఆమె చనిపోగా కోటిరత్నమ్మతో రెండవ వివాహం చేసుకున్నారు. ఒక ఆడబిడ్డ జన్మించిన తరువాత జగనాథ స్వామి ఆనందాశ్రమం చేరుకున్నారు. ఒక యేడాదికే భార్య చనిపోవడంతో గురువుల ఆదేశం మేరకు సీతమ్మను కుమార్తె సీతమ్మతో బాపట్ల చేరారు. ఆనందాశ్రమంలో ఉంటుండగా శ్రీశైల యాత్రకు వెళ్లి కొండలెక్కుతూ కాలు జారి లోయలో పడ్డారు. ఐతే దెబ్బ తగులకుండా ఒక మహర్షి ఒడిలో పడగా ఆ మహర్షి స్వామి నాల్కపై బీజాక్షరాలు వ్రాశారు. ఇలా ఎన్నో గండాలు గడిచి శక్తులు సమకూరగా ఎన్నో అద్భుతాలు ప్రదర్శించిన జగన్నాథస్వామి ఆనందనామ సంవత్సర భాద్రపద బహుళ నవమి మంగళవారం 10-9-1974న శరీర త్యాగం చేశారు. ఇప్పటికీ ఆయన ఆరాధనోత్సవాలు ప్రతి ఏటా భాద్రపద బహుళ నవమినాడు బాపట్లలో జరుగుతున్నాయి.

## 68. నార్పల తిక్కయ్య స్వామి (1870 - 1924)

సద్గురువుల అనుగ్రహానికి పాత్రులైన వారికి జనన మరణాలను సైతం అధిగమించేందుకు అవసరమైన సదసద్వివేకం, భక్తి వైరాగ్యాలు, జ్ఞానం, తద్వారా మోక్షం లభిస్తాయి. కష్టనష్టాలను అధిగమించి కోరికలు నెరవేర్చుకోగల శక్తి ఏర్పడుతుంది. అటువంటి సద్గురువు చేళ్ల గురికి

ఎఱ్ఱితాతాను సేవించి తరించిన ఆదర్శ శిష్యుడు నార్పలతిక్కయ్య స్వామి. గురువునే భగవంతుడుగా ఆరాధించి గురువుగా మారిన తిక్కయ్య సహజకవి.

ఆయన 1904లో చేళ్ళ గరికిలో హజాము భీమణ్ణ పొలంలో ఉన్న ఎఱ్ఱి తాతను దర్శించి ఆయనను గురువుగా త్రికరణశుద్ధిగా నాలుగేళ్ళ పాటు సేవించి 1908 లో ఒక మఠం నిర్మించి గురువును అందులో ప్రవేశ పెట్టారు. గురువు ఆ దేశంపై 1909లో తిక్కయ్య స్వామి ఆ మఠం విడిచి పెట్టి వెళ్ళి అజ్ఞాతం లో ఉండిపోయారు. 1920లో తిక్కయ్య స్వామి అనంతపురం మండలం నార్పల గ్రామం వచ్చి దక్షిణంగా నడిచి దుగమరి గ్రామానికి ఉత్తర దిశలో గల దత్తాత్రేయ మందిరంలో కొంత సేపు ఉండి అక్కడి నుంచి సుల్తాన్ పేట గ్రామంలోని ఒక వరిపొలం చేరారు. ఆ పొలం యజమానిని నంద్యాం తిమ్మారెడ్డిని పేరు పెట్టి పిలిచారు. అందుకు ఆశ్చర్య పడిన తిమ్మారెడ్డి నినార్పల గ్రామంలో తన ఇంట్లోనే వసతి, భోజన వసతి సౌకర్యాలు కల్పించారు. ఆ గ్రామంలో అన్ని వర్గాలవారు శ్రీమంతులు, పేదలు, స్వామిని ఆదరించి గౌరవించేవారు. ఆయన నార్పల గ్రామంలో ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. అణిమాది అష్టసిద్ధులు ఆ మహాత్మునికి కరతలామలకం.

ఒకనాడు ఒక వెండి రూపాయను స్వామి శక్తి కొలది విసరగా అది దట్టంగా అలముకొన్న బ్రహ్మ జెముడు డొంకలో పడింది. ఆ స్థలంలో తను సిద్ధి పొందిన తరువాత శరీరాన్ని భూస్థాపితం చేయవలసిందిగా భక్తులను ఆదేశించారు. రక్తాక్షి సంవత్సర చైత్ర శుద్ధ షష్టి గురువారం 10-4-1924 న తిక్కయ్య కుండలిని భేదించి బ్రహ్మైక్యం చెందారు ఆయన కోరిన చోటనే భక్తులు ఆయనను సమాధి చేశారు. 1925లో తిమ్మారెడ్డి ఆ సమాధిపై మఠ మందిరాన్ని నిర్మించి నిత్యపూజాకైంకర్యాయి ఏర్పాటు చేశారు. సమాధి పై తిక్కయ్య స్వామి ఇత్తడి శిరము, దానిపై నాగుంద్రుని పడగ స్థాపించి పూజిస్తున్నారు. దావ్యలలో ఏటేటా చైత్రశుద్ధ పంచమి నుండి మూడు రోజులు ఉత్సవాలు జరుగుతాయి.

## 69. పుదుక్కోట జడ్జిస్వామి (1850 - 1915)

(రెండవ సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి)

ఆంధ్రదేశంలో జన్మించి మద్రాసు హైకోర్టులో ప్రసిద్ధ న్యాయవాదిగా పేరుపొంది, తిరువాన్కూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అయి అకస్మాత్తుగా అవధూత అయిన జడ్జి స్వామి విశాఖపట్నంలో వేదమూర్తిశాస్త్రి అనే వేద పండితుని కుమారుడుగా జన్మించారు. శిశువు జాతకం పరిశీలించిన దైవజ్ఞులు అతనికి పరివ్రాజకయోగం ఉన్నట్లు తెలిపారు. తండ్రి వద్దనే తెలుగు సంస్కృతం నేర్చుకున్నారు. వేదంతో పాటు ఇంగ్లీషు విద్య కూడా అభ్యసించడానికి మద్రాసు చేరి న్యాయ శాస్త్రం చదివి పట్టా అందుకున్నారు. కొంతకాలం జూనియర్ న్యాయవాదిగా పని చేసి స్వతంత్రంగా ప్రాక్టీస్ ప్రారంభించి అనతి కాలంలోనే మంచి పేరు గడించారు. తండ్రి వేదమూర్తి శాస్త్రి శేషజీవితం గడుపు కోవడానికి భార్యా

సమేతంగా కాశీ వెళ్ళిపోయారు.

జడ్జి స్వామి లాయరుగా న్యాయ సమ్మతమైన కేసులు మాత్రమే చేపట్టి సత్యం, ధర్మం కోసమే పాటుపడ్డారు. తన వాద పటిమను న్యాయం కోసమేకాని ధనం కోసం వినియోగించలేదు. ఒక ప్రక్క వేదాధ్యయనాన్ని కొనసాగిస్తూనే 20 ఏళ్ళు గడిపారు. ప్రతి కేసును లోకాచారం, శిక్షాస్మృతుల్లోని చట్టం, స్థానికాచారం, కుటుంబాచారం ఈ నాల్గు కోణాలతో విచారించి తీర్పులు చెబుతూ ఆరు సంవత్సరాలు తిరువాన్కూరు హైకోర్టు జడ్జిగా పనిచేశారు. ఒకసారి చట్టం ప్రకారం ఒక అమాయకునికి మరణ దండన విధించవలసి వచ్చిన పరిస్థితిలో సత్యాన్వేషణ కోసం భార్యాబిడ్డలను, పదవిని విడిచి. సర్వస్వంత్యాజించి అడవులలో ప్రయాణం చేస్తూ కరాచిలోని ఉపనిషణ్మరం చేరుకున్నారు. అక్కడ ఐదేళ్ళపాటు 1899 వరకు ఉపనిషత్తులలోని సత్యసారాన్ని అన్వేషిస్తూ అధ్యయనం చేశారు. శ్రీ రామకృష్ణావధూత స్వామి ఆజ్ఞ మేరకు దిగంబరంగా నెరూరు వెళ్ళి క్కర సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి సమాధి వద్ద కొంతకాలం తపస్సు చేసి హిమాలయాల వైపు పయనించారు. ఋషీకేశంలో కొంతకాలం తపస్సు చేశారు.

తన శరీర త్యాగానికి సమయం చేరువలో ఉన్నదని ముందుగానే గుర్తించిన జడ్జిస్వామి పుదుక్కోటకు సమీపంలోని నర్తమలై చేరి అక్కడ ఉన్న చోళరాజుల కాలపు ప్రాచీన శివాలయంలో ఉంటూ తపస్సు చేసుకునేవారు. బ్రహ్మ తేజస్సుతో వెలుగుతున్న స్వామిని ఆ గ్రామ ప్రజలు స్వామిని పల్లకిలో పుదుక్కోటకు తీసుకు వెడుతూండగా పల్లవ సరస్సు చేరేసరికి జడ్జిస్వామి ప్రాణహంస అనంత విశ్వచైతన్యంలోకి ఎగిరిపోయింది. జడ్జిస్వామి సమాధి కోసం మార్తాండ భైరవ తొండమాన్ చక్రవర్తి పుదుక్కోట నగరానికి తూర్పున ఇచ్చిన విశాలమైన స్థలంలో స్వామిని విధి విధానంగా సమాధి చేశారు. ఈ అధిష్ఠానంలో కొంతకాలం నిత్య పూజలు జరిగేవి. కొంతకాలం ఆ సమాధి నిర్లక్ష్యానికి గురైనా, ఆయన శిష్యులు ఆ అధిష్ఠానం ప్రాంగణంలో భువనేశ్వరీ దేవి విగ్రహ ప్రతిష్ఠ శారిమడంతో ప్రస్తుతం ఆ ప్రాంతం భువనేశ్వరీ నగరంగా విలసిల్లుతూ సమాధి మందిరం అభివృద్ధి చెందుతోంది. జడ్జిస్వామి అసలు పేరు తెలియదు. శ్రీ కాళహస్తిలో గురువు రామకృష్ణావధూత మాత్రం రెండవ సదాశివ బ్రహ్మేంద్రుడు అన్నారు. ప్రస్తుతం జడ్జిస్వామి అధిష్ఠాన సమాది దక్షిణ భారత దేశంలో ఒక గొప్ప ఆధ్యాత్మిక కేంద్రంగా అలరారుతోంది.

## 70. ఎల్లారెడ్డిపేట హజ్రత్ ఇమామలీ బాబా (1825 - 1934)

మహిమోపేతమైన యోగులలో కరీంనగర్ జిల్లా ఎల్లారెడ్డి పేటకు చెందిన హజ్రత్ ఇమామలీ బాబా ఒకరు. ఆయన కరీంనగర్ జిల్లా గంభీరావు పేటలో 1825 ప్రాంతంలో జన్మించినట్లు చరిత్రకారులు ఊహిస్తున్నారు. 110 సంవత్సరాలు జీవించి 1934లో

మరణించిన ఇమామలీ కొంతకాలం బడి పంతులుగా పనిచేశారు. గృహస్థ జీవితం గడిపారు.

1908లో మూసీ వరదలు సంభవించిన సమయంలో ఇమామలీ గంభీరావు పేట సమీపంలోని మానేరునదికి గల నామాపురం గట్టు చరియలో తపస్సు చేస్తూండగా ఆ గట్టు మునిగి పోయింది. తపోనిష్ఠలో ఉన్న ఇమామలీ చరియలో పూడుకు పోయారు. వరదలు తగ్గిన తరువాత ఇసుక తోడగా యోగనిష్ఠులై బయట పడిన ఇమామలీ చెక్కు చెదరకుండా బయట పడటంతో ఆయన యోగ మహాత్మ్యం పరిసర గ్రామాలకు, దూర ప్రాంతాలకు పాకింది. ఎల్లారెడ్డి పేట పొలిమేరలో ఎక్కువగా తిరుగుతున్న ఇమామలీని గుర్తించి ఆ గ్రామ పటేలు పాపారెడ్డి ఆయన భక్తుడై ఆధ్యాత్మిక సేవ చూస్తూ రెండంతస్తుల పెద్ద మేడ నిర్మించి ఇచ్చాడు. ఆయన ఆ మేడలోనే ఉంటూ పరిసర అడవులలో తిరిగి వచ్చేవారు. ఆయన భక్తులలో ఎక్కువ మంది హిందువులే కావడం విశేషం. ఆర్తులు, భక్తులు, ఆశ్రితులు వస్తే వారు చెప్పకముందే వారి కష్ట సుఖాలు చెప్పేవారు. అలా దాదాపు 110 సంవత్సరాల దీర్ఘకాలం తన మహిమలతో ఆర్తులను ఆదుకుని 1934 జూలై 2, భావనామ సంవత్సరం జ్యేష్ఠ బహుళ పంచమి గురువారం నాడు దేహం చాలించారు. ఆ రోజున ఈనాటికీ ప్రతి ఏటా గొప్ప ఉర్సు ఉత్సవం జరుగుతుంది. ఆయన సమాధి కూడా నేడు ఆశ్రితుల కష్టాలను తీరుస్తోంది.

## 71. యల్లంపల్లె పుల్లయ్య అవధూత (1920-1983)

రాయలసీమలోని కడపజిల్లా దిగువ నేలటూరులో చంద్రవం భట్రాజ దంపతుల ఓంకార వెంకటరాజు, లక్ష్మమ్మ దంపతులకు మూడవ సంతానం. 1920లో జన్మించిన వెంకటరాజరాజు అనంతర కాలంలో పుల్లయ్యస్వామి అయ్యారు. వెంకటరాజరాజును వెంకట రాజయ్య అని కూడా పిలిచేవారు. దిగువ నేలటూరులోనే విద్యాభ్యాసం సాగించిన వెంకట రాజయ్య తండ్రి వెంకట రాజు వద్దనే భారత భాగవత రామాయణాలు, ప్రబంధాలు చదువుకున్నారు. మధురమైన సుస్వరంతో త్యాగరాజకృతులు, భాగవత పద్యాలు పాడేవారు. ఆయన కొంతకాలం ఉపాధ్యాయుడుగా పనిచేశారు. అదేకాలంలో 1932లో పెండ్లిమర్రిపుల్లయ్య యోగి మహిమల గురించి వెంకట రాజయ్య వినడం తటస్థించింది. భాగవతం తీసుకొని రాజయ్య ఆయనను దర్శించి, ఉపాధ్యాయ వృత్తిని వదలి ఆయన శిష్యుడుగా చేరారు. ఆయన వద్ద ఉపదేశం పొంది 'పుల్లయ్య స్వామి' నామం స్వీకరించారు. వివాహాన్ని తిరస్కరించి అడవుల్లో, కొండలపై, శ్మశానాల్లో, పొలాల్లో ఎక్కడ పడితే అక్కడ సమాధి నిష్ఠులయ్యేవారు. ఆయనను సత్పురుషుడుగా గ్రహించి ఎందరో గ్రామీణులు పోటీపడి ఆయనకు ఆతిథ్యం ఇచ్చేవారు. మిట్టమానిపల్లె, యల్లంపల్లె పరిసర గ్రామాలవారికి ఆయన ఆరాధ్య దైవమయ్యారు. ఆయన ఎన్నో మహిమలు, లీలలు ప్రదర్శించారు. ఎందరో భక్తులు, శిష్యులు ఏర్పడ్డారు. రుధిరోద్గారి సంవత్సర ఆషాఢ శుద్ధ పాడ్యమి సోమవారం (11-7-1983)న యల్లంపల్లెలో పుల్లయ్యస్వామి

స్థూల శరీరం విడిచి విశ్వచైతన్యంలో విలీనమయ్యారు. భక్తులు విధి విధానోక్తంగా స్వామిని సమాధి చేశారు. పుల్లయ్య స్వామి ఆరాధనోత్సవాలు ఏటేటా యల్లంపల్లెలో ఆషాఢ శుద్ధ పాడ్యమినాడు వైభవంగా జరుగుతున్నాయి. సూక్ష్మరూపంలో స్వామి భక్తుల అభీష్టాలు నెరవేరుస్తూ ఆర్తులను ఆదుకుంటున్నారు.

## 72. విజయనగరం ఖాదర్‌వలీ బాబా (1900-1961)

సమస్త చరాచర సృష్టిని పరమేశ్వర ప్రసాదంగా భావించి, అందులోనే భగవంతుని దర్శించి, తమను నమ్మిన వారి కోసం ఎటువంటి కష్టాలనైనా సహించే గురువులు కొందరుంటారు. ఆ కోవకు చెందిన సద్గురువు విజయనగరం ఖాదర్‌వలీ బాబా. విజయనగరం ముస్లిం బస్తీలో మహమ్మదలీ, మహబూబ్‌బాబా దంపతుల జ్యేష్ఠ సంతానంగా వికారి సంవత్సర కార్తీక శుద్ధ చవితి మంగళవారం (23-11-1900) రోజున జన్మించారు. శైశవదశ నుంచే ఆయన శ్రీకృష్ణునివలె అద్భుత లీలలు ప్రదర్శించారు. ఆయన చదువు విజయనగరం రాజా వీధిలోని వీధి బడిలోను, లప్పన్ స్కూలులోను, మునిసిపల్ హైస్కూలు లోనూ సాగింది. రామాయణ, భారత, భాగవత కథలన్నింటిపై అవగాహన కుదిరింది. హిందూ ముస్లిం మతాచార్యులను ప్రశ్నలడిగి సందేహాలు తీర్చుకునేవారు, రెండు మతాల పండుగల్లో పాల్గొనే వారు. ఆయన దృష్టిలో పురుషులందరూ తండ్రులు, సోదరులు. స్త్రీలందరూ, తల్లులు సోదరీమణులు. తండ్రి ఆదేశం మేరకు ఖాదర్‌ఖాన్ ఉద్యోగం చేయకుండా నాగపూర్‌లోని తాజుద్దీన్ బాబాను కలిసి ఆయన సంపూర్ణ అనుగ్రహానికి పాత్రులయ్యారు. ఆయన తాజుద్దీన్‌కు నిజమైన వారసుడయ్యారు. విజయనగరం తిరిగి వచ్చి అక్కడ రాళ్ళు తవ్వేవారు. నిర్మించిన కుటీరంలో తపస్సు చేశారు. భగవదనుగ్రహంతో ఆయన ఏది చెపితే అది జరిగేది అన్నీ శుభాలే జరిగేవి. ఆయన ఎన్నో అద్భుతాలు, లీలలు ప్రదర్శించారు. హిందూ ముస్లిం క్రైస్తవులు అన్ని వర్గాల వారు బాబా సన్నిధికి వచ్చేవారు. క్రమంగా బాబా ఆశ్రమం సమీపంలో ఖాదర్‌నగర్ పేరిట ఒక గ్రామం రూపుదిద్దుకుంది. షిర్డీబాబా మాదిరిగానే ఖాదర్‌బాబా కూడా ఉపవాసాలు అంగీకరించలేదు. ఆత్మారాముణ్ణి సంతృప్తి పరచి పరమాత్మ కోసం ప్రయాణం సాగించాలనీ, జీవిత ప్రయాణంలో ప్రతి మనుష్యుడు శ్రమ, ప్రేమ అనే రెండు సూత్రాలు తప్పక పాటించాలనీ ఖాదర్‌బాబా బోధించేవారు. ఆయనకు విహారయాత్రలంటే ఇష్టం. ఆ యాత్రలలో శతాబ్దాలనాడు జరిగిన చరిత్రలను, విషయాలను ఆయన చెప్పేవారు. ఆయన సమాధి స్థితిలో దేహం విడిచి ఇతర లోకాలు తిరిగి వచ్చేవారు. ఆయా లోకాల విశేషాలు చెప్పేవారు. సూర్యమండల అవతల లక్షల మైళ్ళ దూరంలో మరో లోకంలో అరటాకు అంత పెద్ద చెవులు గల మనుష్యులున్నారని, మరో లోకంలో స్త్రీ పురుషభేదం, ఆకలి దప్పులు లేని 20-25 అడుగుల మానవాకారాలున్నాయని, నవగ్రహాలు దాటిపోతే నవకోటి కోట్ల గ్రహాలున్నాయని, మన శరీరాన్ని, ఇంద్రియాలను జయిస్తేనే వాటిని చూడగలమని, అందుకు సాధన అవసరమనీ వలీబాబా చెప్పేవారు. ఆయనకు ఆంధ్రదేశంలో 11చోట్ల శిష్యులున్నారు.

బాబాకు 7-10-1960న పక్షవాతం వచ్చి భీష్మఏకాదశి శుక్రవారం (27-1-1961) మధ్యాహ్నం 1-15 గంటల సమయంలో పరమపదించారు. బాబా కోరిక మేరకు శిష్యులు ఆయన శరీరాన్ని ఎర్రమట్టిదిబ్బ మీద విధివిధానంగా సమాధి చేశారు. ఈనాడు ఆ సమాధి అన్ని మతాల వారికి యాత్రా స్థలం.

## 73. నెల్లూరు నిత్యానంద స్వామి (1864-1936)

హిమాలయ పర్వతాల సమీపంలో డెహ్రాడూన్ ప్రాంతంలో సీస్మానదీ తీరంలో ప్రస్తుతం పాకిస్థాన్‌లో ఉన్న శాలికోట గ్రామంలో దయాంబాగాలూరాం దంపతులకు 7-8-1864 రక్తాక్షినామ సంవత్సర శ్రావణ శుద్ధ (గరుడ) పంచమి ఆదివారం నాడు జన్మించిన శిశువుకు పూర్ణారాముడు అని నామకరణం చేశారు. రెండేళ్ళ వయసులో తండ్రి చనిపోగా తల్లి పెంపకంలో పూర్ణా రామునికి లౌకిక విద్య ప్రాప్తించలేదు. శాలికోట దేవాలయంలో జరిగే ఆధ్యాత్మికోపన్యాసాలు పురాణ కాలక్షేపాలు శ్రద్ధగా వినేవారు. పూర్ణారాముడు 1876లో12వ ఏట తీవ్ర వైరాగ్యంతో ఇల్లు విడిచి పుణ్యతీర్థాలు తిరుగుతూ వసిష్ఠాశ్రమం చేరారు, హిమాలయ గుహల్లో 7 సంవత్సరాలు కేవలం తుంగగడ్డలు తింటూ కఠోర తపస్సు చేశారు. పూర్ణారామునికి ఒకనాడు గంగాతీరంలో బ్రహ్మనిష్ఠులైన కృష్ణానంద సరస్వతీయాంధ్రుల దర్శనమైంది. ఆయన పూర్ణారామునికి ప్రణవమంత్రం ఉపదేశించి సన్యాసదీక్షను నిత్యానంద సరస్వతి అనే దీక్షా నామాన్ని ఇచ్చారు. నిత్యానందులు గురువు అనుమతితో చాతుర్మాస్య దీక్ష కోసం కాశీవిశ్వేశ్వర సన్నిధికి చేరారు. తరువాత తిరిగి హిమగిరికందరాల్లో కఠోరతపస్సు చేసి ఆత్మ సాక్షాత్కారం పొంది దేశసంచారానికి బయలుదేరారు. అనంతరం రామేశ్వరయాత్రకు బయలుదేరి రోజుకు 30 మైళ్ళ చొప్పన నడుస్తూ 1894లో ఆంధ్రదేశంలోని నెల్లూరు పట్టణం చేరి అక్కడ స్థిర పడ్డారు. నెల్లూరు నవాబుపేట సమీపంలో పెన్నానదీ తీరంలో వేమూరి వారి మామిడితోటలో ఆశ్రమం ఏర్పాటు చేసుకున్నారు. అది ఒక వింత ఆశ్రమం. పెద్ద చెక్కపెట్టె ,దారు కుటీరం.

ఆయనకు అనేకమంది శిష్యులు ఏర్పడ్డారు. అణిమాద్యష్ట సిద్ధులు నిత్యానంద స్వామికి వశమైనా ఎన్నడూ ఆ సిద్ధులను ప్రదర్శించలేరు. ఎన్నోలీలలు, అద్భుతాలు ప్రదర్శించారు. యువనామ సంవత్సర పుష్య బహుళ అమావాస్య శుక్రవారం (24-1-1936) రోజున నిత్యానంద స్వామి శిష్యుడు హరిహరానంద స్వామి ఈశావాస్యోపనిషత్తు పఠించటం పూర్తికాగానే పద్మాసనస్థులై మూడు సార్లు బిగ్గరగా ఓంకారం చేసి దేహత్యాగం చేశారు. భక్తులు, శిష్యులు ఆయన పార్థివ శరీరాన్ని వెంకటగిరిలో కైవల్యనదీ తూర్పుతీరాన సమాధి చేశారు. ఏటేటా ఆరాధనోత్సవాలు వైభవంగా జరుపుతున్నారు.

## 74. పగిడ్యాల కృష్ణ బ్రహ్మేంద్రస్వామి (1850-1947)

మనశ్శక్తిని ఆత్మ శక్తిగా మలచుకొని సాధనా పటిమచే ఏకాగ్రత సాధించి అనేక యోగ విభూతులు కరతలామలకం చేసుకున్న రాజయోగి పగిడ్యాల కృష్ణ బ్రహ్మేంద్రస్వామి ప్రస్తుత

రంగారెడ్డి జిల్లా పరిగి తాలూకా గండీడు మండలం పగిడ్యాల గ్రామంలో భాగమ్మ, రామప్ప దంపతుల తృతీయ సంతానంగా జన్మించారు. ఆయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు కిష్టయ్య. కిష్టయ్యకు పుట్టుకతోనే భక్తి ప్రేమ, దయ వంటి సద్గుణాలతో జన్మించాడు. 4వ తరగతిలోనే విద్య చాలించి కులవృత్తి కమ్మరంలో తండ్రికి సాయంగా ఉండేవాడు. పన్నెండేళ్ల వయస్సులోనే తల్లిదండ్రులు హఠాత్తుగా చనిపోవడంతో అన్న చిన్నయ్య కిష్టయ్యకు నరసమ్మతో పెండ్లి చేశాడు.

సంసారంలో ఉంటూ సద్గురువును ఆశ్రయించి జన్మ రాహిత్యం చేసుకోవాలనే వాంఛతో యాలాల గ్రామంలో వుండే దొడ్డ ప్రభువును ఆశ్రయించి కిష్టయ్య చతుర్విధ శుశ్రూషలు చేసి ఆయనవల్ల మంత్రోపదేశం, యోగబోధ పొందారు. కృష్ణ బ్రహ్మేంద్రస్వామి అనే దీక్షానామాన్ని గురువు నుండి స్వీకరించి ఆయన ఆదేశం మేరకు ఏకాంతంగా మునులగుట్ట, చెన్నరాయనిగుట్ట, దొనగుట్ట, యానెగొందిగుట్ట, కోసగి కాళికాలయాలలో సాధన చేశారు. పన్నెండేళ్ళు దేశమంతా తిరిగి సాధుసంతులు చెప్పిన యోగ రహస్యాలు శ్రద్ధతో సాధించారు. అష్టసిద్ధులు ఆయనకు వశమయ్యాయి. గృహస్థ రాజయోగిగా ఉంటూ ఆశ్రయించినవారి కష్టాలు తీరుస్తూ, అర్హులైన శిష్యులకు మంత్ర, యోగాలు బోధిస్తూ సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు చేపట్టారు. ఎన్నో లీలలు, అద్భుతాలు ప్రదర్శించారు. ఆయనను అన్ని వర్ణాల హిందువులతో పాటు ముస్లింలు కూడా సేవించారు. కృష్ణ బ్రహ్మేంద్రస్వామి ప్రతి ఏటా దౌలతాబాద్ వెంకటేశ్వరస్వామి ఆలయంలో మాలమాదిగ కులాలకు చెందిన పేదజంటలకు సామూహిక వివాహాలు చేయించారు. ఇలా కృష్ణ బ్రహ్మేంద్రస్వామి 97 సంవత్సరాలు జీవించి సర్వజిత సంవత్సరం నిజ శ్రావణ పౌర్ణమి ఆదివారం (31-8-1947) రోజున యోగ ముద్ర ధరించి సమాధి స్థితులై కుండలినీ యోగంతో బ్రహ్మరంధ్రం ఛేదించుకుని దేహత్యాగం చేశారు. కొన్నాళ్ళు ఆయన ఆరాధనోత్సవాలు శ్రావణ పౌర్ణమినాడు జరిపిన భక్తులు, అది వానాకాలం కావటం వల్ల 1960 నుండి ప్రతి ఏటా మాఘశుద్ధ పంచమి నుండి మూడురోజులపాటు రథసప్తమి వరకు జరుపుతున్నారు. ఆయన సమాధి ఈనాటికీ సన్నుతించే భక్తులకు కొంగు బంగారం.

## 75. పలుగురాళ్ళపల్లె గోవిందస్వామి (1650-1750)

పుష్పగిరి పీఠాధిపతి విద్యానృసింహ భారతీస్వామి జన్మస్థలమైన కడపజిల్లా బద్వేలు పోరుమామిళ్ళ మార్గంలోని పలుగురాళ్ళ పల్లెలో 17, 18 శతాబ్దాల మధ్య కాలంలో ఒక వైదిక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన యోగి పుంగవుడు గోవిందస్వామి. ముడుమాల గ్రామంలో యాదాటి పార్వతమ్మ రామచంద్ర భట్టు అనే వైదిక బ్రాహ్మణ దంపతులకు గోవిందయ్య పెద్ద కుమారుడుగా జన్మించారు.

గోవిందయ్య శిశువుగా ఉన్నప్పుడే భావి మహత్త్వ లక్షణాలు కనిపించాయి. ఊయలలో

ఊగుతున్న గోవిందయ్య తలపైన ఒక ఘటసర్పం పడగవిప్పి గొడుగుపట్టింది. ఆ వయసులోనే ఆ ఊరి చెరువుగట్టున ఉండే బంకమట్టితో పళ్ళెంచేసి పంచవర్ణాల గులకరాళ్ళు పంచాయతనంగా అమర్చి తెల్లసుద్ద పొడి విభూతిగా, కావిరాళ్ళ పొడి కుంకుమగా, గడ్డివెన్నులు అక్షతలుగా, చెరువులోని అల్లిపూలు పూజాపుష్పాలుగా, ఆ చెరువునీళ్ళే అభిషేక జలంగా, పిచ్చుక గూడు టెంకాయగా, తుంగ గడ్డలు నైవేద్యంగా అర్పించి తీర్ధ ప్రసాదాలిచ్చి భక్తుల బాధలు పోగొట్టేవారు.

పెద్దవాడైన గోవిందయ్య తండ్రివద్ద స్మార్తము గరుడాద్రి సూరయ్య అనే సద్గురువు వద్ద మంత్రోపదేశం పొంది ముచికుంద గుహలో సాధన చేశారు. గోవిందయ్యకు యుక్త వయసులో లక్ష్మమ్మతో వివాహమైన తరువాత సంసారం చేస్తూనే కఠిన తపస్సు చేసి ఋతంభరాది యోగసిద్ధులు సాధించారు. కాశీ నుండి రామేశ్వరం పోయే యాత్రికులకు ఆతిధ్యమిస్తూ పదిమందికి సరిపోయే భోజనాన్ని అభిమంత్రించి నూరుమందికి సరిపోయేలా చేసేవారు. గోవిందయ్యకు ఎందరో భక్తులు, శిష్యులు ఏర్పడ్డారు.

గోవిందస్వామి అనేక అద్భుతాలు, మహిమలు ప్రదర్శించి 1750 లో మాఘశుద్ధ పూర్ణిమనాడు జీవసమాధి అయ్యారు. తాను దేహం చాలించే విషయం ముందుగానే చెప్పి కాశీ పోయి ఒక లింగం తెచ్చారు. గోవిందస్వామి మునిమనుమడు యాదాటి నర్సయ్య గోవిందస్వామి మఠం ఆవరణలో ఆ లింగాన్ని ప్రతిష్ఠించి ఆలయం నిర్మించాడు. ఆ దేవుని నర్మదేశ్వరుడు అమ్మవారి పేరు మీనాక్షి, నాటి నుండి ప్రతి ఏటా మాఘ శుద్ధ త్రయోదశి నుండి బహుళ తదియ వరకు మీనాక్షీనర్మదేశ్వరుల కళ్యాణోత్సవాలు, మాఘ పూర్ణిమ నుండి పాడ్యమి వరకు గోవిందస్వామి ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి.

## 76. రామడుగు శివరామ దీక్షితులు (1690-1791)

ఆంధ్రదేశంలోనే కాక భారత దేశంలోని 11 రాష్ట్రాల్లోనూ, విదేశాలలోను 'అచలమతం' 'అచలయోగం' పేరుతో ఒక కొత్త సంప్రదాయాన్ని ప్రవర్తింపజేసిన ఆంధ్రయోగి రామడుగు శివరామ దీక్షితులు. నల్గొండజిల్లా నారాయణ పేట సంస్థానంలో నిర్మలాంబ, విశ్వనాధశాస్త్రి అనే తెలంగాణా వైదిక బ్రాహ్మణ దంపతులకు క్రీ.శ. 1690 ప్రాంతంలో జన్మించిన మహాపురుషుడు శివరామ దీక్షితులు.

యజ్ఞాలు, అన్నదానాలు, మందిర నిర్మాణాలు, వేదాధ్యయనం స్వర్గసుఖాలనే గాని మోక్షాన్ని ఇవ్వవని పూర్ణానందబోధ చేసే గురువును అన్వేషించటానికి ఇల్లు విడిచి వెళ్ళాడు. అలా దేశ సంచారం చేస్తూ ఒక దొమ్మరి గడసాని లక్ష్యశుద్ధికి అబ్బురపడిన దీక్షితులు ఆమె గురువు శ్రీధరులను డబ్బాకుపల్లె దేవాలయం సమీపంలోని వటవృక్షం క్రింద తపస్సు చేసుకుంటుండగా దర్శించాడు. ఆయన తాను సాధన చతుష్టయ సంపద గలిగిన దీక్షితుల

కోసమే శరీరత్యాగం చేయకుండా ఎదురుచూస్తున్నట్లు చెప్పి మూడురకాల తీర్థాలు, ప్రసాదాలు అనుగ్రహించి తారకామనస్కాలు బోధించారు. తరువాత మూడు రకాల దీక్షలు ఇచ్చారు. నాలుగు మహావాక్యాలు వాటి శబ్దార్థాలు, ద్వాదశి, షోడశి, పంచదశి మంత్రాలు వాటి అర్థాలు బోధించి తత్వార్థ ప్రచారం చేయవలసిందిగా ఆదేశించి తమ పాదుకలు అనుగ్రహించారు. 21వ రోజున గురువు దేహం చాలించిన తరువాత ఉత్తర క్రియలు జరిపి స్వదేశానికి తిరిగివచ్చి అమనస్క యోగాన్ని ప్రచారం చేశారు. ఆయన 'శివరామదీక్షితీయం' అనే బృహద్వానిష్ఠం రచించారు. అందులో 'అచలసిద్ధాంతం' గురించి వివరించారు. విరోధి కృతకార్తీకశుద్ధ శనివారం (23-11-1791) రోజున శివరామ దీక్షితులు 101 సంవత్సరాలు జీవించి దేహం చాలించారు.

## 77. సోలీపురం యోగానంద నరసింహస్వామి (1798-1899)

మంత్రాలను, యోగాలను, ప్రదేశాలను కాదని కేవలం ముక్తిమార్గం కోసమే పరితపించి, ఆ మార్గాన్ని చూపగల గురువు కోసం అన్వేషించి సాధించిన మహనీయుడు యోగానంద నరసింహ స్వామి. కర్నూలు మండలం మార్కాపురం తాలూకా ముమ్మడి గ్రామం (గుట్లలముమ్మిడివరం - లక్ష్మీ నరసింహపురంలో) అప్పయ్య, లక్ష్మమ్మ అనే మధ్య దంపతుల తృతీయ సంతానంగా 1798 ప్రాంతంలో జన్మించారు. ఆయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు లక్ష్మీ నరసింహమూర్తి.

ఆయన ఒకసారి తీర్థయాత్రలకు బయలుదేరి ఉత్తర, దక్షిణదేశంలోని పవిత్ర క్షేత్రాలను దర్శించి గురువు కోసం అన్వేషిస్తూ దత్తాత్రేయ సంప్రదాయానికి చెందిన రామావధూతను దర్శించాడు. రామావధూత లక్ష్మీనరసింహమూర్తిని అనేక విధాల పరీక్షించాడు. రాజవశీకరణ మంత్ర, యక్షిసిద్ధి మంత్రాలు, అష్టాక్షరీ, పంచాక్షరీ మంత్రాలు ఉపదేశిస్తానన్నాడు. కాని లక్ష్మీ నరసింహమూర్తి ముక్తి మార్గం మాత్రమే కావాలని పట్టుపట్టడంతో రామావధూత 'అచలం' బోధిస్తానని మొదట రామతారక మహిమ, రామాయణ రహస్యం బోధించి 'యోగానందుడు' అని పేరుపెట్టి ఇంటికి పోయి సాధన చేయమని ఆదేశించాడు. అయితే సర్వసంగ పరిత్యాగి అయిన లక్ష్మీ నరసింహమూర్తి రామావధూతనే సేవిస్తూ సాధన కొనసాగించాడు. గురువు ఆజ్ఞ ప్రకారం యోగానందుడు 27 మండలాలు అష్టాంగ యోగసాధనకుపక్రమించి ముగించాడు. ఈలోగా చండాముని అనే మరో తపోధనుడు మరికొన్ని మంత్రాలు నేర్పాడు. గురువు పెట్టిన అనేక పరీక్షలలో నెగ్గాడు. ఎన్నో అద్భుతాలు ప్రదర్శించాడు. గురువు రామావధూత కలలో ఇచ్చిన ఆదేశంపై 'ముక్తికాంత' చరిత్ర రచించాడు. యోగానందుడు చివరకు సోలీపురం చేరి ఎక్కువకాలం తపస్సుచేస్తూ తీరికవేళల్లో జిజ్ఞాసువులకు తత్త్వోపదేశం చేసేవారు. అనంతరం దివ్యవాణి ఆదేశంతో మన్నెంకొండలో స్థిరపడి తపస్సు చేశాడు. వికారినామ సంవత్సర చైత్ర బహుళ షష్ఠి సోమవారం 1-5-1899 ఉదయం

యోగానందుడు ప్రాణం విడాచారు. ఏటేటా చైత్ర మాసంలో యోగానందుల ఆరాధనోత్సవాలు నేటికీ జరుగుతున్నాయి. యోగానందులు సుమారు 15 గ్రంథాలు రచించారు.

## 78. ముడుమాల దూదేకుల సిద్దయ్య (1665-1735)

యోగులలో వేమన, గురువులలో పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి, శిష్యులలో సిద్దయ్య ఆదర్శమూర్తులుగా ప్రసిద్ధి పొందారు. గురుసేవలో అన్ని పరీక్షలకు నిలబడి ఆత్మానుభవం పొంది ఇతరులకు మార్గదర్శకుడైన సిద్దయ్య ఇస్లాం మత శాఖలలో ఒకటి అయిన దూదేకుల మతస్థులు పీరుసాయెబు, ఆదంబీ దంపతులకు కడపజిల్లా బద్వేలు తాలూకా ముడుమాల గ్రామంలో 1665లో లేక లేక భగవత్ కృపవల్ల కలిగిన ఏకైక సంతానం సిద్దయ్య. మతాచారం ప్రకారం ఆ బిడ్డకు చేసిన నామకరణం షేక్ సయ్యద్ అయినా సిద్ధ పురుషుడు ఇచ్చిన దివ్యమూలిక తాయెత్తు ఫలితంగా జన్మించడం చేత తల్లి ఆదంబీ సిద్దయ్య అని పిలిచేది.

చిన్నతనం నుంచే జీవహింసపట్ల వైముఖ్యం, శాఖాహారం నియమాలు ఏకాంతంగా భగవద్ధానం చేస్తూ జగద్రహస్యం గురించి ఆలోచించే సిద్దయ్యకు ఒక సాధువు భిన్నత్వంలోని ఏకత్వం గురించి బాగా బోధించాడు. సిద్దయ్య 16వ ఏట ఒకనాడు కలలో ఒక మహానుభావుడు సిద్దయ్యకు కనిపించి కందిమల్లయ్య పల్లెలోగల పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామిని దర్శించవలసిందిగా ఆదేశించారు. ఒకరోజు తెల్లవారుజామున ఎవరికీ చెప్పకుండా కందిమల్లయ పల్లెకు చేరడు. అప్పటికే వీరబ్రహ్మేంద్ర సమాధిలో ఉండటంతో ఆయన అనుగ్రహం కోసం నిరీక్షించాడు. మతేతరుడైన తనకు అవకాశం లేదని తెలిసినా అక్కడే వుండి మరునాడు శిష్యులకు వీరబ్రహ్మ బోధించిన మానవ జీవిత లక్ష్యం, బ్రహ్మవిద్యాధికారానికి కావలసిన సాధన చతుష్టయం గురించిన వివరణ దివ్యప్రబోధంగా విన్నాడు. వీరబ్రహ్మమే తనకు భగవంతుడు ప్రసాదించిన గురువుగా భావించి, గురుకృపతో ఆశ్రమంలో స్థానం సంపాదించాడు. అష్టాంగయోగాన్ని కరతలామలకం చేసుకున్నాడు. సిద్దప్ప ఎన్నో మహిమలు ప్రదర్శించారు. మతతత్వ శక్తులకు బుద్ధి చెప్పారు. సిద్దయ్య వీరబ్రహ్మేంద్రులను భక్తితో సేవిస్తూ సాంఖ్యతారకా మనస్కములను మంత్ర, లయ, హఠరాజయోగాలను అభ్యసించి సాధించారు. గురువుగారి బాటలో ఎన్నో కాలజ్ఞాన తత్వాలు రచించారు.

సిద్దయ్య మొదటి జన్మలో కాశీరాజు విజయసింహుని కొడుకు అమరసింహుడు. అతడొకసారి పులివేటకు వెళ్ళి పొరపాటున గోవును చంపిన దోషానికి ముస్లింగా పుట్టి 12 ఏళ్ళు సేవించి తరించే శాపం వల్ల సిద్దయ్యగా జన్మించాడు 1693లో. సిద్దయ్య 25వ ఏట గురువు వీరబ్రహ్మేంద్ర సమాధి చెందారు. అనంతరం సిద్ధయ్య తల్లిదండ్రుల కోరిక మేరకు అచ్చాంబీని వివాహమాడి రాజయోగిగా సంసారం సాగిస్తూ గురు బోధలు యోగమార్గం ప్రచారం చేశాడు. ఎందరో ఆయనకు శిష్యులుగా చేరారు. సిద్దయ్య 1739లో 70వ ఏట జీవ సమాధి చెందారు. ప్రతి ఏటా చైత్రశుద్ధ పాడ్యమి విదియ రెండు రోజులలో సిద్దయ్య ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి.

## 79. తాండూరు అబ్దుల్ కరీంషా వలీ (1870 - 1947)

ముస్లిం మత శాఖల్లో 'సూఫీ' ఒకటి. ఆఫ్ఘనిస్తాన్‌లోని షాజీగ్రామంలో 19వ శతాబ్దం మధ్య భాగంలో సయ్యద్ సూఫీ మహ్మద్ అనే పేద భక్తుని రెండవ కుమారుడుగా జన్మించిన యోగి పుంగవుడు అబ్దుల్ కరీంషావలీ. చిన్నప్పటి నుండి ఆటపాటలు, వినోదాలు, వింతలపై విముఖుడై, చదువు సంధ్యలు నేర్చుకోకుండా గ్రామం బయట భగవధ్యాన తత్పరుడై ఉండేవాడు. రాత్రి పూట కూడా అడవిలో ఏకాంతంగా ధ్యానం చేసేవాడు. 12 ఏళ్ల వయసులో అతని పినతండ్రి సయ్యద్ వలీ మహమ్మద్ అతనిని దత్తత తీసుకుని తాను ఉంటున్న నిజాం రాజ్యం లోని తాండూరుకు తీసుకు వచ్చారు. 14వ ఏట వివాహమైంది.

ఇలా ఉండగా కొంత కాలం తరువాత సయ్యద్ సుల్తాన్ అలీషా అనే మహాత్ముడు దేశ పర్యటన చేస్తూ హైదరాబాద్ నుండి ఎఖేలి గ్రామానికి వచ్చారు. ఆయోగికి ఎఖేలిలో చాలా మంది శిష్యులు, భక్తులు ఉన్నారు. నమాజు వేళ మసీదుకు వెడుతున్న సుల్తాన్ అలీషా వద్ద దీక్ష తీసుకుని ఉపదేశం పొందడానికి సంకల్పించాడు. ఆయన ఆడంబరాలు చూసిన అనుమానించిన కరీంషా ఆయన సర్వజ్ఞతను తెలుసుకుని ఆయన భక్తుడుగా మారాడు. ఆయన అతన్ని ఏకాంతానికి తీసుకువెళ్లి శిరస్సుపై చేయి ఉంచి ఆలింగనం చేసుకోగా ఆ స్పర్శతో కరీంషాలో గొప్ప మార్పు వచ్చింది. ప్రాపంచిక విషయాలపై విరక్తి, పరమాత్మ నిష్ఠ బలపడింది. ఒకసారి కరీంషా తన గురువు మహమ్మద్ షాబేగ్ ఆరాధనోత్సవాలు జరపడానికి హైదరాబాద్ రాగా కరీంషావలీ కూడా అక్కడకు వెళ్లారు. ఆరాధనోత్సవాల అనంతరం అలీషా ఆదేశంపై గుల్బర్గా షరీఫ్ వెళ్లి అక్కడ సుప్రసిద్ధ ముస్లిం యోగి ఖాజాబంద నవాజు దర్గాలో రెండేళ్లు సేవచేసి ఏకాంతంగా సాధన చేశాడు. ఒక రోజు ఖాజాబందనవాజు ప్రత్యక్షమై ఆశీర్వదించి తిరిగి గురువు వద్దకు వెళ్లమన్నారు. అక్కడ గురు వాఙ్మేరకు లాలెచారు, అక్కడినుండి పాకుపఠన్ వెళ్లి అక్కడ షేక్ ఫరీద్ షక్కర్ గంజ్ అనే మహాత్ముని సమాధి వద్ద రోగులకు, ఆర్తులకు సేవలు చేశాడు. కొన్ని నెలల తరువాత తిరిగి షక్కర్ గంజ్ ప్రత్యక్షమై కరీంషాను దీవించి ఇంటికి వెళ్లమన్నారు. కరీంషా తిరిగి హైదరాబాద్ వచ్చి కొన్ని రోజులు గురువును సేవించి ఎఖేలికి తిరిగి వెళ్ళాడు. అక్కడ పగలంతా భక్తుల గోష్ఠిలోను, ఏకాంత ధ్యానంలోను గడిపేవాడు. ఇంతలో గురువు అలీషా హైదరాబాద్‌లో సిద్ధి పొందారు. అనంతరం ఆయన శిష్యుల కోరికపై కరీంషావలీ అలీషా పీఠానికి అధిపతి అయ్యారు. ఐదేళ్ల తరువాత తాండూరు గ్రామం వెలుపల కొంత భూమిని కొని విశాలమైన ఇళ్ళు వసతులు ఏర్పాటు చేసి గురువు గారి ఆరాధనోత్సవాలు వైభవంగా జరిపించసాగారు.

ముస్లిం యోగులు సంసారం చేస్తూ రాజయోగులుగా ఉండే సంప్రదాయం మేరకు ఆయన మరో మూడు వివాహాలు చేసుకుని నలుగురు భార్యలతో పదిమంది కొడుకులను ఇద్దరు కూతుళ్లను పొందారు. 1946 లో తీవ్రంగా జబ్బు పడేనాటికి ఆయన గురు పీఠం

అధిష్ఠించిన 21 ఏళ్ళలో ఎందరో శిష్యులకు, భక్తులకు, గురు బంధువులకు పరమాత్మ తత్వం బోధించి వారి అభీష్టాలు నెరవేర్చి సద్గురువుగా ఖ్యాతి గడించారు. ఐదు నెలలు అస్వస్థత అనంతరం సర్వజిత్ మార్గశిర శుద్ధ పౌర్ణమి శుక్రవారం 26-12-1947 తాను దేహం చాలించనున్నట్లు ముందే ప్రకటించి అదే రోజున దేహం చాలించారు. నేడు తాండూరులో కరీంషా సమాధి హిందూ ముస్లిం అందరికీ యాత్ర స్థలం. ఎన్నో అద్భుతాలు ఇప్పటికీ జరుగుతున్నాయి.

## 80. దీపాలదిన్నెపాలెం పాటిబండ్ల వీరయ్య (1867 - 1922)

ఆత్మ జ్ఞానం కోసం గురువే పరబ్రహ్మమనే భక్తి విశ్వాసాలతో సేవించి గురువుకు తగిన శిష్యుడనిపించుకున్న శిష్యుల కోవలో పాటిబండ్ల వీరయ్య ఒకరు. గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా దీపాలదిన్నె పాలెంలో ఒక వ్యవసాయకమ్మ కుటుంబానికి చెందిన పాటిబండ్ల బాపయ్య, బాపమ్మ దంపతులకు తృతీయ తనయుడుగా ప్రభవనామ సంవత్సరం 1867లో జన్మించారు. పూర్వ జన్మ సుకృతంవల్ల ఆయనకు చిన్నతనంలోనే జ్ఞానతృష్ణ వేదాంత విద్య, వైరాగ్యం అలవడ్డాయి. చిన్నతనంలోనే వీధి బడిలో తెలుగు, స్వయంకృషితో సంస్కృత భాషలో పాండిత్యం సంపాదించి రెండు భాషల్లోను చాలాకృతులు రచించారు. రామ భక్తి కూడా చిన్ననాడే అలవడింది.

ఒక ఏడాది దీపాలదిన్నెపాలెంలో వారం రోజులుపాట సత్తెనపల్లి ఫిరోజీ మహర్షి ఇచ్చిన ఆధ్యాత్మికోపన్యాసాలు విన్న 12 ఏళ్ళ వీరయ్యకుఆయన శిష్యుడు కావాలనిపించింది. మూడేళ్ళశుశ్రూష అనంతరం ఫిరోజీ మహర్షి ఆయనకు మంత్రోపదేశం చేశారు. వీరయ్య దృఢ దీక్షతో గురునిపైనే లక్ష్యాన్నుంచి సాధన చేస్తూ ఉండేవాడు. యోగసిద్ధి అలవడింది. నాటి నుంచి వీరయ్య దేహంలో ఆత్మశక్తి సంచారం, సాత్విక లక్షణాలు అభివృద్ధి చెందాయి. వీరయ్య సత్తెనపల్లి చేరి గురువుగారి వద్ద ఆధ్యాత్మిక రహస్యాలు తెలుసుకుంటూ కవిత్వ సాధన తీవ్రతరం చేశారు. సత్తెనపల్లి ఫిరోజీ మహర్షి మఠానికి వీరయ్య పీఠాధిపత్యం వహించారు. వీరయ్య గురువుగారి కీర్తిని పొగుడుతూ రచించిన పద్యాలు, కీర్తనలు పాడుతూ ఊరూరా తిరిగి విరాళాలు సంపాదించి మఠానికి అంతరాలయం, ముఖమంటపం, విమాన గోపురం నిర్మించారు. నిత్యదీపారాధన, నైవేద్యాల కోసం భక్తులనుండి ఐదెకరాల మెట్ట సేకరించారు. ఒక సత్రం, ఒక బావి నిర్మింపజేశారు. ఆయన యోగ విద్యతోపాటు ఆయుర్వేదంలో కూడా ప్రవీణులు. ఛాయా పురుష లక్షణం తెలిసిన గొప్ప యోగి వీరయ్య దుందుభినామ సంవత్సర కార్తీక బహుళ పంచమి గురువారం 9-11-1922 సాయంకాలం భగవన్నామం జపిస్తూ సంపూర్ణ వివేకంతో బ్రహ్మైక్యం చెందారు. ఆమరునాడు భక్తులు ఫిరోజీ మహర్షి సమాధికి ఎదురుగా ధ్వజ స్తంభంముందు ఆయన భౌతిక కాయాన్ని సమాధిచేశారు.

## 81. మిట్టపాళెం నారాయణ స్వామి (1750)

నెల్లూరు జిల్లా కనిగిరితాలూకా కోవెలంపాటి మిట్టపాళెంలో కొమ్మినేని మహాలక్ష్మమ్మ,వెంకటరామయ్య దంపతులకు మూడవ సంతానంగా జన్మించిన బిడ్డకు కొండయ్య అని నామకరణం చేశారు. కొండయ్య పెరిగిన కొద్దీ భక్తి హెచ్చింది. తోటి బాలురకు భగవద్భక్తి బోధించేవారు. వైరాగ్యం బోధించే వారు. భక్తిగలవానికి భుక్తికి కరువుండదంటూ తండ్రి మరణానంతరం తల్లితో సహాతీర్ధ యాత్రలకు బయలుదేరి మార్గంలో పురాణకాలక్షేపాలు చేసి స్వాములవారుగా ప్రజల ఆదరాభిమానాలు, పూజలు అందుకున్నాడు. పురాణాలద్వారా వచ్చిన ఆదాయాన్ని తల్లికే ఇచ్చేవాడు. ఒక రోజున తల్లి కూడా మరణించగా తమ్ముని బాధ్యతను పెద్దక్క పెదవేంగళమ్మకు అప్పగించి మిట్టపాళెం వెళ్లిపోయి నారకొండలో ఉంటూ పిచ్చివానిలా తిరగేవాడు. తనను పిచ్చివాడుగా తలచినవారికి బుద్ధిచెప్పి ఎన్నో మహిమలు, అద్భుతాలు ప్రదర్శించేవాడు. ఇలా వుండగా నారకొండ కొండ వద్దకు ఒక మహాయోగి వచ్చి కొండయ్య నాల్కపై విభూతివేసి మంత్రోపదేశం చేసి, నారాయణ నామం జపిస్తూ లోక కళ్యాణం కోసం తపస్సు చేయమని, అర్హులకు మాత్రమే మంత్రోపదేశం చేయమని ఆదేశించి అదృశ్య మయ్యాడు. అప్పటినుండి తనపేరు నారాయణస్వామిగా మార్చుకున్నాడు.

ఆయనపై అసూయతో ఎందరో చంపడానికి ప్రయత్నించి విఫలురై ఆయన మహిమలకు హితాశులయ్యారు. నారాయణ స్వామి తాను త్వరలోనే జీవసమాధి చెందుతానని చాటించి, పోతులూరి వీరబ్రహ్మం చెప్పిన కలికాలం త్వరలోనే వస్తుందని హెచ్చరించారు. ఆ రోజుకు 10వ రోజున నాగప్రతిష్ఠ, పోలేరమ్మ స్తంభ ప్రతిష్ఠ జరుగుతాయని భక్తులను, శిష్యులను అందరినీ ఆహ్వానించారు. భజనలు, సంకీర్తనలు జరుగుతుండగా పాదుకలు, బెత్తము ధరించి స్వామి సమాధిలో ప్రవేశించారు. శిష్యులు సమాధిని బండరాతితో మూసివేశారు. సమాధి అనంతరం కూడా ఆయన భక్తుల కోరికలు నేరవేరుస్తున్నారు. సమాధి వద్ద నిత్య దీపారాధనలు, నైవేద్యం జరిగేది. స్వామి సమాధి వద్ద 5 వారాలు నిద్రచేస్తే దీర్ఘరోగాలు నయమవుతున్నాయి. భద్రాయపాలెంలో గల ఈ సమాధి ఈనాడు ఒక దర్శనీయ తీర్ధ యాత్రాస్థలం.

## 82. నాగండ్ల ప్రతాపకోటయ్య శాస్త్రి (1854-1896)

గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా నాగండ్ల గ్రామంలో ప్రతాప జోగయ్య శాస్త్రి దంపతులకు జన్మించిన అద్వైతానందుడు కోటయ్యశాస్త్రి. బాల్యం నుండి సర్వభూతాలతృప్తే ఆయనకు సంతోషం కలిగించేది. స్వపర భేదం లేకుండా దానధర్మాలు త్యాగం చేస్తూ ఆధ్యాత్మిక భావాలతో ప్రవర్తించేవారు. కోటయ్యకు 20వ ఏట మహాలక్ష్మమ్మతో వివాహం జరిగింది. కుటుంబ పోషణ కోసం కోటయ్య శాస్త్రి ధన సంపాదనకై నిజాం రాజ్యానికి వెళ్ళాడు. అక్కడ ఒక వ్యాధి గ్రస్తునికి స్వస్థత చేకూర్చడంతో కోటయ్య మహిమాన్వితుడుగా ప్రసిద్ధికెక్కాడు. జబ్బు కుదిరిన నారాయణ కోటయ్య తల్లిదండ్రులకు పుష్కలంగా ధనం పంపి కోటయ్య కోరిక మేరకు తగిన

లాంఛనాలతో అతనిని కాశీకి పంపించాడు. కాశీలో బాలసరస్వతీ స్వామి అతనికి త్రిపుర సుందరీ మహామంత్రం ఉపదేశించి దీక్షించారు. సద్గురు కటాక్షంతో కోటయ్యకు ఏకాగ్రత అలవడి కొద్దికాలంలోనే మంత్రసిద్ధి, యోగసిద్ధి లభించాయి. కోటయ్య కొన్ని మాసాలు గురువులను సేవించి గురువు అనుమతితో స్వదేశానికి బయలుదేరారు. ఎన్నో మహిమలు ప్రదర్శించారు. అన్నదానం, నిరంతర ధ్యానం, జపతపాలు ఆయనకు నిత్యకృత్యాలయ్యాయి. ఆయన కాశీలో 42వ ఏట 1896లో కోటయ్య శాస్త్రి బ్రహ్మరంధ్రం ఛేదించుకుని దేహత్యాగం చేశారు.

## 83. ఉరవకొండ కర్తవ్య కరిబసవ స్వామి (1762-1832)

రాయచూరు జిల్లా కృష్ణాతీరంలోని తపోభూమి నారద క్షేత్రంలో గల యాదవగిరి పీఠానికి ఖ్యాతిని ఆర్జించి పెట్టిన సిద్ధపురుషుడు వైరాగ్య చెన్న బసవస్వామి. ఆయన వీరశైవ ధర్మ ప్రచారం చేస్తూ కొండిన్య నగరంలో ఒక బాలుని చూసి తన యాదవగిరి మఠానికి తీసుకువెళ్ళి హస్తమస్తక సంయోగం చేయడంతో ఆ బాలునికి దివ్య జ్ఞానోదయమైంది. పూర్వజన్మ యోగబలంతో కొద్ది కాలంలోనే ఆ బాలుడు సమస్త విద్యలలోను శివానుభవ శాస్త్రంలోను, సాంఖ్యలలోను నిష్ణాతుడయ్యాడు. చెన్నబసవస్వామి ఆ బాలునికి కరిబసవస్వామి అనే పేరుపెట్టి, కొంతకాలం తరువాత మఠం బాధ్యతలు ఆ బాలునికి అప్పగించి నారదక్షేత్రానికి తపస్సు చేసుకోవడానికి వెళ్ళిపోయారు.

కరిబసవస్వామి గురువు ఆజ్ఞమేరకు దేశ సంచారం చేస్తూ తన తపోబలంతో రోగగ్రస్తులకు ఆరోగ్యం, సంతాన హీనులకు సంతానం, దరిద్రులకు సంపదలు, జ్ఞానార్థులకు జ్ఞానం ప్రసాదిస్తూ వీరశైవ మతాన్ని ఎంతో వ్యాప్తి చెందించారు. ఆయనకు ఎందరో శిష్యులయ్యారు. ఆయన కృషికి మెచ్చిన గురువు ఆయనకు 'కర్తవ్య కరిబసవస్వామి' అనే బిరుదునిచ్చారు. కరిబసవస్వామి ఆంధ్ర, కర్ణాటక, నిజాం రాజ్యాలలో సుమారు 800 మఠాలు స్థాపించి ఆయా మఠాలకు వివిధ గ్రామాలలో 20వేల ఎకరాల భూమిని సేకరించారు. వాటిని అర్హులైన పేదలకు దానం చేశారు.

కొంతకాలం తరువాత అనంతపురం జిల్లా గుత్తి తాలూకా ఉరవకొండ భక్తుల అభీష్టం మేరకు ఒక మఠాన్ని నిర్మించారు. దానికి గవిమఠం అని పేరు. దానికి అనుబంధంగా మైసూరులో కరంజి మఠం కట్టించారు.

కరిబసవస్వామి ఉరవకొండకు మేనాలో వెడుతూ తలుపలు మూసుకుని శివైక్యం చెందారు. ఆయన ఆరాధనోత్సవాలు ఏటేటా ఫాల్గుణ శుద్ధ పంచమి నుండి 8 రోజుల పాటు వైభవంగా జరుగుతాయి. ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతాల నుండి ఆ ఉత్సవాలకు భక్తులు వేల సంఖ్యలో హాజరౌతారు.

## 84. మాణిక్య నగరం వెంకమ్మ (1808-1862)

దత్తాంశ సంభూతులై, షిర్డీ సాయిబాబా సమకాలీనులై, కర్ణాటక దేశంలో మాణిక్యనగర రాజైన మాణిక్యప్రభువు అనుగ్రహానికి పాత్రురాలైన జ్యేష్ఠ శిష్యురాలు, మహాయోగిని కోమటి వెంకమ్మ. ఆమెకు మాణిక్య ప్రభువు, మధుమతీ శ్యామలాంబ అనే బిరుదుతో సత్కరించారు.

చిన్నతనంలోనే వివాహమై భర్త మరణించగా వెంకమ్మ మనస్సు దైవంవైపు మరలి భగవచ్చింతన, ధ్యానధారణలు సులభంగా అలవడ్డాయి. ఒకసారి మాణిక్య ప్రభువు దర్శనం కోసం వెడుతున్న వెంకమ్మకు, ఆమె తల్లిదండ్రులకు దారిలో రాళ్ల వాన కురిసి వాగులు, వంకలు పొంగగా వారి ఎద్దుబండి మునిగిపోయే స్థితిలో వెంకమ్మ గొంతెత్తి మూడుసార్లు పిలువగా 16 ఏళ్ల బాలుడి రూపంలో వచ్చి రోధించటంతో ఆమె పాత జీవితాన్ని మరచి భవసాగరం దాటించే దివ్య పురుషుడుగా భావించింది. మాణిక్య ప్రభువు చరణాలను ఆశ్రయించింది. మాణిక్య ప్రభువు వెంకమ్మను అనేక విధాల పరీక్షించారు. ఆమెకు ఆత్మసాక్షాత్కారం కలిగింది. యమ, నియమ, ఆసన, ప్రణాయామ, జప, ధ్యాన, భజన, మనన సమాధుల నధిగమించి ప్రభువుల మార్గదర్శనంలో ఉన్నతోన్నత ఆధ్యాత్మిక సోపానాలు అధిరోహించారు. ప్రభువుల దర్శనానికి వచ్చే భక్తులకు, సాధకులకు వెంకమ్మ హితోపదేశం చేసేవారు. వ్రతోపవాసాలతో శరీరాన్ని శుష్కింపజేయడం వల్ల అహంకారం పెరుగుతుందని, అహంకారం నశించనిదే సద్గురు కృప లభించదని, సాధకుడు సద్గురువుతో ఏకరూపుడు కావాలని, జ్ఞానేశ్వరులు నివృత్తి నాథులతో ఏకరూపులు కావటం వల్లనే ఈశ్వరుడయ్యాడని వెంకమ్మ బోధించేవారు. ఆమె దుందుభి సంవత్సర శ్రావణ బహుళ త్రయోదశి శనివారం (23-8-1862) నాడు దేహత్యాగం చేశారు. మాణిక్య ప్రభువు స్వయంగా వెంకమ్మను దేవత మాదిరిగా పూజించి సమాధిలో కూర్చుండబెట్టి సమాధి చేశారు. సమాధి నుండే ఆమె ఎన్నో అద్భుతాలు ప్రదర్శించింది. 1882లో ఆమె మందిర నిర్మాణం భక్తుల కరసేవతో జరిగింది. ఇక్కడ ఆశ్వీయుజ శుద్ధ పంచమి నుండి నవమి వరకు పంచరాత్రోత్సవాలు జరుగుతాయి. వెంకమ్మ మందిరంలో దేవీ నవరాత్రులు వైభవంగా జరుపుతారు. దత్తాత్రేయుల శక్తి వెంకమ్మ రూపంలో ఇక్కడుందని భక్తుల విశ్వాసం.

## 85. ఓబుళరాజుపల్లె నారాయణరెడ్డి అవధూత (1834-1915)

గురువు లేకుండానే పూర్వజన్మలో సాధించిన యోగ విద్యా బలంతో కృతార్థులైన సిద్ధ పురుషులలోని ప్రసిద్ధులు నల్లెడ్డి నారాయణ రెడ్డి అవధూత. ఆయన షిరిడీ సాయిబాబా (1838-1918)కి సమకాలీనుడు. నారాయణ రెడ్డి జన్మించినది, దేహత్యాగం చేసింది కడప జిల్లాలోనే అయినా కర్నూలు నారాయణ రెడ్డిగా ప్రసిద్ధులు.

కడప జిల్లా కమలాపురం తాలూకా గంగిరెడ్డి పల్లెలో నల్లెడ్డి గంగిరెడ్డి, రామాంబ పుణ్య

దంపతులకుచివరి సంతానంగా శ్రీమన్నారాయణాంశతో ఉద్భవించిన నారాయణ రెడ్డి పూర్వ జన్మలో బెస్త కులంలో పుట్టి (1608-1693) పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి సేవించినట్లు తెలుస్తోంది. చిన్నతనం నుంచే ఏకాంతమంటే ఇష్టం కావడంతో పొలానికి ఆవులను మేపేందుకు తీసుకువెళ్ళి ఆత్మాను సంధాన సాధన చేసేవారు. ఇలా సాధన జరుగుతుండగా ఒకనాడు కుంభవృష్టి కురిసింది. తక్కిన గోపబాలురందరూ తడిసి పోయినా, నారాయణరెడ్డి పైన ఒక్క చినుకు కూడా పడకపోవడం, బట్టలైనా తడవకపోవడం తోటివారికి విచిత్రంగా తోచి ఆ వింతను గ్రామంలో చాటారు. తరువాత నారాయణరెడ్డి ఎన్నో లీలలు, అద్భుతాలు ప్రదర్శించారు. నారాయణరెడ్డికి గంగిరెడ్డి పల్లె వాతావరణం సరిపడక పోవటంతో 16వ ఏట ఆ ఊరు విడిచిపెట్టి దాదాపు 60 సంవత్సరాల వరకు తిరిగి ఆ ప్రాంతాలకు రాలేదు. 20వ ఏట కర్నూలు చేరి ఆ పరిసర ప్రాంతాలలోని అడవుల్లో తిరుగుతూ తీవ్రసాధన చేసి అవధూతగా మారారు. కర్నూలు చేరే నాటికే ఆయన అమనస్క యోగంలో ఆరితేరాడు. అష్టసిద్ధులు ఆయనకు కరతలామలకమైనా వాటిని ఆయన ప్రదర్శించలేదు. రేయింబవళ్ళు స్వేచ్ఛగా తిరిగేవారు. ఎవరినో బట్టలు అడిగి వస్త్రహీనులకు పంచేవారు. తన దగ్గరకు వచ్చి అడిగిన వారికి రాబోయే మంచి చెడులు చెప్పి హెచ్చరించేవారు. అలా తిరిగి తిరిగి చివరి దశలో కందిమలయపల్లె చేరి వీరబ్రహ్మేంద్ర సమాధిని సేవించారు. అనంతరం ఆయన ఓబుళరాజుపల్లె చేరి అక్కడి గ్రామాధికారి బొమ్మువీరారెడ్డికి తాను దేహం చాలించనున్నట్లు సూచన మాత్రంగా చెప్పి, 12-3-1915 ఆనందనామ సంవత్సర ఫాల్గుణ బహుళ ద్వాదశి శుక్రవారంనాడు శ్వాసను బంధించి ప్రాణత్యాగం చేశారు. ఆయన పార్థివ శరీరానికి వీరారెడ్డి విధివిధానంగా ఉత్తర క్రియలు జరిపి గ్రామం పడమట దిక్కున తన సొంత భూమిలో అవధూత సమాధి చేసి తరువాత సమాధి మందిర నిర్మాణానికి పూనుకున్నాడు. ఆ సమాధి నుంచి వీణాతాళ మృదంగ ధ్వనులు, గుడిగంటల చప్పడు సంకీర్తనా గానం వినిపించేవి. ఆయన సమాధి చెందిన నాటినుండి ఏటేటా ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు అవధూత ఆరాధనోత్సవాలు వైభవంగా జరుగుతున్నాయి. ఈనాటికీ అవధూత ఆర్తుల కష్టాలను తీరుస్తున్నారు.

## 86. మహేంద్రవాడ రెడ్డి సుబ్రహ్మణ్య మహర్షి (1860-1949)

మోక్షప్రాప్తికి, జ్ఞాన విజ్ఞానం, జ్ఞాన విజ్ఞానానికి సద్గురు కటాక్షం అవసరం. అటువంటి సద్గురువులను అనేక మందిని సేవించి, తాను సద్గురువై వందలాది మందికి జ్ఞాన భిక్ష పెట్టిన మహాపురుషుడు రెడ్డి సుబ్రహ్మణ్య మహర్షి రౌద్రినామ సంవత్సరం జ్యేష్ఠశుద్ధ చవితి గురువారం పుష్యమీ నక్షత్రం, మేషలగ్నంలో గోదావరి జిల్లా ఉత్తకోటలో బ్రహ్మన్న శేషమ్మ అనే భక్త దంపతుల ద్వితీయ పుత్రుడుగా జన్మించారు.

బాల్యం నుంచే భూతదయ, పాపభీతి, సత్య సంధత, భగవద్భక్తి మెండుగా ఏర్పడ్డాయి.

ఆయన తులసికోట వద్ద శ్రీరామ ధ్యానం చేస్తుంటే తులసీదళాల్లో శ్రీరాముడు, రాత్రి ఏకాంతంగా ఆకాశంలోకి చూస్తుంటే నక్షత్రాలలో సీతారాములు దర్శనమిచ్చారు. పన్నెండవఏట ఉపనయనం జరిగిన తరువాత పోణంగికి చెందిన రామభక్తుడు సోమయాజుల పాపయ్య శాస్త్రి సుబ్రహ్మణ్యంకు రామతారక మంత్రదీక్ష ఇచ్చి మానస పూజా విధానం బోధించారు. ఆయన వద్దనే సుబ్రహ్మణ్యం 6 సంవత్సరాల పాటు మంత్రయోగ రహస్యాలు సాధన చేశారు. జప సమయంలో సీతారాములు సాక్షాత్కరిస్తే ఆశువుగా పద్యాలు చెప్పి స్తుతించేవారు. తల్లి దండ్రులు బలవంతంగా వివాహం చేసినా సంసారం విడిచి తీర్థ ప్రదేశాలు, కొండలు కోనలు తిరుగుతూ 72 మంది వివిధ మతాల యోగులను దర్శించి రాజమండ్రిలో శ్రీ విశ్వనాధావదూత సన్నిధికి చేరారు. ఆయన గురు సేవా ధర్మాలను మంత్ర, హఠ, లయ, రాజయోగాలు, వాటిని సాధించే విధానాలు బోధించారు. సుబ్రహ్మణ్యం సాధన చతుష్టయాన్ని అలవరచుకున్నారు. విశ్వనాధావధూత సుబ్రహ్మణ్యంకు 'స్వేచ్ఛానం' అనే దీక్షానామం ఇచ్చి యోగ్యులకు మాత్రమే బ్రహ్మ విద్య నేర్పమని, గృహస్థాశ్రమాన్ని పాటించమనీ ఆదేశించారు.

ఒకసారి మహారాష్ట్ర బ్రహ్మచారి బాబ్‌కోకిల్ 60వ ఏట సన్యసించి పాముల్పులో ఉంటున్న సుబ్రహ్మణ్య యోగి ఇంట భిక్ష చేసి అనేక యోగ రహస్యాలు బోధించారు. సుబ్రహ్మణ్య మహర్షికి అష్టసిద్ధులు వశమయ్యాయి. అనేక అద్భుతాలు ప్రదర్శించారు. ఆయన ఎన్నో గ్రంథాలు రచించారు. వాటిలో 'అద్వైత రహస్యం' మానసబోధ, గాయత్రీ నాటకం, అచల బ్రహ్మానంద ప్రబోధం,పరవాసు దేవశతకం, దండకాలు తదితర 16,17 గ్రంథాలు రచించారు. సర్వధారి ఫాల్గుణ బహుళ అష్టమి మంగళవారం 22-3-1949 నాడు సుబ్రహ్మణ్య మహర్షి మహేంద్రవాడలో పీఠస్థులై మూలాధారం బిగించి హంసను షట్చక్రాలు దాటించి భ్రూమధ్యంలో చేర్చి నాసాగ్రంలో దృష్టి నిలిపారు. ఆయన షట్చక్ర సీతారామ తారక పరబ్రహ్మంలో ఐక్యమయ్యారు.

## 87. తాడిపత్రి ధేనువకొండ వెంకయ్య (1851-1936)

కవిత్వంతో ప్రజలకు అర్థమయ్యే భాషలో ధార్మిక, అధ్యాత్మిక విషయాలు బోధించిన ప్రజా కవి యోగులలో ధేనువకొండ వెంకయ్య ఒకరు. రామాయణ, భారత, భాగవత, పురాణ గాథలను జంగంకథ, యక్షగానం, పదాలు, తదితర దేశికవితారీతులలో గ్రామీణ ప్రజలకు పాపభీతి, దైవభక్తిని ప్రబోధించిన వెంకయ్య ప్రస్తుత ప్రకాశం జిల్లా అద్దంకి మండలం ధేనువకొండ శివారు గ్రామం గార్లపాడు గ్రామంలో ధేనువకొండ పిచ్చయ్య, కనకమ్మ దంపతుల చతుర్థ సంతానంగా జన్మించారు. వెంకయ్య బాల్యం నుండి ధేనువకొండ వేణుగోపాల స్వామి భక్తుడు, వారసత్వంగా సంగీత సాహిత్యాలు చిన్ననాడే అలవడ్డాయి. తండ్రి అసంపూర్ణంగా వదలిన 'వామన పురాణం' యక్షగానాన్ని పూర్తిచేసి తండ్రి మెప్పు పొందారు. మేనత్త కూతురు కనకమ్మను వివాహమాడారు.

సంతానం కలుగలేదు. నిరతాన్నదానం వల్ల ఆర్థిక ఇబ్బందులు ఎదురు కావడంతో సిరి సంపదలకోసం సిద్ధులు గడించేందుకు యోగులను, సిద్ధ పురుషులను సేవించే సంకల్పంతో కాశీకి వెళ్లి పదేళ్లపాటు ఎందరోసాధు సంతులను సేవించి మంత్ర దీక్షితుడై తిరిగి వచ్చారు. మంత్రోపాసన, ధ్యానధారణలు, సహజంగా ఉన్న సంగీత సాహిత్య కళలకు దోహదం కాగా జంగం కథలు, యక్షగానాలు, హరికథలు ఆశువుగా రచించారు. ఆయన మొదటి రచన 'విరాట పర్వం' జంగం కథను ధేనువకొండ వేణుగోపాలస్వామికి అంకితమిచ్చారు. ఎన్నో రచనలతో ఖ్యాతి గడించిన వెంకయ్యకు ఎవరైనా సద్గురువుల నాశ్రయించి దీక్షితుడై యోగాధ్యానం చేసి సన్యాసం స్వీకరించే సంకల్పంతో కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠస్థాపకుడు, మౌనస్వామిగా ప్రసిద్ధుడైన శ్రీ శివ చిదానంద భారతీ స్వామి శిష్యుడై సన్యాసదీక్షను, శ్రీరామతారక బ్రహ్మానంద అవధూతేంద్ర సరస్వతి అనే దీక్షానామాన్ని స్వీకరించారు. అనంతరం అనేక తీర్థ యాత్రాస్థలాలు సేవించి అనంతపురం జిల్లా తాడిపత్రి చేరి గ్రామం చివర కరణంగారితోటలో విడిది చేసి విశ్రాంతులై అనేక లీలలు, అద్భుతాలు ప్రదర్శించి ఎందరికో వ్యాధులను నయంచేసి, కష్టాలు తొలగించి సన్మార్గంలో పెట్టారు. యువనామ సంవత్సర ఫాల్గుణ బహుళ చవితి గురువారం 12-3-1936న కపాల ఛేదనం చేసుకుని విశ్వ చైతన్యంలో విలీనమయ్యారు. భక్తులు ప్రతిఏటా ఆరాధనోత్సవాలు నిర్వహిస్తున్నారు.

## 88. పెనకచర్ల చితంబరస్వామి (1772-1872)

దత్తాత్రేయాంశతో ఆంధ్రదేశంలో జన్మించిన ఎందరో మహా పురుషులలో అనంతపురం జిల్లా పెనకచర్లకు చెందిన పెనకచర్ల చితంబరస్వామి ఒకరు ఆయన 18వ శతాబ్ధం ఉత్తరార్ధంలో 1772లో శింగనమల గ్రామంలో ఒక వైదిక కుటుంబంలో జన్మించారు.

చితంబరస్వామి చిన్న వయసులోనే అమోఘ వాక్కు, అద్వితీయ వైదుష్యాలు ప్రదర్శించారు. ఉపనయనానంతరం వేదాంతవేత్తగా విద్వద్గోష్ఠులలో పాల్గొంటూ అద్భుత లీలలు ప్రదర్శించారు. వివాహమైనా ఆయన సాంసారిక, లౌకిక విషయాలు పట్టించు కోలేదు. తండ్రి హఠాత్తుగా చనిపోవడంతో ఇల్లు గడవడం కష్టమైంది. అయినా భగవంతునిపై భారం వేసి జీవితం గడిపారు.

చితంబరస్వామి ప్రజోత్పత్తి మాఘ బహుళ దశమి నాడు భక్తులను పిలిచి తాను త్రయోదశినాడు సాయంకాలం దేహంచాలిస్తామని, తన దేహాన్ని అదే మఠంలోని మల్లె చెట్టు వద్ద సమాధి చేయాలని ఆదేశించారు. స్వామి మాఘబహుళ త్రయోదశినాడు మల్లికార్జున స్వామి ఆలయంలో లంబికా యోగనిష్ఠులయ్యారు. మూడు రోజులు సమాధిలో ఉండి 7-3-1872 ప్రజోత్పత్తి మాఘ బహుళ త్రయోదశి గురువారం, శివరాత్రి సాయంకాలం చితంబర -స్వామి దేహం చాలించారు.

ఇప్పటికీ ఏటేటా శివరాత్రికి ఆయన సమాధి వద్ద పెనకచర్లలో ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి.

## 89. తరిగొండ వెంకమ్మ (1730-1817)

వేదకాలం నుంచి అన్ని కులాల్లోను భగవత్ సాక్షాకారం పొందిన స్త్రీలెందరో ఉన్నారు. అటువంటివారిలో ఆంధ్ర ప్రదేశంలో గొప్ప కవయిత్రిగా యోగ విజ్ఞానానికి సంబంధించిన రెండు ఉత్తమ గ్రంథాలు రచించి, సాహిత్య చరిత్రలో విశిష్ట స్థానం పొందిన మహిళ తరిగొండ వెంకమాంబ. చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకాలోని లక్ష్మీ నరసింహ క్షేత్రం తరిగొండలో కానాల కృష్ణయ్య, మంగమ్మ దంపతులకు లేక లేక కలిగిన సంతానం వెంకమ్మ శైశవ దశ నుంచి తల్లిదండ్రులు లక్ష్మీనరసింహ స్వామిని, వెంకటేశ్వర స్వామిని సేవిస్తుండగా తాను కూడా ఆ సేవలో పాలుపంచుకోవడం ప్రారంభించింది. తరతరాలు సాహిత్య వాతావరణం ఉన్న ఆ యింటిలో సహజంగానే సాహిత్యం భక్తి సంక్రమించాయి.

వయసుతోపాటు ఆమెలో భక్తి కూడా పెరిగి వివాహానికి అంగీకరించలేదు. త్రికరణశుద్ధిగా శ్రీనివాసునకంకితమైన తనను ఎవరితో బలవంతంగా వివాహం చేసిన తండ్రిని విమర్శించారు. అనంతరం మదనపల్లికి చెందిన ఆధ్యాత్మికవేత్త రూపావతారం సుబ్రహ్మణ్య శాస్త్రి వద్ద ఆమె బ్రహ్మోపదేశం పొందారు. భక్తితత్వాన్ని, యోగ శాస్త్ర రహస్యాలను ఆయన నుండి నేర్చుకున్నారు. తీవ్ర సాధనతో జ్ఞానపరిపక్వమైన వెంకమ్మ తరిగొండలోని పుట్టినింటికి తిరిగి వచ్చి లక్ష్మీనృసింహస్వామి ఆలయంలోని ఆంజనేయ స్వామి విగ్రహం చాటున ఏకాంత ప్రదేశంలో యోగ సమాధిలో ఉండేవారు. మిగిలిన సమయాల్లో ఇంటివద్ద భక్తి కవితా రచనలు చేసేవారు. నృసింహ శతకం, నృసింహ విలాస కథ యక్షగానం, శివవిలాస యక్షగానం రాజయోగామృత సారం అనే తాత్విక ద్విపద కావ్యం, బాలకృష్ణ నాటకం అనే యక్షగానం రచించారు.

ఆమెను ద్వేషించిన గ్రామాన్ని విడి మొగలి పెంటకోన చేరి అక్కడి ఆంజనేయ స్వామి సన్నిధిలో పద్మాసీనయై వెంకటేశ్వర స్వామిని ధ్యానిస్తూ తీవ్ర తపస్సు చేశారు. వెంకటేశ్వర స్వామి ప్రత్యక్షమై తన సన్నిధికి రమ్మని ఆదేశించడంతో తిరుపతికి చేరింది. అక్కడ హయగ్రీవ మంత్రోపదేశం పొందిన వెంకమ్మాంబ విష్ణు పారిజాత యక్షగానం రచించారు. అక్కడఏకాంతానికి భంగం కలగడంతో తుంబురుకోనకు చేరి కఠోర సాధన చేస్తూ తీరిక సమయంలో చెంచు నాటకం యక్షగానం రచించారు. తిరిగి కొందరి కోరికపై తిరుమల చేరిన వెంకమ్మ తులసీ బృందావనం పెంచి, ఆ చెట్లకు నీళ్ళ కోసం బావి తవ్వించారు. ప్రతి ఏటా లక్ష్మీనరసింహస్వామి జయంతోత్సవాలు జరిపేవారు. ద్విపద భాగవతం, వెంకటాచల మహాత్మ్యం, జలక్రీడా విలాసం, ముక్తి కాంతా విలాసం, యక్షగానాలు, వశిష్ఠ రామాయణం ద్విపద కావ్యం, కీర్తనలు, పద్యాలు, పాటలు, తత్వాలు, సంవాదాలు, ఎన్నో రచించారు. జిజ్ఞాసువుల కుతత్వోపదేశాలు చేసిన దివ్య సారస్వత మూర్తి, ఆధ్యాత్మిక తేజోరాశి వెంగమాంబ. ఈశ్వర నామ సంవత్సర శ్రావణ బహుళ షష్ఠి ఆదివారం 3-8-1817న వెంకటేశ్వర స్వామి పాదాలలో లీనమయ్యారు. ఆమె నిత్యం ధ్యాన సమాధిలో కూర్చుండే చోటనే ఆమెను

మహాసమాధి చేశారు. ఈనాటికీ వెంకమ్మ సమాధి వద్ద నిత్య పూజతో పాటు, శుక్రవారం నాడు విశేష పూజలు జరుగుతున్నాయి.

## 90. సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి (1560 - 1750)

అద్వైత సాహిత్య చరిత్రలో విశిష్ట స్థానాన్ని పొందిన సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతికి తల్లిదండ్రులు చేసిన నామకరణం శివరామకృష్ణయ్య. తంజావూరు శాహజీ మహారాజు (1684 - 1712) నుండి 1693 లో తిరువిశనల్లూరి అగ్రహారాన్ని పొందిన మోక్షం సోమ సుందరం అవధాని, పార్వతీదేవి దంపతులకు జన్మించారు. ఈయనను భిక్షుగుప్తుడనే వాడుక పేరుతో కూడా పిలిచేవారు. ఈ భిక్షుగుప్తుడే తరువాత కాలంలో శ్రీశుకుని బ్రాహ్మీమయస్థితి, జడభరతుని వైరాగ్యం, ఋషభ దేవుని తపస్సు పుణికి పుచ్చుకుని శ్రీ సదాశివ బ్రహ్మేంద్ర స్వామిగా పరిణతి చెందారు.

బాల్యంలోనే వివాహమైన శివరామకృష్ణయ్య 15 ఏళ్ళ వయస్సులోనే తర్క, వ్యాకరణాలు, శృతి, స్మృతులు, సంగీత సాహిత్యాలు కరతలామలకంగా అభ్యసించారు. గురుకులంలో చదువు కుంటున్న రోజుల్లోనే ఆయన సంసారంపై విరక్తి చెంది సద్గురువు కోసం అన్వేషిస్తూ కాంచీ -పురం చేరారు. అక్కడ కంచి జగద్గురు పీఠం 57 వ పీఠాధిపతి పరమ శివేంద్రులను (1538-1586) దర్శించి సన్యాస దీక్షను కోరారు. ఆయన శివరామకృష్ణయ్యకు సన్యాసంతో పాటు 'సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి' అనే దీక్షా నామాన్ని కూడా ప్రసాదించారు. సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి కారణ గురువుల సన్నిధిలో ఆరేళ్ళ పాటు సమస్త వేదాంత గ్రంథాలను అధ్యయనం చేసి నిరంతర సాధనతో మహాపండితుడుగా గొప్పయోగిగా పరిణతి చెందారు. అతి త్వరలో ఆయనకు అద్వైత సిద్ధి, యోగసిద్ధి ప్రాప్తించాయి.

గురువు అనతితో పతంజలి బ్రహ్మ సూత్రాలకు 'బ్రహతత్త్వ ప్రకాశికావృత్తి' పేరిట, యోగసూత్రాలకు 'యోగసుధాకర వృత్తి' పేరిట, ద్వాదశోపనిషత్తులకు 'దీపిక' పేరిట వ్యాఖ్యానాలు రచించారు. ఇవిగాక 'శివయోగ ప్రదీపిక', 'ఆత్మవిద్యావిలాసం', 'ఆత్మానాత్మ వివేకం', 'ఆత్మాను సంధానం', 'స్వానుభూతి ప్రకాశిక', 'బ్రహ్మామృతవర్షిణీ', 'దక్షిణామూర్తి ధ్యానం', 'కైవల్యోపనిషద్దీపికా', 'మహావాక్యార్థ సాధన', 'మనీషాపంచకం'పై తాత్పర్యదీపిక, ఆత్మపంచకంపై 'సారికా', సర్వవేదాంత సార సంగ్రహం, 'సిద్ధాంత వేశ సంగ్రహం'పై సిద్ధాంత కల్పవల్లీ', శివమానస పూజ', 'అద్వైత రస మంజరి', 'భాగవత సంగ్రహం, సూత సంహితా సార సంగ్రహం' వంటి మహా గ్రంథాలను సంస్కృత భాషలో రచించారు. కాగా స్థితప్రజ్ఞుడైన ఆత్మజ్ఞాని, సత్పురుషుని లక్షణాలు, అనుభవాలు చిత్రీకరించే 65 శ్లోకాలతో ఆయన రచించిన 'ఆత్మవిద్యా విలాసం' ఒక విశిష్ట గ్రంథం.

వేదాంత గ్రంథాలు పండితులు, వేదాంత జిజ్ఞాసువులకే పరిమితంగా ఉంటాయనే

భావనలో, సామాన్య జనులకు కూడా అందుబాటులో ఉండే రీతిలో భక్తి సంగీత కీర్తనలను ఎన్నింటినో సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి రచించారు. వాటిలో ప్రస్తుతం 23 మాత్రమే లభ్యమవుతున్నాయి. వాటిలో 12 సగుణబ్రహ్మ సంకీర్తనలు, నిర్గుణబ్రహ్మ సంకీర్తనలు ఈ కీర్తనలన్నింటిలోను 'పరమహంస', 'హంస' అనే ముద్ర ఉంటుంది. వీటిని ప్రతిరోజూ మనం ఆకాశవాణి భక్తి సంగీత కార్యక్రమాలలోను, సంగీత సభల్లోను వింటూనే ఉంటాం. భజరే గోపాలం, స్మర వారం వారం, బ్రూహి ముకుందేతి, మానస సంచరరే, గాయత్రి వనమాలీ, క్రీడతి వనమాలీ, భజరే యదునాథం, భజరే రఘువీరం, ప్రతి వారం వారం, చేతః శ్రీరామంచింతయ, పిబరే రామరసం, ఖేలతి మమ హృదయే, ఖేలతి పిండాడే, స్థిరతా నహినహిరే, నహిరే నహిశంకా, చితానాస్తికుల, బ్రహ్మై వాహంకిల, సర్వం బ్రహ్మమయం, తద్వజ్జీవత్వం బ్రహ్మణి, పూర్ణబోధోహంచ ఆనంద పూరణ బోధోహం సతతం, ఆనంద పూరణ బోధోऽహం, జయతుంగ తరంగే గంగే', కీర్తనలు శ్రుతి శుద్ధంగా, భావభరితంగా ఉంటాయి.

ఆయన తన యోగశక్తితో ఎన్నో అద్భుతాలు, లీలలు ప్రదర్శించారు. ఆయన చరమ జీవితం అఖండ కావేరీతీరంలోని నెరూరులో గడిపారు. 1750లో వైశాఖ శుద్ధ దశమినాడు నెరూరు గ్రామం శివార్లలో పుదుక్కోట రాజు సిద్ధం చేయించిన భూగృహంలోకి దిగి సజీవ సమాధి అయ్యారు. ఆయన ఆరాధనోత్సవాలు వైశాఖ శుద్ధ పంచమి శంకర జయంతి నాడు ప్రతి ఏటా ప్రారంభమై దశమినాడు ముగుస్తాయి.

తన రచనల ద్వారా లోకానికి బ్రహ్మజ్ఞానం పంచిన ఆదర్శయోగి, స్వయం బ్రహ్మజ్ఞాని, జీవన్ముక్తుడు, పరమహంస - సదాశివబ్రహ్మేంద్ర సరస్వతీ స్వామి.

## 91. త్రైలింగ స్వామి (1607 - 1887)

కాశీలో విశ్వేశ్వరునితో సమానంగా నిత్య పూజలందుకుంటున్న త్రైలింగ స్వామి కాశీక్షేత్ర పాలకుడైన కాలభైరవుని శాంత భక్తుడు, కాళికాదేవికి ప్రియభక్తుడు. రామకృష్ణ పరమహంస (1836 - 1886). త్రైలింగ స్వామి ఉనికి వల్లనే కాశీక్షేత్రం పవిత్రమైనదంటూ, ఆయనను నడిచే విశ్వనాధుడుగా కీర్తించాడు. త్రైలింగ స్వామి యోగ విద్యను, అష్టసిద్ధులను సొంతం చేసుకుని 280 ఏళ్ళు ఈ భూమిపై జీవించి స్వచ్ఛందంగా దేహత్యాగం చేసిన మహాయోగి త్రైలింగస్వామి ఆంధ్రుడు కావడం విశేషం.

త్రైలింగ స్వామి అసలు పేరు శివరామయ్య. విశాఖ పట్నం జిల్లా విజయనగరం సమీపంలోని హోలియా గ్రామంలో సంపన్న బ్రాహ్మణ దంపతులు విద్యావతీ నరసింహారావుల ఏకైక సంతానంగా శివరామయ్య ప్లవంగ నామ సంవత్సర పుష్యశుద్ధ ఏకాదశి శనివారంనాడు రోహిణీ నక్షత్రంలో (19-12-1607) న జన్మించారు. తల్లి విద్యావతి శివభక్తురాలు. ఆమె ఒకనాడు పూజలో ఉండగా శివలింగం నుంచి ఒక కాంతి రేఖ వెలువడి శివరామయ్యలో

లీనమైంది. శివరామయ్య పెరిగి పెద్దయిన తరువాత సుఖ భోగాలకు, ప్రాపంచిక విషయాలకు విముఖుడుగా ఉండేవారు. తల్లి ఆయనకు భక్తి యోగాలు ఉపదేశించారు. తన 40వ ఏట తండ్రి, 52వ ఏట తల్లి మరణించటంతో బంధాలు వీడిన శివరామయ్య తన తండ్రి ఆస్తి నంతటినీ సవతి సోదరుడు శ్రీధరునికిచ్చి 20 ఏళ్లపాటు హోలియా శ్మశానంలో యోగసాధన చేశారు. అనంతరం స్వగ్రామం విడిచిన శివరామయ్య 1679లో పాటియాలా సంస్థానంలోని బస్తూర్ ప్రవేశించి భగీరథ స్వామిని దర్శించారు. ఆయనతో పాటు పుష్కర తీర్థానికి వెళ్లి అక్కడే తన 78 వ ఏట భగీంథ స్వామి నుండి సన్యాసము, గణపతి అనే దీక్షానామం స్వీకరించారు. అనంతరం గురువుగారి ఆశ్రమంలోనే గణపతి స్వామి 10 సంవత్సరాలకు పైగా సాధనచేసి అనేక అద్భుత శక్తులు గడించారు. భగీరథ స్వామి 1696లో సిద్ధి పొందిన తరువాత గణపతి స్వామి ఆశ్రమం విడిచి తీర్థ యాత్రలు చేస్తూ 1697లో సేతు బంధ రామేశ్వరం చేరారు. అక్కడ ఒక బ్రాహ్మణ బాలుని శవంపై మంత్రజలం చల్లి ఆ బాలుని బ్రతికించడంతో ఆయన మహిమలు రామేశ్వరం అంతటా వ్యాపించాయి. రెండు సంవత్సరాల తరువాత సుధామపురి చేరారు. అక్కడి నుండి 1710లో నేపాల్ అడవులు చేరి అక్కడ కాయకసరులు తింటూ తపస్సు చేసుకుంటూన్న గణపతి స్వామి వద్దకు ఒకరోజున వేటగాళ్ల తుపాకి దెబ్బను తప్పించుకుని ఒక పులి వచ్చి ఆయన పాదాల వద్దకు చేరగా దానికి అభయమిచ్చి రక్షించారు. జీవం పోయలేని వారికి జీవిని చంపే హక్కు లేదని ఆయన పులి వేటకు వచ్చిన రాజ బంధువులకు హితవు చెప్పారు. ఖాట్మండు మహారాజుకు దీక్ష ఇచ్చారు. అక్కడ తన ఏకాంతానికి భంగం కలగటంతో గణపతి స్వామి అక్కడి నుంచి 1707లో త్రివిష్టపం చేరారు. అక్కడ అనేక చోట్ల యోగ సాధన చేసి మానస సరోవర ప్రాంతం చేరారు. అక్కడ పాముకాటుకు మృతి చెందిన ఐదేళ్ల బాలుని తన స్పర్శతో బ్రతికించి అదృశ్యుడై కొండ లోయల్లో సాగిపోయారు.

అలా చాలాకాలం హిమాలయాల్లో సాధన చేసి నర్మదా నదీ తీర్థంలోని మార్కండేయాశ్రమం చేరారు. అనంతరం 1733లో ప్రయాగ క్షేత్రం చేరి అక్కడ కొన్ని మహిమలు ప్రదర్శించారు. గణపతి స్వామి తన 130వ యేట 1737లో మాఘ మాసంలో కాశీ క్షేత్రం చేరి అక్కడ 1,50 ఏళ్ల పాటు సంచరించి గంగా నదీతీరాన అనేక ఘట్టాల్లో యోగ సాధన చేశారు. దిగంబరుడై, 300 పౌనుల బరువైన దీర్ఘ కాయంతో, కుండ బొజ్జతో, మెడలో పెద్ద రుద్రాక్షమాలతో కాశీవీధులు తిరిగిన గణపతి స్వామిని ప్రజలు సచల విశ్వనాధుడు అనేవారు. గంగా తరంగాలపై గంటల తరబడి రాజహంస వలె తేలియాడేవారు. కొంతకాలం తరువాత ఆయనను తెలుగు వానిగా గుర్తించిన ప్రజలు 'త్రైలింగ స్వామి' అని పిలవడంతో ఆ పేరు వ్యాప్తిలోకి వచ్చింది.

త్రైలింగ స్వామి 1800లో పంచ గంగా ఘట్టంలోని బిందుమాధవ్‌లో బస ఏర్పాటు చేసుకుని అప్పటి నుండి మహా సమాధి అయ్యే వరకు మౌన వ్రతం పాటించారు. త్రైలింగ

స్వామి కాశీలో ఎన్నో మహిమలు చూపారు. 1868లో రామకృష్ణ పరమహంస కాశీకి వచ్చినప్పుడు తమ మేనల్లుడు హృదయనాథ్‌తో కలిసి స్వామిని దర్శించి పాయసం తినిపించారు.

త్రైలింగ స్వామి అవతారం చాలించేందుకు ఆరేళ్ళ ముందుగానే ఆ విషయాన్ని ఉమాచరణ ముఖోపాధ్యాయునికి చెప్పారు. 10 రోజులకు ముందే పంచ గంగా ఘట్టంలో ఒక స్థలం ఎంపిక చేసి చిన్న భూగృహం నిర్మింపచేసుకొని 10వ రోజున ఉదయం ఆ భూగృహంలోకి పోయి తలుపు వేయించుకున్నారు. మధ్యాహ్నం వరకు యోగ సమాధిలో ఉండి బయటికి వచ్చి అందరికీ వీడ్కోలు చెప్పి మరల యోగాసనంలో కూర్చున్నారు. అదే రోజు సాయంత్రం సర్వజిత్ పుష్యశుద్ధ ఏకాదశి (26-12-1887)న బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకుని విశ్వ చైతన్యంలో విలీనమయ్యారు. నాటి నుండి ఆ మఠంలో ఆయన విగ్రహానికి నిత్యపూజలు జరుగుతున్నాయి త్రైలింగ స్వామి సంస్కృతంలో రచించిన మహావాక్య రత్నావళి వ్యాఖ్యా బెంగాలీ భాషలో ప్రచురితమైంది.

ఇలా అణిమాద్యష్టసిద్ధులకు ప్రతీక కుంబకయోగి త్రైలింగ స్వామి.

## 92. పూదోట లింగావధూత (17వ శతాబ్దం)

విశ్వమానవ జాతిలో జాతి, వర్ణ, మత భేదాలను, శివ కేశవ భేదభావాన్ని పోగొట్టి ఏకత్వాన్ని ప్రబోధించిన అద్భుత యోగి పూదోట లింగావధూత. పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి ఆశయాలు కొనసాగించేందుకు దాదాపు రెండు మూడు దశాబ్దాలు తరువాత అవతరించి సమాజానికి ధర్మమార్గాన్ని భక్తిజ్ఞానాన్ని, శాంతి ప్రేమలను వ్యాపింపచేసిన మహాయోగి పూదోట లింగావధూత.

కర్నూలు జిల్లా పాలేరు నదీతీరంలోని అవుకు గ్రామంలో సోమమ్మ, సోమిరెడ్డి దంపతులకు జన్మించిన బిడ్డకు లింగమూర్తి అను పేరు పెట్టారు. ఐదవ ఏటనే ఇంటిప్రక్క చెట్టుక్రింద శివనామ జపంచేస్తూ జాతి భేదం లేకుండా అందరితో ఆడుకునేవాడు. బాల్యంలోనే తల్లిదండ్రులను కోల్పోయి అనాధుడైన లింగమూర్తిని అవుకు గ్రామంలోని పెద్ద అచ్చమ్మగారి చింతమాను మఠంలో చేరాడు. లింగమూర్తికి ఏగంటి శివరామ స్వామి గురుడు మంత్రోపదేశం చేసి శివలింగ గుహకు తీసుకువెళ్ళాడు. అక్కడ లింగమూర్తి క్రమశిక్షణతో అతి త్వరలో సమస్త రహస్యాలు ఆకళింపు చేసుకున్నాడు. లింగమూర్తి శివరామగురుని వద్ద హంస విద్యను అతి త్వరలో నేర్చుకున్నాడు. గురుశుశ్రూషలో పన్నెండేళ్ళపాటు దృశ్యఛేదనయోగం, చైతన్యజడ సంధాన చిన్మయ యోగం వంటి అనేక యోగాలను నేర్చి యోగ విద్యలో పరిపూర్ణుడయ్యాడు.

అనంతరం శివరామగురుడు 'పూదోట గురుపీఠం' స్థాపించి, దానికి లింగమూర్తిని ప్రథమ పీఠాధిపతిగా చేసి, అతనికి 'పూదోట లింగావధూత' అని నామకరణం చేశాడు. ఆ

మతాధిపతిగా విశ్వమతాన్ని స్థాపించి, వేదాలను, వేదమతాన్ని సంకెళ్ళ నుండి విడిపించి విశ్వమానవాళికి అందుబాటులో తేవాలని ఆజ్ఞాపించాడు.

అనంతరం ఆయన రవ్వలకొండ గుహల్లో కౌపీనం మాత్రం ధరించి ఉండేవారు. అక్కడి వారికి ఎన్నో మహిమలు చూపుతూ అప్పుడప్పుడు ఆశువుగా వేదాంతతత్త్వాలను, తేటతెలుగులో పాడేవారు. ఆ తత్త్వాలు పండితులను, పామరులను కూడా ఆకర్షించేవి. అలా పాడిన తత్త్వాలన్నింటినీ ఆయన ఆశ్రమ వారసుడు 'పూదోట తత్త్వ గీతామృతం' పేరుతో 13 దళాలుగా 715 పాటలను తాటాకులపై వ్రాశాడు. ఆ గ్రంథం ఆ పీఠానికి 10వ అధిపతి శ్రీ ఆనందనాస్వామి 1962లో ప్రకటించారు. ఈ తత్వగీతామృతంలో మంత్రయోగ, దృష్టి, లయయోగ, హఠయోగ, రాజయోగాలను వివరించే గీతాలున్నాయి. వేదవ్యాసుని తరువాత విశ్వమండల సాధనకు బోధించిన యోగి పూదోట లింగావధూత యేనని తెలుస్తోంది. ఒకనాడు లింగావధూత అఖండ సమాధిలో ఉండగా ఆంజనేయ స్వామి ప్రత్యక్షమై అవధూత దేహం చాలించే సమయం ఆసన్నమైనట్లు చెప్పారు. అవధూత శిష్యులకు ఈ విషయం చెప్పి జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ నాడు దాసావధూతను పీఠాధిపతిగా పట్టం కట్టారు. జ్యేష్ఠ బహుళ ఏకాదశి నాడు సంగమేశ్వర తీరాన చిన్న వనం చేరారు. భక్తుల జయ జయ ధ్వానాల మధ్య అవధూతస్వామి కృష్ణానదిలో మోకాలిలోతు నీటిలోకి పోయి భక్తులకు చరమ సందేశంగా ఒక గీతాన్ని ఆలపించి అంతకుముందే దాసావధూత కృష్ణా తరంగాలపై పరచిన కృష్ణాజినంపై పద్మాసనంలో కూర్చుని ప్రవాహ మధ్యలోకి వెళ్ళారు. ఆయన దేహం చుట్టూ మంటలు లేచి అవి ప్రకాశంగా మారి సూర్యమండలం వైపువెళ్ళిపోయాయి. జ్ఞానేశ్వరి లింగ దేవుని ఆత్మబింబంలో చేరిపోయింది.

పూదోట లింగావధూత స్వామి ఆరాధనోత్సవాలు ఏటేటా జ్యేష్ఠ బహుళ ద్వాదశినాడు అన్ని మఠాల్లోను నేటికీ వైభవంగా జరుగుతున్నాయి.

శివకేశవా భేదాన్ని చాటిన మహనీయుడు, శివాంశ సంభూతుడు - పూదోట లింగావధూత స్వామి.

## 93. లింగందిన్నె ధరణి సీతారామ యోగీంద్రస్వామి (1714-1796)

త్రేతాయుగంలో 16 అవతారాలెత్తిన త్రిమూర్త్యాత్మక దత్తాత్రేయ స్వామి కలియుగంలోను, చారిత్రక యుగంలోను కూడా ఎన్నో అవతారాలెత్తారు. ఆక్రమంలో వసిష్ఠ గోత్రీకులలో కాశీ నుండి ఆంధ్రకువచ్చిన తర్కశాస్త్రం మాధవభట్టు సంతతివారిలో ధరణి సుబ్బయ్య, తిమ్మాంబ దంపతులకు మూడవ సంతానముగా కడపజిల్లా, ప్రొద్దుటూరు తాలుకా, కొట్టైపారులో జయనామ సంవత్సర పుష్య బహుళ చవితి సోమవారం (4-1-1714) న జన్మించిన శిశువుకు సీతారామస్వామి అని పేరుపెట్టారు. నాలుగేండ్ల ప్రాయంలోనే తండ్రి సుబ్బయ్య

చనిపోవడంతో సీతారామస్వామి కొట్టిపాడు సమీపంలో ఆవులను మేపుతూ వాగు గడ్డపై ఉన్నగుడి వద్ద ఆడుకుంటూ వుండగా ఒక యోగివచ్చి అతనిని వ్యవర్చస్సు గమనించి నాలుకపై బీజాక్షరాలు వ్రాసి మంత్రోపదేశం చేశాడు. అప్పటినుండి సీతారామస్వామి దత్తాత్రేయోపాసకుడై అనేక మహిమలు ప్రదర్శించారు. కొంతకాలానికి తల్లి అనుమతితో బ్రహ్మచర్యం పాటించి సన్యాసం స్వీకరించారు. వివిధ పుణ్యక్షేత్రాలను సందర్శించి నల్లమల కొండల్లోని శ్రీశైలం, అహోబలంలో తపస్సు చేసి భగవత్ సాక్షాత్కారం పొందారు. అష్టసిద్ధులను హస్తగతం చేసుకున్నారు. తరువాత దేశ సంచారం చేస్తూ ధర్మ ప్రబోధం చేశారు. గ్రామాల్లో అంటువ్యాధులు తొలగించటం, వ్యాధి బాధితులకు ఆరోగ్యం ప్రసాదించటం, ఆపదలో ఉన్నవారిని ఆదుకోవడం, భక్తుల అభీష్టాలు నెరవేర్చటం వంటివి నిత్య కార్యక్రమాలుగా చేపట్టారు. కొంతకాలానికి భక్తుల ప్రార్థనపై సీతారామస్వామి కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ సమీపంలోని లింగందిన్నెలో తపస్సు కోసం ఒక స్థావరం ఏర్పరచుకుని ఆశ్రమాన్ని, శివాలయాన్ని, తటాకాన్ని, వనాన్ని నిర్మింపజేశారు. ఇంకా అనేక చోట్ల నందీశ్వరాలయం, దత్తాత్రేయ మఠం, తోటలు, బావులు, గ్రామాలు, ఆలయాలు ఏర్పాటు చేశారు. జీర్ణ దేవాలయాలను ఉద్ధరించారు. ఎన్నో మహిమలను ప్రదర్శించి ఎందరో శిష్యులను బహు గ్రంధ రచనలకు ప్రోత్సహించి సాహిత్య సేవ చేశారు.

త్రికాలజ్ఞులైన సీతారామ స్వామి నలనామ సంవత్సర మార్గశిర బహుళ తదియ శనివారం (17-12-1796)న సమాధిలోకి ప్రవేశించారు. ఆయన సజీవ చైతన్యంతో 700 ఏండ్లు తపోనిష్ఠలో ఉంటామని భక్తులకు అభయమిచ్చారట. దత్తావతారుడు మైసూరు గణపతి సచ్చిదానందస్వామి తనకు సీతారామ యోగీంద్రుల సాక్షాత్ దర్శనమైనట్లు తెలిపారు.

సీతారామ స్వామి సమాధి అయిన నాటి నుండి ప్రతి ఏటా మార్గశిర పౌర్ణమి నుంచి మూడు రోజులపాటు ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి. ఇప్పటికీ స్వామివారి సజీవ చైతన్య సమాధిని దర్శించి భక్తులు అభీష్టాలు నెరవేర్చుకుంటున్నారు.

## 94. సొరకాయలస్వామి (1700-1902)

సత్యం, దయ, పరోపకారం, పతితులను, దుఃఖితులను ఆదుకోవడమే మతంగా, ధ్యేయంగా 500 ఏళ్ళు జీవితాన్ని గడిపిన మహాయోగి సొరకాయల స్వామి. ఆయన తిరుపతి సమీపంలోని ఒక గ్రామంలో నిరుపేద గొల్ల కుటుంబములో రామస్వామి పేరుతో క్రీ.శ. 1700.లో జన్మించి ఉండవచ్చునని చరిత్రకారులు భావిస్తున్నారు. ఆయన 1902లో సిద్ధి పొందడానికి ముందు మద్రాసు వచ్చినప్పుడు ఎవరో అడిగితే తన వయస్సు 500 సంవత్సరాలని చెప్పడంతో అలా నిర్ణయించారు.

ఆయన తిరుపతి సమీపంలోని నారాయణవరం కొండకోనల్లో గొర్రెలు, మేకలు కాస్తూ తిరుగుతూ ఉండగా ఒక యోగి పుంగవుడు ఆయనకు మంత్రోపదేశం చేసినట్లు, ఆనాటినుండి ఆయనకు ఇహలోక సంబంధాలు తెగిపోయినట్లు చెప్పుకుంటూ వుంటారు. అడవుల్లో తిరుగుతూ ఆ పరిసర ప్రాంతాల్లోని 10 గ్రామాలలోనే తనకు ఆకలైనప్పుడు నాలుగిళ్ళు బిచ్చమెత్తి కడుపు నింపుకునేవారు.

భుజాన గుడ్డలమూట, నెత్తికి ముతకగుడ్డతో చేసిన తలపాగా, మోకాళ్ళ వరకు కట్టిన చిరుగులపంచ, ఒక చేతిలో పేలికలతో అల్లిన తాడుకు కట్టిన రెండు కుక్కలు, భుజంపై కావడి - దానికి ఒకవైపు మలమూత్రాల కుండ మరోవైపు తినటానికి, త్రాగటానికి ఉపయోగపడే సొరకాయబుర్రలు ఇదే సొరకాయలస్వామి అవతారం.

అది వ్యాధి పీడితులకు తాను తినే ఆకులు, అలములు, భోజనం, నీళ్ళుఇచ్చి ఆరోగ్యభాగ్యాలు ప్రసాదించేవారు. దుఃఖితుల బాధలను ప్రేమామృతంతో పోగొట్టేవారు. ఆశ్రితులకు భవిష్యత్తులో ఏర్పడగల ప్రమాదాలను గురించి ముందుగానే హెచ్చరించేవారు. మానవుల విషయంలోనే గాక పశుపక్షి కీటకాలపైన కూడ కరుణచూపాలని ప్రభోదించి మహిమలు చూపటంతో మొదట ఆయనను పిచ్చివానిగా భావించినవారు సొరకాయలస్వామిగా ఆయన అగ్నిహోత్రం వెలిగించిన తరుణంలో దత్తావతారుడుగా ఆరాధించారు. ఎంత దూరమైనా కాలి నడకనే వెళ్లేవారు. సొరకాయలస్వామి అనేక మహిమలు, అద్భుతాలు ప్రదర్శించారు. ఆయన దీనులను, హీనులను, రోగులను, అనాథలను ఆదుకున్న సంఘటనలెన్నో వున్నాయి. పంచభూతాలైన ప్రకృతి శక్తులు ఆయన ఆధీనంలో ఉండేవి. దేశకాలాలకు అతీతుడు, సర్వజ్ఞుడు, భవిష్యత్ జ్ఞాని స్వామి దర్శన స్పర్శన సంభాషణలతో దుష్టగ్రహపీడలు తొలగిపోయేవి. ఆయన తన అవతారం చాలించే విషయాన్ని చాలా ముందగానే సూచించారు. 1902 ఆగష్టులో సొరకాయలస్వామి చివరిసారిగా మద్రాసు చేరారు. తిరిగి నారాయణవరంచేరి అరణి నది ఒడ్డున స్థలాన్ని తామే స్వయంగా శుభ్రం చేసుకుని, చదును చేసుకుని ఒక గులకరాయి విసిరారు. ఆ రాయి పడిన చోటనే ఆయన సమాధి ఉంది. 1902 ఆగస్టు 9న మధ్యాహ్నం 12 గంటలకు పాంచ భౌతిక శరీరాన్ని త్యజించారు. ఆయన ఎంచుకున్న స్థలంలో భక్తులు శాస్త్రోక్తంగా సమాధి చేశారు. ఆరోజు శుభకృత్ నామ సంవత్సర శ్రావణ శుద్ధ (గరుడ) పంచమి శనివారం.

మొదటి సమారాధన రోజున శంఖుస్థాపన జరిగిన పదేళ్ళలోగా సమాధి మందిరం నిర్మాణం జరిగింది. తరువాత సొరకాయలస్వామి పేరిట కైంకర్య సమాజం రత్న సభాపతిపిళ్లై అనే భక్తుని అధ్యక్షతన ఏర్పాటైంది. ఈనాటికీ ఆ సమాజం సమాజసేవ చేస్తూ భక్తులకు వసతి గృహాలు, కళ్యాణమండపాలు, భోజనశాలలు నిర్మించి ప్రతియేటా ఆరాధనోత్సవాలు, నిత్యపూజలు, ప్రతి పౌర్ణమికి మాసోత్సవాలు నిర్వహిస్తున్నారు. మహా సమాధి తరువాత కూడా సొరకాయలస్వామి ఈనాటికీ ఆర్తుల బాధలు తొలగిస్తూ భక్తుల పాలిట కొంగు బంగారంగా ఆదుకుంటున్నారు.

## 95. శ్రీధర వెంకటేశ అయ్యావాళ్ (1635 - 1720)

సదాశివ బ్రహ్మేంద్ర స్వామి సహాధ్యాయి, గురువు, పండితుడు, కవి అయిన శ్రీధర వెంకటేశ అయ్యావాళ్ వైదిక బ్రాహ్మణ కుటుంబంలో కౌశిక గోత్రీకుడు శ్రీధలింగార్యుని కుమారుడుగా 1635లో జన్మించారు. ఆయన గొప్ప శివభక్తుడు. గృహస్థ రాజయోగి. తంజావూరు మహారాజు శివాజీ కావేరీ తీరంలో గల తిరువిశనల్లూరు అనే గ్రామాన్ని శాహరాజపు అని పేరు. మార్చి

1693లో అక్కడి 46 మంది పండితులకు దానమిచ్చారు. ఆ దాన ప్రతి గ్రహీతల్లో శ్రీధర వెంకటేశ అయ్యావాళ్ ఒకరని కొందరు భావిస్తున్నారు.

మధ్యార్జునం అనే మరో పేరు గల తిరువిడమరుదూరులోని మహాలింగస్వామి శ్రీధర వెంకటేశుని ఇష్టదైవం కాగా ఆయన భజన సంప్రదాయానికి ఆద్యప్రవర్తకుడు. సంస్కృతంలో అనేక గ్రంథాలు వ్రాశారు. శాహేంద్ర విలాసం అనే ఎనిమిది సర్గల మహాకావ్యాన్ని, భక్తి వేదాంత పరంగా ఆఖ్యాషష్టి, దయాశతకం, ఆర్తిహర స్తోత్రం, కుళీరాష్టకం, అచ్యుత శతకం, శివభక్త లక్షణం, శివభక్తి కల్పలతికా, మాతృ భూతాష్టకం, తారావళీ స్తుతి, స్తుతి పద్ధతి, డోలా నవరత్నమాల, దోషపరిహారాష్టకం, భగవన్నామ భూషణం గ్రంథాలు రచించారు. శాహాజీ మహారాజు కోరికపై నల్లాధ్వరి, వెంకటేశ్వర శాస్త్రి అనే ఇరువురు పండితులతో కలిసి 'పదమణిమంజరీ' అనే శబ్దకోశాన్ని సంకలనం చేశారు.

శ్రీధర వెంకటేశుని శివకేశవ భేదరహిత భక్తి, శమాధి షట్క సంపత్తి, సర్వభూత దయా గుణాలకు ఆయన సమకాలీనులు ఆయనను 'అయ్యావాళ్' అని పిలిచి కొలిచేవారు.

అయ్యావాళ్ నిరంతరం భగవద్ధ్యాన సమాధిలో ఉండి అనేక అద్భుత శక్తులను పొందారు. ఆయన పిలిస్తే దైవం పలికేవాడు. ఎన్నో అద్భుతాలు ప్రదర్శించారు. సమాజ సంక్షేమం కోసం, ఆర్తత్రాణ పరాయణులను ఆదుకోవడం కోసం తన శక్తులను వినియోగించిన దయాంతః కరుణుడు అయ్యావాళ్.

ఒకసారి తిరువిశ నల్లూరులో అనావృష్టి సంభవించగా కుళీరాష్టకం స్తోత్రం చేసి వానలు కురిపించారు. మృత్యువాతపడిన శిశువును తారావళీస్తోత్రం చేసి రక్షించారు. ఇంకా ఎన్నో లీలలు, అద్భుతాలు ప్రదర్శించారు. తాను సిద్ధి పొందే విషయం ముందుగానే భక్తులకు, శిష్యులకు చెప్పారు. భగవన్నామ సంకీర్తనకు ఉచ్చనీచభేదం ఉండకూడదని బోధించారు. ఒకనాడు కావేరీ నది దాటిన తమ ఇష్ట దైవమైన మహాలింగేశ్వరస్వామిని అర్చించటానికి తిరువిడమరుదూరుకు వెళ్లారు. అక్కడ గర్భాలయంలో ప్రవేశించి అదృశ్యులయ్యారు. ఆ విధంగా పరమశివునిలో ఐక్యమైన మహాయోగి, వర్ణాశ్రమ భేదం లేకుండా సర్వమానవులపై ప్రేమాదరాలు కురిపించిన మహాత్ముడు, మానవత్వపు విలువలు పాటించిన మహితాత్ముడు , మహాసంస్కర్త - శ్రీధర వెంకటేశ అయ్యావాళ్.

## 96. సనారీ విశ్వనాథావధూత (1856 - 1914)

కాలజ్ఞానాలు చెప్పిన ఆంధ్ర యోగుల్లో పోతులూరి వీరబ్రహ్మం విష్ణువు అవతారంగాను, సనారీ విశ్వనాథావధూత కాశీ విశ్వేశ్వరుని అవతారంగాను ప్రసిద్ధులు. ఆయన జననాన్ని గురించి చరిత్రకారులు తర్జన భర్జనల అనంతరం నలనామ సంవత్సరం కార్తీక శుద్ధ పంచమి సోమవారం 3-11-1856గా నిర్ణయించారు. శ్రీకాకుళం జిల్లా నాగావళీ నదీ తీరంలోని పాలకొండకు చెందిన సింహాద్రి వీరాచారి, గౌరీదేవి అనే భక్త దంపతుల పుణ్యక్షేత్ర సందర్శన ఫలంగా జన్మించిన విశ్వనాథాచార్యులు ఏక సంథాగ్రాహియై ఐదేళ్ల ప్రాయంలోనే కావ్యాలు,

ఇతిహాసాలు, వేదశాస్త్రాలు ఆములాగ్రం అభ్యసించారు. రసవాద విద్యలో నిపుణులయ్యారు. చిన్న వయసులోనే తల్లిదండ్రులు మరణించడంతో పెద తండ్రి కుమారుడు నీలయ్యాచార్యుని వద్ద పెరిగిన విశ్వనాధుడు ప్రతినిత్యం ఉదయమే స్నానానుష్ఠానాలు పూర్తి చేసుకుని ఊరిబయటి ఆలయంలో శివుణ్ణి అర్చించి తాటాకులపై ఏదోరాస్తూ ఉండేవారు. అతని వైరాగ్యలక్షణాలు గమనించిన నీలయ్యాచార్యులు విశ్వనాధునికి పంచబాణ విద్యలన్నీ నేర్పాడు. విశ్వనాధయ్య అతి స్వల్పకాలంలోనే కల్హు, ఇనుము, రాగి, బంగారు, శిలల పనులలోను, తాస్షా కుస్తగిరి మలామా నగిషీ కుందనం చెక్కడాల్లోను నిపుణుడయ్యారు. విశ్వనాధయ్యకు నీలమాచచార్యులు పెండ్లి ప్రయత్నాలు చూస్తుండగా తనకోసం పాలకొండ సమీపంలోని ఉత్తరాపల్లి గ్రామంలో పెరుగుతోందని చెప్పి అన్నను వారించి ఆయనే స్వయంగా ఆ ఊరు వెళ్లగా అక్కడ అన్నపూర్ణ అనే కన్య విశ్వనాధయ్యను చూచి కాశీ విశ్వేశ్వరుని అవతారంగా గుర్తించి అతడే తన భర్త అని తల్లిదండ్రులకు చెప్పింది. ఆ యిరువురికి 1873 వైశాఖ శుద్ధ ఏకాదశి శుక్రవారం నాడు వివాహం జరిగింది. విశ్వనాధయ్య అన్నపూర్ణకు అజపా గాయత్రి బోధించి తాను రాజయోగిగా గృహస్థాశ్రమం పాలించారు. ఎన్నో అద్భుతాలు, మహిమలు ప్రదర్శించాడు. స్వామి తన శిష్యులకు పంచీకరణం, స్థూలసూక్ష్మ కారణ శరీరాలు, షట్చక్రాలు, కాలప్రమాణం, చతుర్విధాశ్రమ లక్షణాలు, ప్రాణాయామ విధానం బోధించారు. కొంతకాలం తరువాత సనాతన ధర్మ ప్రచారం చేసే సంకల్పంతో దేశ సంచారానికి బయలుదేరారు. తిరిగి తిరిగి రాజమహేంద్రవరం చేరి కోటి లింగాలరేవు వద్ద పర్ణశాల నిర్మించుకుని చాలా కాలం తపస్సు చేశారు. తీరిక వేళల్లో భక్తులకు వేదాంత బోధలు చేస్తూ 'సనాలీ విశ్వేశ్వర సంవాదం' అనే గ్రంథాన్ని రచించారు. ఆ గ్రంథ రచన పూర్తిచేసి 12 ఏళ్ల తరువాత ఆ గ్రంథ ముద్రణ కోసం చెన్నపట్నం బయలుదేరు అనంతరం ఆయన శ్రీశైలం చేరి ఆనందనామ సంవత్సరం కార్తీక శుద్ధ పంచమి శుక్రవారం (23-10-1914) రోజున బదరికా వనం గుహలో అంతర్ధానమయ్యారు. ఇప్పటికీ సజీవంగా ఉండి తమను నమ్మి కొలిచే భక్తులకు అప్పుడప్పుడు శుక్రవారంనాడు దర్శనమిస్తున్నారు. ఆయన స్వగ్రామం పాలకొండ దుర్గా మందిరంలో ఇటువంటి దర్శనాలు నేటికీ లభిస్తున్నాయని భక్తులు చెబుతూ ఉంటారు.

## 97. నెమిళ్ళదిన్నె హుసేన్ గురుడు (1850 - 1929)

కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ తాలూకా చాగలమర్రిలో ఒక వ్యవసాయ ముస్లిం కుటుంబానికి చెందిన పసలచిన్న హుస్సూర్ సాహెబ్, హుసేన్ బూ దంపతులకు 1850లో జన్మించిన దివ్య యోగి నెమిళ్లదిన్నె హుసేన్ ఐదవ ఏటనే పాఠాలతో పాటు ఆధ్యాత్మికత దైవభక్తి బోధించిన గురువు ప్రభావంతో ఇంటి వద్ద ఏకాంతంగా భగవత్ ధ్యానం చేయటం అలవాటైంది. వయసు పెరిగి పెద్ద వాడైనా మార్పులేకుండా భగవద్ధ్యానం పుస్తక పఠనం, సాధు సంతులను సేవించటం కొనసాగుతూనే వచ్చాయి. వివాహమైన తరువాత కూడా హుసేన్ ప్రవర్తనలో మార్పులేదు.

నెమిళ్ళదిన్నెలో గొప్ప భక్తుడు, సాధకుడు అయిన శివనాగమయ్య బోధనలతో భక్తి వైరాగ్యాలు హుసేన్‌కు బాగా వంట బట్టాయి. హుసేన్ విరాగియై బాహ్య ప్రపంచాన్ని మరిచి భగవదన్వేషణలో పిచ్చివానిమాదిరిగా తిరుగుతుండగా ఒక రాత్రి కలలో ఆ మరునాడే కోరిక తీరగలదని హుసేన్‌కు అభయమిచ్చాడు. ఆ మరునాడు చంద్రోదయవేళలో ఒక దింబర అవధూత హుసేన్‌కు సాఖ్య సూత్రం, నాదానందం, పంచముద్రలు, సాకారనిరాకారములు, పరిపూర్ణం, అమనస్కం బోధించి ప్రణవతారకమంత్రం ఉపదేశించాడు. శిరస్సుపై చేతి నుంచి ఆశీర్వదించి అదృశ్యుడయ్యాడు. అప్పుడు హుస్సేన్ అడవిలో ప్రయాణం చేస్తూ ఒక పెద్ద చెట్టు ఎక్కి ఒక విశాలమైన కొమ్మపై వెల్లకిలా పరుండి ధ్యాన నిమగ్నుడయ్యారు. తరువాత భార్యా బంధువుల బంధాలను వదిలించుకుని అడవులలో తిరిగి ఒక గ్రామంలోని అలయంలో బసచేశారు. ఎందరో అయనకు శిష్యులయ్యారు. ఆర్తుల కష్టాలను తీరుస్తూ వింత చేష్టలతో ఎన్నో అద్భుతాలు ప్రదర్శించేవారు.

తన శరీర త్యాగాన్ని గురించి ముందే శిష్యులకు ప్రకటించి శుక్లనామ సంవత్సర ఆశ్వీయుజ బహుళ దశమి ఆదివారం 27-10-1929 రాత్రి 10 గంటలకు దేహం చాలించారు. భక్తులు మరునాటి ఉదయం గురు దేవుళ్ళ యథా విధి సమాధి చేశారు. అనంతరం భక్తులు సమాధి మందిరం నిర్మించి ఉరుసు ఏర్పాట్లు చేశారు. ప్రతి యేట చైత్ర పౌర్ణమినాడు, ఆశ్వీయుజ బహుళ ఏడాది నాడు హుస్సేన్ గురుని ఆరాధనోత్సవాలు జరుపుతారు. ఈనాటికీ ఆ సమాధి భక్తులకు గొప్ప యాత్రా స్థలంగా విరాజిల్లుతోంది.

## 98. సత్తెనపల్లి ఫీరోజీ మహర్షి (1829 - 1889)

వీధి బడిలో సంస్కృతాంధ్రాలు. నేర్చి స్వయంకృషితో పాండిత్యం సంపాదించిన వర ప్రసాది, యోగి ఫీరోజీ మహర్షి. విరోధినామ సంవత్సర ఆషాఢశుద్ధ ఏకాదశి ఆదివారం (12-7-1829) రోజున సత్తెనపల్లి మరాఠా వీధిలో నర్సోజీ, నర్సూబాయి దంపతులకు చిదంబర యోగి ఉపదేశించిన ఆదిత్యమంత్రోపాసన ఫలితంగా జ్యేష్ఠ పుత్రుడుగా ఫీరోజీ జన్మించారు.

ఒకనాడు చిదానంద యోగి సత్తెనపల్లి వచ్చిన సందర్భంలో ఫీరోజీ ఆయన సేవ చేసి అయన దయకు పాత్రుడయ్యాడు. ఆ యోగి తత్వంతో పాటు తారక మంత్రం ఉపదేశించి ఫీరోజీని దీవించి అదృశ్యుడయ్యాడు. అప్పటి నుండి ఫీరోజీ తారక మంత్రం జపిస్తూ వేదాంత గ్రంథాలు చదువుతూ, పద్యాలు, భక్తికీర్తనలు రచించేవారు. సాధు సంతులను కొలిచేవారు. క్రమశిక్షణలో నియమనిష్ఠలతో కాలం గడుపుతూ ఉండగా నూజివీడుకు చెందిన ఘటకాల వెంకోజీ కుమార్తె వీరాబాయితో వివాహమైంది. అనంతరం ఆయనలో ఆత్మ దర్శనాభిలాష పెరిగి పంచదశి, సీతారామాంజనేయ సంవాదం, రామస్తవరాజం, వాసుదేవ మననం,

భగవద్గీత, ఉపనిషత్తుల జ్ఞానసారం కంఠస్థం చేశారు. అనంతరం జమిలి శేషయ్య వద్ద పరిపూర్ణతత్త్వోపదేశం పొందారు. తొమ్మిదేళ్ల బాలుడుగా ఉన్నప్పడే యోగ సిద్ధులు పొందాడు. ఎన్నో మహిమలు, అద్భుతాలు ప్రదర్శించారు.

క్లిష్టమైన అద్వైత వేదాంతాన్ని సులభ రీతిలో బోధించే ఫీరోజీ ప్రబోధాలను వినడానికి దూరప్రాంతాల నుండి కూడా ప్రజలు వచ్చి ఆయనకు శిష్యులుగా, భక్తులుగా చేరారు. ఫీరోజీ మహర్షి కేవలం అద్వైతులు కావడంతో జాతిమత బేధాలు పాటించక అన్ని మతాలవారిని, అన్ని వర్ణాల వారిని తన శిష్యకోటిలో చేర్చుకున్నారు. 60 సవంవత్సరాలు జీవించిన ఫీరోజీ మహర్షి శిష్య సంచారం చేస్తూ అర్హులకు కారణ దీక్ష ఇస్తూండేవారు. చివరిదినాల్లో నిరంతరం రచనా వ్యాసంగం సాగించారు. విరోధినామ సంవత్సర ఆషాఢశుద్ధ ఏకాదశి మంగళవారం (9-7-1889) రాత్రి తన పెద్ద కుమారుడు లక్ష్మాజీరావుకు హితోపదేశం చేసి గురు పీఠం నెలకొల్పవలసిందిగా ఆదేశించి బ్రహ్మరంధ్రం గుండా ప్రాణాలు విడిచి పరబ్రహ్మైక్యం పొందారు. కుమారులు, శిష్యులు ఆయనను తోటలో సమాధి చేశారు. పూర్వం ఫీరోజీ మహర్షి ఆరాధనోత్సవాలు ఆషాఢశుద్ధ ఏకాదశి నాడు చేసేవారు. అది మంచి వర్షాకాలం కావడంతో ప్రస్తుతం ఆరోజున లఘు పూజ చేసి మాఘ శుద్ధ ఏకాదశినాడు పెద్దఎత్తున ఆరాధనోత్సవాలు చేస్తున్నారు.

వేమన, వీరబ్రహ్మేంద్ర స్వామి కోవలో కులమతాలకతీతంగా మానవత్వం ప్రధానంగా భక్తి అంత సూత్రంగా వేదాంతాన్ని ప్రబోధించిన మహర్షి ఫీరోజీ.

## 99. తడకన పల్లె రామయోగి కవి (1825 - 1895)

శైవ సంప్రదాయంలో ఎన్నో వేదాంత గ్రంథాలను రచించి వేదాంతాన్ని, యోగ విద్యను సుందరంగా చెప్పగల కవి, భక్తుడు, సద్గురువు తడకన పల్లె రామయోగి కవి 1825లో జన్మించి ఉంటారని చరిత్రకారులు భావిస్తున్నారు.

మార్కాపురం తాలూకా సుంకేసుల గ్రామంలో కాశ్యప గోత్రిక దంపతుల పున్నోజు శేషయ్య, వీరమ్మ అనే విశ్వకర్మ కులానికి చెందిన దంపతుల ద్వితీయ సంతానంగా జన్మించిన రామయ్య బడి చదువులన్నీ సుంకేసులలోనే పూర్తి చేశాడు. పండితుల వద్ద సాహిత్యం, ఛందోవ్యాకరణాలు, జ్యోతిషం, గృహ వాస్తు, జలవాస్తు, శల్యవాస్తు విద్యలను అభ్యసించారు. స్వర్ణదారు శిల్పకళల్లో నిపుణులయ్యారు. చక్కని కవిత్వం వ్రాసేవారు. మహా పురుషుల సాంగత్యంతో వేదాంతం ఒంటబట్టి వైరాగ్యపథంలో పయనించారు. సుబ్రహ్మణ్య యనే బ్రాహ్మణోత్తముని వద్ద బ్రహ్మోపదేశం పొంది మహానందిలో 3 నెలలు కఠోర సాధన చేశారు. అభిమానులు, శిష్యుల కోరికపై రామయోగి కర్నూలు జిల్లా తడకన పల్లెలో స్థిర పడ్డారు. అక్కడ వృత్తి సాగిస్తూనే నిస్సంగంగా సంసారం ఈదుతూ అష్టాంగ యోగంలో ఆరితేరి బ్రహ్మ సాక్షాత్కారం పొంది

రాజయోగి అయ్యారు. బ్రహ్మానుభవం వల్ల ఆయనకు వాక్సిద్ధి, దూరదృష్టి, దూరశ్రవణం అలవడ్డాయి. శిష్యులకు సాహిత్యం, వేదాంతం, రాజయోగం బోధించారు.

కవిగా ఆయన మహానందీశ్వరునికి అంకితంగా ఎన్నో గ్రంథాలు రచించారు. వాటిలో శంకర శతకం, మహానంది లింగ శతకం, వేదాంత సూత్రాలు, షట్స్థల దర్పణం, పంచరత్నాలు, నవరత్న మాలిక, శంభు శతకం, లింగమూర్తి పాట, భ్రమరాంబా దండకం, రామతారక బ్రహ్మశతకం, మహావాక్య ప్రకరణం, శుద్ధ రాజయోగ వంటి గ్రంథాలను, పద్యకావ్యాలను రచించారు.

రామయోగి తన శరీరం త్యజించే విషయం ముందుగానే శిష్యులకు తెలిపి మన్మథ నామ సంవత్సరం మార్గశిర బహుళ తదియ గురువారం 5-12-1895 నాడు తమ 70వ ఏట శివైక్యం చెందారు. ఆయన సూచన మేరకు తడకనపల్లెలో సమాధిచేసి లింగ ప్రతిష్ఠ చేసి, నిర్మించిన మందిరంలో ఈనాటికీ ప్రతిఏటా మార్గశిర బహుళ తదియనాడు ఆరాధనోత్సవాలు, రథోత్సవం జరుపుతున్నారు.

## 100. కొత్తలంక సయ్యద్ అహ్మదలీషాఖాదర్‌వలీ (1868 - 1948)

నిజాం రాజ్యంలోని నల్గొండ జిల్లా గొల్లపల్లి జాగీరుదార్ల వంశంలో జన్మించిన సయ్యద్ అహ్మదాలీషా ఖాదర్‌వలీ తూర్పుగోదావరి జిల్లా అమలాపురం తాలూకా ముమ్మిడివరం మండలం కొత్తలంక గ్రామంలో 1948 లో సిద్ధి పొందడంతో ఆయన కొత్తలంక యోగిగా ప్రసిద్ధి చెందారు. 1921 జనాభా లెక్కల నాటికే ఆయన వయస్సు 125 సంవత్సరాలు కావటంతో ఆయన జనన సంవత్సరం 1796గా భావిస్తున్నారు. మరికొందరు 1868 గా నిర్ణయించారు. 1850 ప్రాంతంలో కుండలేశ్వరం గ్రామం గౌతమీనది ఒడ్డున గల మిఠాయి పాకవద్ద ఆయన కౌపీనం మాత్రమే ధరించే ఒక మట్టి పాత్రను కూడా ఉంచుకునేవారు రెండు సార్లు శరీరం తడవకుండా గౌతమీ నదిని దాటడం గమనించిన వారు ఆయనను సిద్ధ పురుషుడుగా గుర్తించారు. రాజమండ్రి కోటి లింగాలమఠంలో ఉండే కృష్ణావధూత వలీ అనుగ్రహం కోసం ప్రయత్నించి పట్టుదలతో సేవించి ప్రసన్నులను చేసుకున్నారు. తన పరీక్షల్లో నెగ్గిన వారినే వలీ అనుగ్రహించేవారు. ఆశ్రితులు అడిగే శుభాశుభ ప్రశ్నలకు సమాధానాలిస్తూ లోకోపకారం చేసేవారు. ఎన్నో అద్భుతాలు, మహిమలు ప్రదర్శించారు. ఎందరో ఆయనకు శిష్యులయ్యారు. ఆయనను బ్రాహ్మణులతో సైతం అన్నివర్ణాల వారు ప్రేమించారు, సేవించారు. ఆయన ప్రదర్శించిన ఖండయోగం, రంగూన్ సైనికాధికారి ఆదేశంతో బ్రిటిష్ వారు దాడి చేస్తారని చెప్పిన కాలజ్ఞానం, కొబ్బరి కాయలకు కొమ్ములు మొలిపించడం వంటి ఎన్నో అద్భుతాలను ప్రదర్శించారు. మహమ్మదు ప్రవక్త జన్మదినం 22-1-1948 న మిలాదినాభి

పండుగనాడు సర్వజిత్ సర్వజిత్ సంవత్సర పుష్యశుద్ధ ఏకాదశి గురువారం నాడు ఆయన జీవసమాధి అయ్యారు. ఆయన సమాధి వద్ద మూడు రోజులు వరుసగా నిద్రిస్తే ఆయన స్వప్నంలో సాక్షాత్కరించిన సంఘటనలు కూడా ఉన్నాయి. కాగా ఆయన 1818లో జన్మించినట్లు,1947 లో అప్పటి కాంగ్రెస్ నాయకులు కళా వెంకట్రావు, బులుసు సాంబ మూర్తిలు వలీని దర్శించే నాటికే ఆయన వయస్సు 175 సంవత్సరాలని భావిస్తున్నారు. 1953లో వలీ సమాధిపై దర్గానిర్మించారు. ఈనాటికీ దేశం నలుమూలలనుంచే గాక కువైట్, పాకిస్తాన్, దుబాయి వంటి దేశాలనుంచి కూడా ఆయన దర్గాను దర్శించడానికి కొత్తలంకకు వస్తూ ఉండటం విశేషం.

